# హిందువుల పండుగలు.



గ్రంథకర్త

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు

బి. ఏ. బి. ఎల్.



డాక్టర్ సర్. యస్. రాధాకృష్ణగారి పీఠిక.

౧౯౩౧ వెల ౧-౧౨-౦

# వి ష య సూ చి క



| విషయము | పుటలు |
| --- | --- |
| అక్షయతృతీయ | ౭౦-౮౭ |
| గణేశచతుర్థి | ౮౭-౮౯ |
| చాతుర్మాస్యము | ౮౯-౧౦౦ |
| పరశురామజయంతి | ౧౦౧-౧౦౫ |
| బుద్ధజయంతి | ౧౦౬-౧౧౦ |
| హోళీ | ౧౧౧-౧౩౦ |
| నాగపంచమి | ౧౩౧-౧౪౫ |
| ఏకాదశి | ౧౪౬-౧౫౬ |
| శీతలాసప్తమి | ౧౫౭-౧౫౯ |
| వసంతపంచమి | ౧౬౦-౧౬౧ |
| మహాశివరాత్రి | ౧౬౨-౧౬౯ |
| హరితాళిక | ౧౭౦-౧౭౦ |
| దూర్వాష్టమి | ౧౭౧-౧౭౧ |
| చంపాషష్ఠి | ,, ,, |
| స్కందషష్ఠి | ౧౭౨-౧౭౨ |
| గౌరీతృతీయ | ౧౭౨-౧౭౩ |
| దశహర | ౧౭౪-౧౭౫ |
| అశోకషష్ఠి | ౧౭౫-౧౭౬ |
| ఆదివారవ్రతము | ౧౭౭-౧౭౯ |
| సోమవారవ్రతము | ౧౭౯-౧౮౦ |
| మంగళవారవ్రతము | ౧౮౧-౧౮౨ |
| బుధవారవ్రతము | ౧౮౨-౧౮౪ |
| గురువారవ్రతము | ౧౮౪-౧౮౬ |
| శుక్రవారవ్రతము | ౧౮౬-౧౮౭ |
| శనివారవ్రతము | ౧౮౭-౧౮౯ |
| భక్తేశ్వరవ్రతము | ౧౮౯-౨౦౧ |

| విషయము | పుటలు |
|---|---|
| కేదారేశ్వరవ్రతము | ౩౦౧–౩౦౧ |
| యమద్వితీయ<br>భ్రాతృద్వితీయ | ౩౦౨–౩౦౩ |
| అముక్తాభరణము | ౩౦౪–౩౦౫ |
| సంకష్టహరణచతుర్థి | ౩౦౬ |
| వటసావిత్రీవ్రతం. | ౩౦౭ |
| ఏరువాక పున్నమ | ౩౦౮–౩౧౨ |
| మంటిరొద్దుల అమావాస | ౩౧౩ |
| ప్రతిమాసకుండలి<br>పంచాంగపట్టిక | ౩౧౪–౩౧౭ |
| అకారాదివిషయసూచిక | ౩౧౮–౩౨౦ |



# పీఠిక

శ్రీయుత ప్రతాపరెడ్డి గారిచే విరచితమైన «హిందువుల పండుగలు», యను గ్రంథమునకు విపులముగ పీఠిక వ్రాయుటకు నాకువ్యవధిచాలదు; శక్తియుచాలనిదియే; కాని ప్రీతిప్రేరితమగు వారి యాహ్వానము ను వ్యర్థపరుప సాహసింపను. అనేకులు, మనదేశీయులు, పూర్వాచార నిబద్ధులై, ప్రాచీన సాంప్రదాయములనుండి యించుకంతయు తొలగలేక, శుభాశుభకార్యముల నవక్రమించుచు కాలముగడుపుచున్నారు. అట్టి వారికి రెడ్డిగారి గ్రంథము మిక్కిలి యుపయోగకరము. విద్యావంతులు, మన ఆచారములపట్ల విముఖత్వముకల్గియుండుటసామాన్యదృశ్యము. మన ఆచారములు పెక్కులు ఖండనార్హములను సర్వవాదాంశము. అయినను, శుభసూచకములును, ప్రియజనకూటమికి హేతువులును, సంతోషజనకములును నగు పండుగులపై యనుగల్గియుంట శోచనీయములు. ఇట్టివారిచేగూడ నీగ్రంథము పఠనార్హమే.

పండుగలు ఆధ్యాత్మికవృత్తికి అవసరములా, పరలోకసుఖప్రదములా యన్నచర్చ అనవసరము. అయ్యది ముఖ్యముగ సాంసారిక, సాంఘిక జీవికభారమును యించుక తొలగించి, సంతోషమును చేకూర్పనేర్పడిన శుభక్రతువులు.

ప్రతాపరెడ్డిగారు సులభశైలిన, పురాణేతిహాస పురస్కరముగ రచించిన ఈ గ్రంథము హైందవ మతావలంబులగు, ఆంధ్రుల కెల్లరకును, యందు ముఖ్యముగ స్త్రీలకు, మిక్కిలి యుపయోగకర మని నాదృఢనమ్మకము.

డాక్టరు యన్. రాధాకృష్ణ.

This book is with kind permission

dedicated to

*Goswami Raja Narsingirji*

*Dhanrajgirji Esquire*

at whose suggestion and by whose generosity we have been enabled to publish it and to whom we are highly thankful for every encouragement he gave us in the preparation of this book.

Publishers.

# కృతజ్ఞత

ఈగ్రంథముయొక్క ముద్రణాది వ్యయములకై ౫౦౦ రూపాయిలు గోలకొండ పత్రికా ముద్రణాలయమునకు దానపూర్వకముగా నిచ్చిన

గో స్వామి శ్రీరాజాధనరాజగీర్జిగారికి

మేమత్యంత కృతజ్ఞులమైయున్నారము. శ్రీధనరాజగీర్జిగారి యౌదార్యమును ప్రశంసించుచు వారు మాకుచేసిన సహాయమును స్మరించుచు వారికి సర్వేశ్వరుఁడు సదాఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని సమకూర్చుఁగాతమని ప్రార్థించుచున్నాము.

ప్రకాశకులు.

# ఉపోద్ఘాతము

ప్రతిమతమందును పండుగులు గలవు. అవి యనేక కారణములచేత జరుపఁబడుచున్నవి. హిందువులందును పండుగులు పెక్కుగలవు. బహుశః హిందువులలోనుండు పండుగు లేయితర మతస్థులందును లేకుండవచ్చును. అయినను హిందువులలో ననేకులకుఁదాము పండుగలనేల చేయుచున్నారో తెలియదని చెప్పవచ్చును. సుప్రసిద్ధములైన విజయదశమి దీపావళి పండుగుల విషయమై పండితులుసహితము సరియైన కారణములు చూపించుటలేదు. అంధపరంపరగా వాడుకొను కారణములే చూపుదురు కాని యవిసరియైనవా కావా యను విషయమును విచారించు శ్రమకుఁబోరు. ఈ గ్రంథరచనమున కిదియొక కారణమని మొదలే విన్నవించుకొనుచున్నాను.

సాధారణముగా పండుగలను హిందువులు వ్రతములుగా నెంచుచున్నారు. ప్రతివ్రతమును మంత్రపూర్వకముగ జరుపుచున్నారు. మంత్రముల నుచ్చరించుటకు పురోహితుల యావశ్యకముండును. హిందువులలో పండుగులు బహుప్రాచీనమునుండి యేర్పడుచు వచ్చినవి. వీని విషయమై బహుపురాణములందు చర్చించియున్నారు. ఇంతియగాక కొన్ని స్మృతిగ్రంథములందును వీని చర్చగలదు. హారీతస్మృతియం దిట్లున్నది.

శ్లో॥ మహానవమ్యాం ద్వాదశ్యాంభరణ్యామపిపర్వసు।
తథాక్షయతృతీయాం శిష్యాన్నాధ్యాపయేద్ద్విజః॥

శ్లో॥ మాఘమాసేతుసప్తమ్యాం రథాఖ్యాయాంతువర్జయేత్।
అధ్యాపనంసమభ్యంజన స్నానకాలేచవర్జయేత్॥

అనగా,

మహానవమియందును (దేవీ నవరాత్రులు) ద్వాదశియందును, భరణీ నక్షత్రమందును, పర్వములందును, అక్షయతృతీయయందును,రథసప్తమి నాడును, మాఘసప్తమి యందును, గురువుశిష్యుల కధ్యాపనము చేయగూడదు

మన పండుగులను నాలుగైదు భాగములుగా విభజింపవచ్చును. పూర్వములోకోత్తర పురుషులై యీప్రపంచమందు లోకహితార్థమై యుత్తమకార్యములను జేసిపోయిన మహానుభావుల జన్మదినోత్సవములు కొన్నిగలవు. శ్రీరామకృష్ణ జయంతులిందులకు నిదర్శనములు.

రెండవవర్గమందు ఋతుసంబంధమయిన యుత్సవములు చేరును. ఉగాది, సంక్రాంతి, హోలి, రథసప్తమి వంటివి యీశాఖయందు చేరును. హిందువులు ప్రకృత్యారాధకులుగా నొకకాలమందుండినవారని వేదకాలమందార్యులు ద్యావాపృథివీ వరుణేంద్రాది దేవతలను బూజించిన విధానమే సూచించుచున్నది.

మూడవవర్గమందు శైవవైష్ణవ సంబంధమగు

ములు జేరుచున్నవి. శైవవైష్ణవ భేదములు వేదకాలమందు లేకుండెను. పురాణకాలమందవి యేర్పడఁజొచ్చెను. ఇట్లు శైవవైష్ణవ సాంప్రదాయానుసారముగ గొన్నిపండుగలేర్పడినవి. వైష్ణవులకు అనంతచతుర్దశి, ఏకాదశి ముఖ్యమయినవి. శైవులకు వినాయకచతుర్థి, మహాశివరాత్రి నవరాత్రులుమున్నగునవి ముఖ్యము.

తక్కిన పండుగలను నాల్గవవర్గమందు జేర్పవచ్చును. విజయదశమి కేవలము రాజులకుసంబంధించినదిగా గానఁబడుచుండినను జనసామాన్యము దీనిని భక్తితో నాచరించుచున్నారు.

కొన్ని పండుగలు సర్వజనులలో లేకున్నను ద్విజులకును స్త్రీలకును ముఖ్యమైనవై యున్నవి. ద్విజులకు రక్షాపూర్ణిమ ముఖ్యమైయున్నది. మఱియు స్త్రీలు విశేషముగా వ్రతములు సేయుచుందురు. వారవ్రతములు (ఆది, సోమాదివ్రతములు) అశ్వత్థతులసీవ్రతములు లక్ష్మీవ్రతము, సత్యనారాయణవ్రతము మున్నగునవి స్త్రీలచే విశేషముగా నాదరింపబడుచున్నట్టివి.

స్త్రీలాచరించు వ్రతముల గుఱించి గుప్తేపండితుడు (Hindu Holidays and Ceremonials) హిందువుల వ్రతములు అనుగ్రంథమందలి యుపోద్ఘాతమందిట్లు వ్రాసియున్నారు.

ప్రపంచమందంతటను స్త్రీలే పురోహితుల వ్యాపారమునకనువైనవారికి, కావుననే హిందూస్త్రీలప్రత్యేక వినోదార్థమై గోపద్మ, పంచదేవ, శుక్రవారవ్రత, నాగపంచమివంటి

యనేక వ్రతములు కల్పింపఁబడినవి. శాస్త్రములందుఁ గొన్ని దే వండుగలు సూచింపబడినవి. పురాణములా సంఖ్యను బెంచినవి. తర్వాత జనసామాన్య మనేక గాథలు త్రవ్వి పైవానినపరిమితముగా బెంచినది. ఈ కడపటివర్గము పౌరోహితు లందును స్త్రీలయందును విశేషముగా దాగియున్నది."

పైపండితుని యభిప్రాయమందు గొంత సత్యములేకపోలేదు. బౌద్ధమహాయుగము నాటికే హిందువులు తమపూర్వౌన్నత్యమును గొంతగోల్పోయిరి. ఆకాలము వఱకే స్త్రీ జ్ఞానమియ్యగూడదని కొన్ని శాస్త్రములు బయలుదేరెను. అట్లు స్త్రీశూద్రులను మూర్ఖావస్థయం దుంచుటయేగాక వారికి మతవిషయములగు సిద్ధాంతము లంతగా బోధింపకపోయిరి. ఇట్లు స్త్రీశూద్రులు మూర్ఖులైనను గూడ వారి నెట్లు చేయఁదలచినను నట్లు చదివినవారి చేయవచ్చునుగదా! కావుననే వ్రతములు పెచ్చుపెరిగిపోయెను. మఱియు నిజమగు వస్తుతత్త్వమును బోధింపనందున నెవ్వరికి దోచినట్లు వారు పురాణములఁ గల్పింప మొదలిడిరి. అనేక వ్రతముల కనేక కథలు కల్పింపఁబడెను. శౌనకాదిమునులో, నారదుడో, వైశంపాయనుడో, వ్యాసుడో, శ్రీకృష్ణుడో యెవరోయొకరు బోధకులగుదురు. ధర్మరాజో, జనమేజయుడో యెవ్వరోయొకరు శిష్యులై భక్తిపూర్వకముగా వినుదురు. అట్టి గురుశిష్యుల సంవాదమును హిందువులందఱును శిష్యునక యాదరించి భక్తి శ్రద్ధాయుక్తులై యాచరించి సఫలులగుచును. ఇట్లుత్సవము

శములుత్పత్తియయ్యెను.

ప్రకృతము నేను వ్రాసిన గ్రంథమందలి విషయములు పండుగలను నేమి విశేషమో యేమియు దెలియని జనులకై వ్రాయఁబడినవి. ఈగ్రంథమును వ్రాయుటకింకొక కారణము కూడఁగలదు. అది వినఁదగిన యంశము. వినోదకరమగు నంశమును. విభవసంవత్సర విజయదశమినాఁ డివసమున మహాఘనత వహించిన శ్రీనిజాము ప్రభువుగారు శ్రీరాజా వెంకటరామారెడ్డి బహద్దరు (కొత్వాలు) గారిని విజయదశమిని హిందువు లెందుకు చేయుదురని విచారింప వారికి అర్జును డుత్తర గోగ్రహణమునందు శత్రువులజయించిన కారణముచే చేయఁబడుచున్నదని నుడివిరట— ఇంతకు పూర్వ మొకనిని విచారింప నతఁడి? శ్రీరాములు రావణునిపై జయముపొందిన సందర్భమున జరుగునదని చెప్పె... దరిమాట నిజము,, అని మ॥ ఘ॥ శ్రీనిజాంప్రభువు ' . విచారింప శ్రీరెడ్డిగారునిరుత్తరులై అదే దివసమందే శ్రీ . జా ధనరాజగీర్జిగారితో నీవిషయమును గుఱించి ప్రస్తావించిరట. శ్రీధనరాజగీర్జీగారును హిందువులు తమతమ పండుగల సంగతి నేమియు నెఱుఁగకుండుట యెంతటి హాస్యాస్పదమో కదా యని విచారించి యెవరిచేనయిన నీవిషయికమగు గ్రంథమొక దానిని వ్రాయించినఁ జాలబాగుండునని సెలవిచ్చిరట. అప్పుడు శ్రీరాజా వేంకటరామారెడ్డి బహద్దరుగారు నన్నీపని నెరవేర్పుమని యాదేశించిరి. అందులకు సామర్థ్యము లేకున్న

ను వారి యభిలాష యనుల్లంఘనీయమగుటఁ జేసి యీగ్రంథమును వ్రాసితిని.

ఆంధ్రమందిట్టి గ్రంథముండినట్లు నాకుగానరాలేదు. కాని యాంగ్లమందును రెండు మూడు గ్రంథములున్నను నయ్యవి యీవిషయమను దృప్తికరముగాఁజర్చించినవిగావు.

ప్రతిపండుగను గుఱించి కొన్ని విమర్శనలు వ్రాసినాడ నవియెంతవఱకు సమంజసముగా నున్నవో పాఠకులే నిర్ణయింపగలరు. ఏదియెట్లున్నను నా సాహసమును గుణగ్రహణపారీణులు మన్నించి యిందువిశేషమున్న గ్రహించి తప్పులను జూపించిన రెండవముద్రణ మీగ్రంథము సర్వాంగ సుందరముగా నొనర్చెదనని యందుకృతజ్ఞతాపందనపూర్వకముగా నవరించుకొందునని విన్నవించువాఁడ.

ఈగ్రంథమందు వ్రాసిన విషయములలో పండుగ, ఉత్సవము, వ్రతము, జయంతి, మున్నగునవన్నియుఁ జేరినను సౌకర్యార్థము గ్రంథనామము "హిందువుల పండుగలు" అనియే స్థిరపఱచితిని.

ఈపండుగలవిషయమై యింకను విశేషముగా తెలిసికొనగోరువారీ క్రిందిగ్రంథములు చూడగలరు.

౧. వ్రతచూడామణి.
౨. వ్రతరాజము.
3. జయసింహకల్పద్రుమము
౪. ధర్మసింధువు.

౫. నిర్ణయసింధువు.
౬. భవిష్యత్ పురాణము.
౭. స్కాందపురాణము.
౮. Hindu Holidays and Festivals
by B. A. Gupta
౯. ఆర్యపర్వపద్ధతి (హిందీ)

ఈయుపోద్ఘాతమును ముగించుటకు బూర్వ మొకముఖ్య విషయము మనవి చేసికొనవలసి యున్నది. ఈగ్రంథమునకుం గారకులును, కోటీశ్వరులును, సదాశయులును, భూరిదాతలునగు [illegible] సర్పింగిర్జీ ధనరాజగీర్జీగారు ౫౦౦ హాలీ రూపాయిలు ఈగ్రంథముద్రణ వ్యయమునకని గోలకొండ పత్రికా కార్యాలయమువారికి అనుగ్రహించి యున్నారు. వారికి నేనెంతయు కృతజ్ఞుడను. వారికిం బరమేశ్వరుండితోధికాయురారోగ్యైశ్వర్యముల బ్రసాదించుగాత.

ఈ గ్రంథమునకు పీఠికను వ్రాసియిచ్చిన డా॥ సర్. యస్. రాధాకృష్ణ గారికి నేనత్యంత కృతజ్ఞుడను.

ఇట్లు

సురవరము ప్రతాపరెడ్డి



# చిత్రపటముల వివరము

**శ్రీకృష్ణుడు:**- త్రివర్ణచిత్రము. ఇది కే. రామాచార్యులు అను చిత్రలేఖకులచే నా భావములననుసరించి వ్రాయంబడినట్టిది.

**వామనుడు:**- ఇదిసుమారు ౨౦౦ వండ్లక్రిందటి చిత్తరువుగనుండును. దీనినినేను హైదరాబాదు నగరములో కొనియుంటిని. దాని ప్రతిబింబమిది

**భీష్ముడు:**— ఈపటమందు భీష్ముడు అంబ, అంబిక, అంబాలికను గొనిపోవుచు నాపదుచుల చుట్టములతో యుద్ధము చేయుట చిత్రింపబడినది. ఈచిత్తరువు సుమారు ౨౦౦ ఏండ్లనాటిది. మొగలాయిచిత్రము (Mogul school) ఇది గద్వాల సంస్థానపు రాజుల గ్రంథాగారమునది.

**త్రిమూర్తివిగ్రహము:**—ఇదిఎలిఫేంటాద్వీపములోని శిల్ప ప్రతిబింబము. దత్తాత్రేయుని నిరూపించునది.

**శివలింగము:**—ఇదియు ఎలిఫెంటాద్వీపములోనిది.

# వ్రతమనగా నేమి



వ్రతమను పదమునకు వాచస్పత్యనిఘంటు కారుడగు తారానాథ తర్కవాచస్పతి యిట్లర్థము చేసియున్నాడు.

వ్రజఘుజన్యత్ః । భత్షణభేదే ఉణాది పుణ్యసాధనే: ఉపవాసాది నియమభేదేచ.

అనగా పుణ్యసాధనమునకై యుపవాసాది నియమములచే జేయుకార్యములకు వ్రతమని యర్థము.

దీనినేవివరించుచు పైనిఘంటువ నిట్లువ్రాయబడినది. «వ్రతం చనమ్యక్సం కల్పజనితానుష్టేయక్రియా విశేషరూపం తచ్చప్రవృత్తినివృత్త్యుభయరూపం. తత్రద్రవ్య విశేష భోజన పూజాదికం ప్రవృత్తిరూపం ఉపవాసాదికంచ నివృత్తిరూపం-తచ్చనిత్యం నైమిత్తికంకామ్యంచ నిత్యమేకాదశ్యాది వ్రతం నైమిత్తికం చాంద్రాయణాది వ్రతం కామ్యంతత్ర త్రిఘ్యువవాసారూపం"

దీనియర్థమేమనగ వ్రతమనసంకల్ప పూర్వకముగా నమ్యగనుష్ఠానము చేయుట.

ఈ వ్రతము ప్రవృత్తి, నివృత్తి రూపములని రెండు విధములు. భోజన పూజాదికములతో గూడినది ప్రవృత్తి రూపము. ఉపవాసాదికమైనది నివృత్తి రూపము. వ్రతములు మూడు విధములయినవి. ౧ నిత్యవ్రతములు. [౨] నైమిత్తిక వ్రతములు (3) కామ్యవ్రతములు.

౧. ఏకాదశీ వ్రతముల వంటి వెల్లకాలములందును చేయదగినవి గాన నట్టివి నిత్యవ్రతము లనబడును.
౨. చాంద్రాయణాది వ్రతములు నైమిత్తికములనబడును.
౩. అభీష్టార్థములందుపవాసముండి చేయువ్రతములు కామ్యములనబడును.

వ్రతములలో నింకను అనేక విధములయినవి కలవు. అందు మానసిక వ్రతములను గురించి వరాహ పురాణమందిట్లున్నది.

శ్లో॥ అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యమకల్మషం।
ఏతాని మానసాన్యాహు ర్వ్రతాని వ్రతధారిణాం॥
ఏకభక్తం తథా నక్త ముపవాసాదికంచయత్।
తత్సర్వం కాయికం పుంసాం వ్రతం భవతి నాన్యథా॥

వ్రతములు మానసికములు కాయికములని రెండు విధములు. అనగా అహింస, సత్యము, దొంగతనము చేయకుండుట, బ్రహ్మచర్యము, అకల్మషత్వము, ఈగుణములు గలిగియుండుట

మానసిక వ్రతములనఁబడును. ఇఁక యొక్కప్రొద్దు రాత్రి కాలమందుపవాసముండుట, మున్నగునవి కాయిక వ్రతములనఁబడును.

వ్రతానుష్ఠానముల పద్ధతి బహు ప్రాచీనమునుండి వచ్చినట్లు కొన్ని పురాణ ప్రమాణముల వలనఁ దెలియ వచ్చెడి. ప్రాచీన కాలమందు, రాజులు తమ యభీష్టముల సిద్ధ్యర్థమై వ్రతములఁ జేయుచుండిరని మనము పురాణగాథలందుఁ జదువుచున్నాము. గరుడ పురాణమందుఁ బూర్వము నానా రాజులు వ్రతముల వలన నెట్టిఫలమును బొందిరో చూపింపబడినది. ఆశ్లోకముల నీక్రింద నుదహరించుచున్నాను. ...

శ్లో॥ దుంధుమారస్తు రాజర్షి ర్లేభే పుత్ర శతంవరా।
దానేన నియమేనైవ తపసాచవ్రతేనచ॥
సగరోనామరాజర్షి ర్ధర్మసర్వాసువిశ్రుతః।
పుత్రాణాంచ శతంప్రాప్తం తేనరాజ్ఞామహాత్మనా॥
తథాదశరథో రాజా, వ్రతేష్వనిరతస్సదా।
యజ్ఞదానతపోయోగైః సంతుష్టః పురుషోత్తమః॥
స్వయంపుత్రత్వమాపేదే, తస్యరాజ్ఞో మహాత్మనః।
జనకోనామ రాజర్షి స్తపో వ్రతవిధిష్వ్యయం॥
ఐశ్వర్యమతులంప్రాప్య, యోగినాంగతి మాప్తవాన్।
ఏవమేవ మహారాజ రాజానో బ్రాహ్మణస్తథా
ఐశ్వర్యమక్షీణంప్రాప్ను ర్గతిం వైవ్రత వైభవాత్।

ద్ధినిభావ మేమన. దాననియమ తపోవ్రతములచేత బూర్వము ధుంధుమారుండను రాజు నూర్గుర కుమారుల గనెను. దశరథమహారాజు వ్రతములకుఁ బురుషోత్తముండు మెచ్చి తానె యాతని పుత్రుండై జన్మించెను. జనక మహారాజు తపోవ్రతములచేత నైశ్వర్యవంతుడై యుత్తమగతిని బొందెను ఈ ప్రకారమే పూర్వము రాజులును బ్రాహ్మణులును వ్రత వైభవముచే నుత్తమైశ్వర్యములను బొందిరి. వ్రతములవలని లాభములను గురించి ఆదిత్యపురాణమిట్లు చెప్పుచున్నది. ...

శ్లో॥ వ్రతోపవాసాః ఖలు యోవిధత్తే
దారిద్ర్యపాశం సభినత్తిచాసు,
వ్రతోపవాసేషు రతస్యపుంసః
నైవాపదశ్శాంతి ముశాంతితజ్ఞాః॥

వ్రతములు, ఉపవాసములు చేయువాడు తనదారిద్ర్యమును బోగొట్టుచున్నాడు. మరియు వాని కేయాపదలును నుండవు అనిదీని అభిప్రాయము.

గుణములందు నీచుఁడై కేవలము వ్రతోపవాసములు చేసిన ఫలములేదు. వ్రతమునకు దగినట్లుగా నుత్తమగుణములు కూడ గలిగి యుండినవానికిఁజాల శ్రేయస్సుగలుగును. ఈయంశమునే స్కాందపురాణమిట్లు బోధించుచున్నది:

శ్లో॥ నిజవర్ణాశ్రమాచార నిరతశ్శుద్ధమానసః
ప్రతేష్వధికృతో రాజన్ అన్యథా విఫలః శ్రమ
అలుబ్ధస్సత్యవాదీచ సర్వభూతహితే రతః ।
ప్రతేష్వధికృతో ... ...
శ్రద్ధావాన్ న్యాయశీలశ్చ మదదంభ వివర్జితః!
ప్రతేష్వ ... ... ...
సమస్సర్వేషు భూతేషు శివభక్తో జితేంద్రియః
ప్రతేష్వధి ... ... ...

నిజకులాచారములను విడువని వాఁడును శుద్ధమానసుఁడును లోభి కానివాఁడును, సత్యవాక్పరిపాలకుఁడును, సర్వభూతముల మేలుకోరువాఁడును, న్యాయశీలుఁడును, మదదంభాది దుర్గుణరహితుఁడును, దేవభక్తుఁడును, జితేంద్రియుఁడును నగు వాఁడే వ్రతములు చేయఁదగినవాఁడు కాని యితరుఁడు చేసిన నది విఫలమగును అని దీనిభావము. దేవలుఁడు తనస్మృతి గ్రంథమందును నిట్లు సెలవిచ్చినాఁడు.

శ్లో॥ వ్రతోపవాస నియమైః శరీరోత్తాపనైస్తథా
వర్ణాస్సర్వేపి ముచ్యంతే పాతకేభ్యో నసంశయః

అనగా వ్రతోపవాస నియమములచేత మనుష్యుఁడు తనపాపములనుండి విముక్తి చెందుచున్నాఁడు.

ఇక వ్రతముల నెవ్వరెవ్వరు చేయవచ్చునో విచారింతము. బ్రాహ్మణాది ద్విజాతులకు మతమందు సర్వాధికారములుండు మాటనిస్సందేహము. ఇక మిగిలినవారు శూద్రులు.

శ్లో॥ తస్మాద్వేదః పరో మంత్రో నమంత్రో వేదతః పరః।
నమంత్రాధికారోఽస్తి శూద్రాణాం నియమః పరః॥
మంత్రాభావాదమంత్రేణ భాషితం సర్వకర్మసు హి।

అనగా వేదముకన్న వేరుమంత్రము లేదు. వేదమే మంత్రము. కావున శూద్రునికి మంత్రాధికారము లేదు. మంత్రాధికారము లేనందువలన వానికి సర్వకర్మలు అమంత్రకముగానే యుండవలెను. ఈ శూద్రులతోడు స్త్రీలు. స్త్రీ శూద్రులకు మనమతమందు వాక్కు లేనాడు తగ్గనో నాటి నుండియు మతము క్షీణించి పోయెననుటలో సందేహము లేదు. శూద్రులు కూడ వ్రతములు చేయవచ్చునని వ్రతగ్రంథకారులు వ్రాసియున్నారు. కాని శూద్రుల వ్రతములు అమంత్రకముగా నుండవలెనని పైయుదాహృత శ్లోకమువలన విశదము. ఒకవేళ కొన్ని వ్రతములకు మంత్రము లవసరమైన వారికి పౌరాణిక మగు మంత్రములే చెప్పవలెను. కాని వేదమంత్రములు చెప్పి వైదికముగ వ్రతములు చేయింప గూడదని చెప్పుదురు. స్త్రీలు శూద్రులకన్న గనిష్ఠులు. మనయాచారమందు స్త్రీలకు స్వాతంత్ర్యమే లేదని యనేక నీతిగ్రంథములు శాస్త్రగ్రంథములు బహులు జెప్పెను.

శ్లో॥ పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే।
రక్షంతి వృద్ధే పుత్రాః న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి॥

స్త్రీ బాలికగా నుండినప్పుడు తండ్రి రక్షించును. వయస్సు వచ్చినపైన మగడు రక్షించును. ముదుసలియైన కొడుకు

రక్షించును. కావున స్త్రీకి స్వాతంత్ర్య మవసరములేదు. అని దీనియర్థము. ఇట్లు ఆజన్మమరణము స్త్రీకి స్వాతంత్ర్యము లేని కారణమున స్త్రీకి వ్రతాధికార మెంతవఱకుఁ గలదో విచారించెదముగాక.

మార్కండేయ పురాణమం దిట్లున్నది.

శ్లో॥ నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో।
న వ్రతం నాప్యుపోషణం।
భర్తృశుశ్రూషయైవైతా।
లోకానిష్టాన్ వ్రజంతి హి॥

ఆదిత్యపురాణమందును మనుస్మృతియందును నీశ్లోకము కించిద్భేదముతో వ్రాయఁబడియున్నది. ఇట్టి యభిప్రాయమే యితర పురాణములందును గనఁబడుచున్నది. దీని భావమేమన స్త్రీలకు యజ్ఞముగాని, వ్రతముగాని, నుపవాసముగాని నవసరములేదు. భర్తయొక్క శుశ్రూషయే వారికి ముఖ్యవ్రతము. దీనిచేత వారు కిష్టమైన లోకములను పొందగలరు.

మనోక్త ధర్మశాస్త్రము లన్నియు స్త్రీలకు వ్రతాధికారము లేదని స్పష్టీకరింపఁబడినది. పరాశరస్మృతియందలి కొన్నిశ్లోకము లిట్లున్నవి.

శ్లో॥ పత్యౌ జీవతి యా నారీ ఉపోష్య వ్రతమాచరేత్।
ఆయుష్యం హరతే భర్తుస్సా నారీ నరకం వ్రజేత్॥

శ్లో॥ అపృష్ట్వా చైవ భర్తారం యానారీ కురుతే వ్రతం।
పర్యంత ద్రాక్షసాన్ గచ్ఛేదిత్యేవం మనురబ్రవీత్॥

అనగా-భర్తయుండగా నేస్త్రీ యుపవసించి వ్రతము చేయునో యామె భర్తవయస్సు క్షీణింపజేయును. మఱియు, నామె నరకమునకు బోవును. భర్తయనుజ్ఞలేక వ్రతముచేయు స్త్రీయొక్క వ్రతఫలమంతయు రాక్షసుల పాలగునని మనువు సెలవిచ్చియున్నాడు. మనువు నుదహరించుటచే మనుస్మృతిలోను నీ నిషేధము కలదని స్పష్టము.

ఇంతవఱకుఁ జూపినరీతిగా స్త్రీ స్వతంత్రకాని కారణముచేత వ్రతములు చేయవలయుననియే యిచ్ఛకలిగినదైనఁ దాను కన్యగానుండిన తండ్రి యాజ్ఞనుబొంది, భార్యగానుండిన మగని సెలవుపొంది విధంతువుగానుండినఁ గొడుకు యనుమతినిబొంది వ్రతములు చేయవలయును. ఇది స్త్రీల విషయము.

ఇఁక వ్రతము చేయువారు పర్వదివసమునాఁడె ట్లాచరించి కొనవలయునో విచారించెదము. సాధారణముగాఁ బండుగకు పూర్వదినము రాత్రి భుజింపకూడదు. పండుగనాడు పొద్దుననే శిరస్నానము చేయవలయును. పిమ్మట దేవతాపూజలు సల్పవలెను. అయితే యీనియమములన్నిటికిని వర్తింపవు. సాధారణముగ జయంతులకన్నిటికీ బూర్వదినమొకపూట యుపవాసముందురు. మఱియు సంక్రాంతివంటి కొన్ని పండుగలనాడు తిలపిష్టముతో శరీరము శుద్ధ

కాని స్నానము చేయుదురు. మఱియు పూజావిషయములలో నన్ని పూజలును బొద్దుననే చేయుటకు వీలులేదు. శివరాత్రి, ఏకాదశివంటి పండుగలనాడు రాత్రియంతయు జాగరణము చేసి యా రాత్రియంతయు దేవధ్యానము తద్దేవతా కథాశ్రవణము చేయవలయును. పూజలలో మనుష్యపూజయు, పితృపూజయు దేవపూజయునని మూడువిధములైనవి కలవు. ఈ పూజల విషయమై నరసింహ పురాణమిట్లు చెప్పు చున్నది.

శ్లో॥ దైవకృత్యంతుపూర్వాహ్ణే మనుష్యాణాంచమధ్యమే।
ఆపరాహ్ణేపితౄణాంచ కార్యాణ్యేతునియత్నతః॥

అనగా ప్రాతఃకాలమందు దేవపూజయు మధ్యాహ్నమందు మనుష్యపూజయు అపరాహ్ణమందు పితృదేవతల పూజయు గావింపవలయును.

వ్రతము లనుష్ఠించుచుండియుఁ బ్రమత్తతచేత దానిని బూర్తిగావింపక పోయినవాఁడు మహాపాతకమనుభవించుచుండునని పురాణములు పల్కుచున్నవి.

శ్లో॥ యోగృహీత్వా వ్రతం మోహాత్ నాచరేత్ కామమోహితః । జీవన్‌భవతిచండాలో మృతః శ్వానైవజాయతే

ఎవ్వాడు వ్రతప్రారంభము జేసి మోహముచే దాని నాచరింపడో వాడు బ్రతికియుండఁగనే చండాలుఁడగును. మఱియు చచ్చిన పిదప కుక్కయై పుట్టును. అని పై శ్లోకము యొక్క యర్థము.

ఇవి వ్రతము యొక్క ముఖ్యాంశములు.
ప్రతిపండుగకు సరియైన కాల నిర్ణయము కూడ కలదు. దీపావళి నాడు చీకటిన స్నానముచేసి దీపములు వెలిగించవలెను. కాళిపండగను రాత్రి పూటనే చేయవలెను. పగలుచేసిన కార్యము కార్యమును నాశనమగుట నిశ్చయము వ్రాసినారు. విజయదశమిని సాయంకాలమే చేయవలెను. ఈ ప్రకారముగా నాయా పండుగలు చేయు విషయమై కాలనియమును వ్రతగ్రంధకారులు నిర్ణయించినారు.

మరియు కొన్ని కాలములు వర్జనీయము అనియు కొన్ని తిథి భేదములచే రెండు దినములు చేయదగినవనియు నిర్ణయింపబడినవి. ఈ విషయములను పౌరోహితుల వలన నా యా పండుగల సందర్భమున జనులు తెలిసికొని యాచరించుచుందురు.

వ్రత స్వరూపమును గురించి అగ్ని పురాణమందు వ్రత పరిభాష యను శీర్షికతో పంచ నవత్యధికశత తమాధ్యాయమందు విపులముగా వ్రాయబడినది. వ్రతస్వరూపమును గురించి యితర పైకొన్న విషయములు వివరింపబడినవి. కాని ప్రతిపదాద్యమావాస్య పర్యంతము నుండు తిథిగిరు మాత్రము సూచింపబడినవే కాని వివరింపబడలేదు. ఈ పురాణము బౌద్ధ జైన మతవ్యాప్త్యనంతరము వ్రాయబడినదని యీ పురాణమందలి "బుద్ధాద్యవతార ప్రకరణము

లోని యంశములే చాటుచున్నవి. ఇక వ్రతములవలని ఫలములను గుఱించి వ్రతకారుల యభిప్రాయమును విమర్శింతును.

ఒక్కొక్క వ్రతమును వర్ణించుచో పౌరాణికులా వ్రతమున కన్ని వ్రతములకన్న నెక్కుడు ప్రాముఖ్యత నొసగినారు. ఆవ్రతముతో సమానమగు వ్రతము మఱొక్కటి లేదని వర్ణించినారు. "వ్రతానాముత్తమం వ్రతం" అని శ్లాఘించినారు. ప్రతివ్రతమున కేదోయొక మహాఫలమును వ్రాసినారు. సాధారణముగా నన్ని వ్రతముల ఫలములు దీర్ఘాయువు ధనధాన్య సమృద్ధి, సుఖసంపద, సర్వపాప విముక్తి కలుగునని వ్రాయబడినది. మఱికొన్ని వ్రతములకు స్వర్గప్రాప్తియై యున్నది. కొన్ని వ్రతముల ఫల మనంతమని వర్ణింపబడినది.

ఎట్లన:— నాగపంచమి చేసిన

"ప్రయాతి విష్ణుసాన్నిధ్యం, సేవ్యమానోప్సరోగణైః"

విష్ణుసాన్నిధ్యము దొఱకునట. ఋషి పంచమి సర్వపాపహరము. ఇంకొకచో దీనిని చేయువాడు

"ముచ్యతే సర్వపాపేభ్యో యాతి బ్రహ్మ సనాతనం"

సర్వపాప విముక్తుడై బ్రహ్మను బొందునన్నారు. ఏకాదశి చేయనివాడు రౌరవ నరకబాధ బొందును. చేసినవా

శు విష్ణుసానము బొందును. నరక చతుర్దశి చేసినవాడు శివ సాయుజ్యము పొందును.

శివరాత్రి చేయువాడు పొందు పుణ్య మపారమైనది.

శ్లో॥ అశ్వమేధ సహస్రాణి వాజపేయ శతానిచ
నాప్నోతి తత్ఫలం సర్వం నాత్రకార్యా విచారణా॥

శ్లో॥ ఏకాదశీ కోటి కృతౌ యత్ఫలం
వారాణసీవాస సహస్రవర్షైః
జన్మాష్టమీ లక్షభవంచ సిద్ధేత్
ఏకేన సత్యం శివరాత్రికేన॥

అనగా వేయి అశ్వమేధ యజ్ఞములు నూరు వాజపే యములు చేసినను నొక శివరాత్రితో సమానము కావు కోటి ఏకాదశులుగాని కాశిలో వెయ్యేడ్లుంటగాని లక్ష కృష్ణా ష్టమీలు చేసినగాని నొక శివరాత్రికి సరిరావు.

సంక్రాంతి పండుగ వలన

"సప్త జన్మ సహస్రాణి ధనధాన్య సమన్వితః"

ఏడు వేల జన్మములలో ధనధాన్య సమృద్ధి కలుగును పునర్జన్మ రాహిత్యమున కెందఱు పాటుపడుచుండ సంక్రాంతిని చేసి యేడు వేల జన్మము లెత్తఁగోరుట మంచిదో కాదో వేదాంతులు పౌరాణికులును నిర్ణయింతురుగాక.

పతిసంజీవినీ వ్రతమని యొకటి గలదు. దీనిని జేయు వారు సాక్షాత్పార్వతీ పరమేశ్వరు లగుదురనుటకు జాబాలి ప్రమాణమును

శ్లో॥ యానారీ కురుతే భక్త్యా శైవగౌరీ సమాభవేత్
తత్పతిశ్శంకర స్సాక్షా న్నిశ్చితం శృణుభారత॥

ఈ వ్రతమునకన్న నొక మెట్టు హెచ్చైనదో యనఁదగినది రథసప్తమీవ్రతము. ఈ రథసప్తమీ వ్రతము జేయువాఁడు; [redacted]

శ్లో॥ లభతే పుత్రపౌత్రాంశ్చ, సూర్యలోకం సపశ్యతి।
తత్రస్థిత్వా కల్పమేకం చక్రవర్తీ భవిష్యతి॥

అనగా పుత్రపౌత్రుల గాంచి వాఁడు సూర్యలోకమునకేఁగి యచ్చట నొక కల్పాంతము వసించి పిమ్మట సర్వాంసహా చక్రవర్తి యగును.

ఇచ్చట కల్పమన నేమియో యించుక విస్తరము యినను వివరించెదను. సూర్య సిద్ధాంతమందు కాల విభాగములను వ్రాసినారు. అందు ప్రథమ ప్రకరణమందు మధ్యాధికార మందిట్లు వ్రాసినారు.

౧ త్రుటి = క్షణములో నూర్వల కొలది భాగము
౧౦౦ త్రుటులు — ౧ తత్పరము
౩౦ తత్పరములు = ౧ నిమేషము
౧౮ నిమేషములు = ౧ కాష్ఠ

౩౦ కాష్ఠలు = ౧ కళ (ఇది ఇంగ్లీషులో ౪౮ సెకండ్ల సమానము)

౩౦ కళలు = ౧ ఘటిక

(దీనినే గడియ యందురు. [ఇది ఇంగ్లీషులో ౨౪ మినిట్ల సమానము],

౨ ఘటికలు—౧ క్షణము

౩౦ క్షణములు—౧ దివసము

౩౬౫ దివసములు ఒక సంవత్సరము

ఇట్టి సంవత్సరములు ౪౩ లక్షల ౨౦ వేలు అయిన నొక్క మహాయుగము. (అది నాలుగు చేరియున్నది) ఆ నాలుగు యుగముల లెక్క లెట్లన.

| | | |
|---|---|---|
| కృత లేక సత్యయుగము | ౧౭౨౮౦౦౦ | సంవత్సరములు |
| త్రేతాయుగము | ౧౨౯౬౦౦౦ | ,, |
| ద్వాపర యుగము | ౮౬౪౦౦౦ | ,, |
| కలియుగము | ౪౩౨౦౦౦ | ,, |
| మొత్తము | ౪౩౨౦౦౦౦ | ,, |

ఈ నాలుగు యుగములు కలిసి యొక్క మహాయుగమగును. ఇట్టి మహాయుగములు ౭౧ యైన నొక్క మన్వంతరమగును. ఒక్కొక్క మన్వంతరమందు బ్రళయమగును. ఇట్టి ౧౪ మన్వంతరములు ఒక్క కల్పమగును. అయితే ప్రతి మహాయుగాంతమందును మన్వంతరమందును నాద్యంత సంధి

మార్పవచ్చునట. సోమవార కథయందు సింహళ ద్వీప
దలి చాకలిదాని వ్రత ఫలమును టాగిస్వరు వాళ్ళను
దుటకై బ్రాహ్మణులు దాని యిల్లొడ్డి యలికి సేవ
వృత్తి యొక్క సంవత్సరము చేసిరట. అట్లు అనుగ్రహ
పొంది యాచాకలి వ్రత ఫలమును వీరుపొంది చావును
తప్పిరట. కాని చాకలిదాని యింటిలో నందఱు చచ్చిర
మరల యామె యా వ్రతముజేసి యందఱను బ్రతికిం
కొనునట.

కొన్ని వ్రతము లు చేసిన యా కర్తలు శివలోకము
బ్రహ్మలోకము నో, విష్ణులోకము నో, నాగలోకమునో, సూ
లోకమునో, యింద్ర లోకమునో యేలోకమునో యొక
మును బొందుదురని వ్రాసియుంటిమి. ఆలోకము లెట్టి
యెచ్చట నున్నవో యిందఱు దేవులలో నెవ్వరు
నెవ్వరు తచ్చో, యిందఱు దేవులు జగడ మాడకుండ
సామరస్యము తో నిల్తకాల మున్నారో, యెట్టి లోకము
పోవు మార్గమెట్టిదో, పోవుట నిశ్చయించుకొటులో
న్నియు నమ్మట యెటులో, దూష్ప్రపడమర తోచకుండ
నున్నది. ఇంత మాత్రము మన మూహింప వచ్చును.
గ్రంథకారులు ప్రతివ్రత మందును విశ్వాసము, శ్రద్ధాభక్తి
జనసామాన్యమం దుత్పత్తి కావలెనని యిట్లు వ్రాసి
వేరభిప్రాయము తో కానేరదు.

# దీపావళి



ఈ పండుగను నరక చతుర్దశియని కూడ వ్యవహరింతురు. ఇది ప్రతి సంవత్సరము ఆశ్వయుజ కృష్ణ చతుర్దశీ దినమునఁ చేయఁబడును.

ఈపండుగ విషయమై యనేక కథలు చెప్పఁబడుచున్నవి. అందివి ముఖ్యమైనవి.

౧. శ్రీకృష్ణుఁడు సత్యభామా సహాయుఁడై నరకాసురుని చంపినందున.

౨. బలిచక్రవర్తి వామనునిచేతఁ దన యావద్రాజ్యమును గోలుపోయినందున.

౩. శ్రీ రాములు రావణ వధానంతరము రాజ్య పట్టాభిషిక్తుఁ డీ దినమయినందున.

౪. నరకమునుండి విముక్తి చెందుటకై యమునిగూర్చి ప్రార్థించుట విధింపబడినందున

౫. విక్రమార్క చక్రవర్తి యీదివసమున పట్టాభిషిక్తుఁడైనందున

నీపై కారణములచేత నీ దీపావళి జరుపఁబడుచున్నదని తెలియుచున్నది.

వీనిలో నేది నిజమో విమర్శట నిరూపించెదను.

అది యట్లుండె. పై కథ లేవియో పాఠకులజ్ఞాపకార్థమి పుడు వివరింపఁబడును.

౧. నరకాసురవథ—ఈకథ యాంధ్రదేశమందంతటను, దక్షిణమునను దీపావళికి ముఖ్యకారణముగా భావింపబడుచున్నది. కావుననే యీచతుర్దశి "నరక" చతుర్దశియని చెప్పఁబడుచున్నది. నరకాసురవధను గుఱించిన కథభాగవతమందును హరివంశమందును చెప్పబడియున్నది. నరకాసురుఁడు లోక కంటకుఁడు కాఁగా శ్రీకృష్ణుడు వాని వధింపఁ బ్రయాణమయ్యెను. సత్యభామయు నాతని వెంబడించెను. శ్రీకృష్ణుఁడు మొదలు ముర రాక్షసుని వాని పుత్రులను జంపెను. నరకుం డిదిచూచి కోపోద్దీప్తుఁడై కృష్ణునిపై యుద్ధమునకు వచ్చెను. అప్పుడు సత్యభామ తానే చాపముగొని వేఁడి నారసములచే నరకాసురునితో ఘోరయుద్ధము జేసి యలసిపోయెను. శ్రీకృష్ణుఁ డామెకు సహాయుడై నరకాసురుని వధించెను.

ఈ కథలో ముఖ్యముగ గమనింప వలసినది సత్యభామ యొక్క యుద్ధనైపుణి. ఆకాలమందు స్త్రీలు సహితము యుద్ధకళా కౌశలమం దారితేరినవారై యుండినందులకు భారతీయులందఱు సంతసింపవలసినదే.

౨. బలిచక్రవర్తికథ:—బలిచక్రవర్తికథ భాగవతమందు విపులముగా వర్ణింపబడినది. బలియనురాజు దానమందుఁ బ్రఖ్యాతి వహించినవాఁడు. వేడిన యుభ్యర్థులకు లేదనువాఁ

మకాఁడు. అప్పుడు విష్ణువు వామనావతారమెత్తి బలిచక్రవర్తిని మూడడుగుల భూమిని వేడి రెండు పాదములచే భూమ్యాకాశముల నావరించి మూడవ పాదమునకుఁ దావు లేదానిని బలిచక్రవర్తి శిరముపై నుంచి యతనిని పాతాళమునకుఁ ద్రొక్కెను. ఆకారణము చేతనే నీచతుర్దశీ దినము పుణ్యదినముగా భావింపఁబడుచున్నదని చెప్పుదురు. వ్రతరాజము మున్నగు గ్రంథములందు సత్యభామా కృష్ణుల కథయొక్క సూచనయే లేదు. వానిలో బలిచక్రవర్తికథయే యున్నది. అందిట్లున్నది.

శ్లో. చతుర్దశీదినే రాజ్యం బలేరస్త్వతి యాచ
యేత్ । పురా వామనరూపేణ ప్రార్థ
యిత్వా ధరామిమాం॥

దదావతిథి రింద్రాయ బలిం పాతాళ
వాసినం । కృత్వా దైత్యపతిం దద్యా
దహో రాత్రత్రయం హరిః॥

తస్మాత్సమోత్సవం చాత్ర సర్వదైవ
హి కారయేత్ । మహారాత్రిస్సముత్ప
న్నా చతుర్దశ్యాం మునీశ్వరాః॥

... ... ... ...

దీపదానాది కార్యేషు గ్రాహ్యే మధ్యా
హ్న కాలికా । తతః ప్రదోష సమయే
దీపాన్ దద్యాన్మనోరమాన్॥

౩. శ్రీరామ పట్టాభిషేకము — ఇందువిశేషము
వ్రాయలేవు. రాముడీదినమున రాజ్యాభిషిక్తుడయ్యెనట.

౪. నరకవిముక్తి:— నరక చతుర్దశియను పదము
ని నరకమునకు యమలోక మని యర్థము. దానినుండి
ముక్తి చెందుటకై ఈయుత్సవము చేయవలెనని దీని భావ
వ్రతచూడామణియం దీసూచనయునున్నది.

శ్లో. "యమాయ ధర్మరాజాయ మృత్య
వేచాంతకాయచ॥"

ఇందు యమపూజా విధి చెప్పబడి యున్నది. గుప్తే
నువారు తమ «హిందువుల పండుగలు, వ్రతములు» అ
గ్రంథమున దీని విశేషమునే విపులపఱచినారు. నరక మన
ముడికి యని యు. కార్తీక మాసమందే సూర్యుడు తులా
శి చేరుననియు దానివలన రాత్రులుదీర్ఘములగు ననియు,
నరకమును పరిశుభ్రపఱచుట కిదియే యదననియు, నరకా
సురుడు భూదేవీ కుమారుడనుటచేత భూమినుండియే మురి
యుత్పన్నమయ్యెనని చెప్పుట కిదియొక కథగా కల్పింప
బడె ననియు వ్రాసియున్నారు.

౫. విక్రమార్కుని కథ.— విక్రమార్కశకమును
క్కించువారికి దినమునుండియే సంవత్సరారంభ మగు
న్నదని చెప్పుదురు. అట్టిచో నిది ముఖ్యముగా గమనింప
లసి యున్నది. విక్రమార్కుడను రాజు క్రీస్తునకు
ర్వము ౫౭ సంవత్సరముల క్రిందట అనగానుమారు ౨౦

సంవత్సరముల క్రిందట యుద్భవించి యార్యావర్తము నంత
ము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మహారాజు. ఇతని యాస్థా
మందే కాళిదాసాదియష్ట దిగ్గజము లుండిరని చెప్పుదురు. ఈ
రాజు మహా సాహసికుడనియు నిట డనేక మనుష్యాతీతమై
కార్యములచేసియుత్సాహ సాహసౌదార్య ధైర్య గుణము
చే విరాజిల్లె ననియు ననేక గాథలు వ్రాయబడియున్నవి.
ఈ విక్రమార్కుడు విశేషముగా నుత్తర హిందుస్థానమందే
రాజ్యము చేసెను-ఇతని ముఖ్యపట్టణము "ఉజ్జయని". ఇత
డు కొంతకాలమునకు దక్షిణదేశపు రాజును, నాంధ్రచక్రవ
ర్తియు నగు శాలివాహనునిచే నోడింపబడెను. ఈ విక్రమా
ర్కశకము దక్షిణములో ప్రచారమందు లేదు. ఉత్తర హిం
దుస్థానమందిది విశేషముగా వాడబడుచున్నది.

ఆచారము:- మొత్తముపై యీ మహోత్సవము హిం
దూ దేశ మంతటను ప్రచారమం దున్నది. దీని యుద్దేశము
పూర్వ మీదినా మహాకార్యము జరిగియుండ దాని జ్ఞాప
కార్థమై యేర్పాటయి యుండును. విశేష సంఖ్యాకులుస త్యా
కృష్ణులు లోక కంటకుడగు నసురుని సంహరించిన సందర్భ
మున కీ జ్ఞాపకార్థముగా నిది నేటికిని పుణ్యదినముగా భా
వింపబడుచున్నదని నమ్ముదురు. ఇదితప్పక విమర్శనలో ని
రూపింతును. ఈదిన మొక స్త్రీ బాణ ప్రయోగము చేసి శత్రు
వధ చేసిన మొనర్పగా నేడు మన యార్యులును బాణములు కా
ల్చుచు (పటాకులు) తమకే హాని కలిగించుకొనుచున్నారు. ఈప
టాకులు కాల్చుటవలన విదేశములకు మన ద్రవ్యము పోవుట

కొకటి. మనచేజిడ్డు వదలుట రెండు. మన పిల్లల కీష
లచే నపాయములు సంభవించుట మూడు. మాన పూ
మన వివిధమున నగౌరవపఱచుట నాల్గు—నివి వీని
ములు. ఈపండుగనాడు పటాకులు కాల్పవలయునని
ధమందును వ్రాయబడలేదు.

ఏదియెట్లున్నను మనదేశము లో ఆశ్వయుజకృష్ణ చత
నాడు చీకటిలోనే యందఱును లేచి శిరస్స్నానముచేసి
ములు వెలిగించి పటాకులుకాల్చి పూజాదికము లో
దురు.

ఈ దీపావళిపండుగ మార్వాడీలకు చాలముఖ్యమై
ఆ యుత్సవమునాటికి వారు తమ లెక్కల నన్నిటిని
రించి యానాడు క్రొత్త ఖాతాపుస్తకములు తెచ్చి పూ
చి బ్రాహ్మణ మంత్ర పురస్సరముగా నాశీర్వాదములంది
హితులకు విందులొసగి చాలయానందముతో నుందురు.
ద్ర దేశమందును దుకాణము లున్న వారందరును మా
డీలను జూచి యీనాడనేమీ వారును క్రొత్త లెక్కల నేర్పా
సికొందురు. మొత్తముపై వ్యాపారస్థులచే నీపండుగ
రాదిగా నెంచబడుచున్నది.

భవిష్యత్పురాణోత్తర భాగమందు శ్రీకృష్ణుడు ధర్మ
తో జెప్పినట్లుగా బలిచక్రవర్తి గౌరవార్థము దీపావళి
x చేయబడుచున్నదనియున్నది. ఆపురాణమున నీపండ
“దీపాలికోత్సవము” అని పేర్కొని యున్నారు. శ్రీ

డిట్లుచెప్పెను:—"పూర్వము బలిచక్రవర్తిని దేవుఁడు వామనరూపియై భూమిని యాచింప నాఁడు సర్వలోకమును నాతనికి ధారపోసెను. అప్పుడు కృతజ్ఞుఁడై దేవుఁడీవిషయమున బలినిబూజించు నట్లేర్పాటు చేసెను.

శ్లో॥ విష్ణునావసుధాలబ్ధ్వా ప్రీతేనబలయేపునః
ఉపకార కరోదత్త శ్చాసురాణాంమహోత్సవః

అప్పటినుండి యీ యుత్సవమును "కౌముది" యని పిలుతురు. ఈపండుగనాడు సర్వస్థలములందు— దేవాలయమఠవృక్ష గృహాదిస్థలములయం దంతటను దీపములు పెట్టవలయును. మరియు నాపురాణమందిట్లున్నది.

"శ్లో॥ కార్తికే కృష్ణపక్షేచ చతుర్దశ్యాం దినోదయే। అవశ్యమేవ కర్తవ్యం స్నానం నరక భీరుభిః॥

నేటికిని కార్తిక కృష్ణపక్ష చతుర్దశి నాడేయీయుత్సవము జరుపఁబడుచున్నది.

ఈ పండుగ విషయములో "నరకచతుర్దశి" యనుచో నరకయను పదమువలన ననేక సందేహములు కలుగుచున్నవి. నరకాసురుని కర్ధముచేసి యాతనివధకై లోకము నేటికిని సంతసించుచున్నదని కొందరు చెప్పుచున్నారు. ఈభవిష్యత్పురాణమందలి పైశ్లోకమందు "నరకభీరుభిః" అనుచో నరకమునుండి భయపడువారందఱునాఁడు స్నానము చేయవలెనని యున్నది. కావున నరకమును పొందకూడదను నిష్ట

ముతో నీచతుర్దశినాడు యమపూజను చేసియు బలిపూజనుపి మ్మట చేయవలెనని చెప్పు పైపురాణ ప్రమాణము చాల ము ఖ్యమైనది. దీనివిషయమై ముందువిమర్శింతును.

ఈ పండుగనాడు ధనికులయొక్కయు, దొరలయొ క్కయు, రెండు డబ్బులనే థబ్బునైన సంపాదించిన కుబే ర కుమారులయొక్కయు నిండ్లకు తెల్లవారకమును వేశ్య లంకరించుకొని భోగపుసానులు నీరాజనములిచ్చి పూజింతు రు. ఈ యాచారమనేక నగరములందున్నది. దీనికిని మన భవిష్యత్పురాణమున నాధారమున్నది. ఈ శ్లోకమును చిత్త గింపుడు.

శ్లో॥ వేశ్యావిలాసినీ సార్ధం స్వస్తి మంగళ
కారిణీ। గృహాద్గృహం వ్రజంతీచ పా
దాభ్యంగ ప్రదాయినీ॥

భవిష్యత్పురాణమందు దీపోత్సవ కథనమందలి కడపటి శ్లోక ముదాహరణ యోగ్యమని తలంచి యిం దుదాహరించు చున్నాను.

శ్లో॥ దీపోత్సవేజనిత సర్వజన ప్రమోదం।
కుర్వంతి యే సుమనసో బలి రాజపూ
జాం। దానోప భోగ సుఖవృద్ధి శతా
కులానాం। హర్షేణ వర్షమిహ పార్థివ
యాతి తేషాం॥

విమర్శనము

నరకాసుర వధకారణమున నీపండుగ యేర్పడినదనియే ప్ర

మాణమగు గ్రంథమందును లేనందున నీకథను త్రోసివేయు వలయును. ఇక బలిచక్రవర్తి విషయమే గ్రాహ్యమైనట్టిదని భావింపవలయును.

ఈపండుగనాడు

శ్లో॥ భ్రామయేత్ స్నానమధ్యేతు నరకస్యతు
యాయవై॥

అనగా నరకక్షయముకొఱకై స్నానము చేయువలయును అనుటచేతను

శ్లో॥ నరకాయ ప్రదాతవ్యో దీప స్సంపూజ్య
దేవతాః॥

అనగా నరకమునకై దీపములం బెట్టి దేవతలను బూజింప వలయును అనుట చేతను

శ్లో॥ చతుర్దశ్యాంతుయే దీపా నర
కాయ దదంతిచ । తేషాం పితృగ
ణా స్సర్వే నరకాత్స్వర్గ మాప్నుయుః॥

అనగా చతుర్దశీ దివసమున నెవ్వరు యమరాజును [నరక] దీపములం బెట్టి పూజింతురో వారి పితరులు నరకము నుండి విముక్తులై స్వర్గమును బొందుదురు అనుటచేతను, నీ పండుగనరకాసురుని సంబంధము కాదనియు నరక విముక్తికై యముని పూజచేయుటకేర్పడి నట్టిదనియు విశదమగును. అయితే

శ్లో॥ చతుర్దశీ దినేరాజ్యం బలే ర స్త్వితియా
చయేత్॥

అనగా చతుర్దశీ దివసమునాడు మరల బలిరాజ్యము వచ్చుగాతయని పూజింపవలయును అనుదానికి సమన్వయము చేయవలసి యున్నది. బలిచక్రవర్తి కథలోఁ బూర్వమొక వామనుఁడు బలిని మూడుపాదముల భూమిని వేడి రెండుపాదములచే భూమ్యాకాశములావరించి మూడవపాదము బలి శిరస్సుపైనుంచియాతనిని పాతాళమున కణఁగఁ ద్రొక్కెనని యున్నది. పాతాళమన నధోలోకము. అందుఁ జీకటి యుండును. విష్ణువు మూడుపాదములుగలిగినవాఁడుగా ఋగ్వేదమందు వర్ణింపబడినాఁడని లోకమాన్య బాలగంగాధర తిలకుగారు తమ వైదిక నిలయమను గ్రంథమం దుదాహరించుచు నందిట్లు వ్రాసియున్నారు.

« విష్ణుని త్రిపాదములను గూర్చి ఋగ్వేదమందు పలుతావులలో పేర్కొనబడియున్నది. ...... సూర్యుని యుదయ, మధ్యందిన,అస్తమయములే యీ మూడుపాదములుగ వర్ణింపఁబడినవని మాక్సుమూలర్ పండితుఁడు తలంచుచున్నాడు. ఈ విష్ణుపాదములే పురాణములో వామనమూర్తియొక్క మూడడుగులుగ వర్ణింపఁబడియున్నవి. ఇచ్చట విష్ణుఁడనగ సూర్యుఁడని పండితులందఱును ఒప్పుకొనియే యున్నారు ...... ఈ విష్ణుపాదములలో రెండు మాత్రమే మానవులకు గాన్పించుననియు మూడవదినరులకుగాని పశుపక్ష్యాదులకుగాని గాన్పించదని, ఋగ్వేదము ౧,౧౫౫,౫,లో చెప్పియున్నారు [ అనగా విష్ణుని మూడవపాదము అధోలోకమం దున్నదని దీనియర్థము] ఈ

యధోలోకము చీకటిమయముగను జలమయముగను నుండి నదుల కదృశ్యముగా నుండును . . . . . వేదము ల. సూర్యుని వార్షికగమనమే మూడు విష్ణుపాదములుగ వర్ణిం పఁబడినవి. సూర్యుఁడు దక్షిణము పైనుండి జనులకు గాన్పిం చు కాలము విష్ణుని రెండు పాదములగును. తదుపరి సూ ర్యుడు క్షితిజము క్రిందికి గ్రుంకిపోయి దీర్ఘరాత్రినికల్పిం చినప్పుడు అదృశ్యమగు విష్ణుని మూడవపాదమేర్పడును."

పై వాక్యములవలన వామన కథలోని రహస్యము కొంత వెల్లడియయ్యెను. కడపటి వాక్యమందు దీర్ఘరాత్రియన నే దియో గ్రహించిన తక్కిన యంశములు సులభమగును—

ఆర్య లోక కాలమందు అనగా సుమారు౧౦ వేల సం వత్సరములకుఁ బూర్వము ఉత్తరధ్రువ మండల ప్రాంతభూము లందు నివసించిరనితిలకుగారు " వైదికనిలయము " అను గొప్పగ్రంథమును వ్రాసి నిరూపించినారు. ఆ మండల మందు నాటికిని నేటికిని మన దేశమునకు భిన్నముగానుండు ప్రకృతి వై పరీత్యములు చాలగలవు. అందు మనకిప్పుడవసరమగు నంశ మొకటి. అ సేదన నాభూభాగమందు ఆఱునెలలు పగలును ఆఱునెలలు చీకటియును నుండును. దీనినే దేవతల కొక ది నమని మనవా రనేక గ్రంథములందు వర్ణించిరి. ఈ యాఱు నెలల పగటిని దీర్ఘదివసమనియు, ఆఱునెలలచీకటిని దీర్ఘరా త్రి యనియు తిలకుగారువర్ణించినారు. ఈదీర్ఘ దివసదీర్ఘరా త్రు లెప్పు డారంభమగునో యా యంశమును తిలకుగారు త-

మ గ్రంథమందిట్లు వ్రాసియున్నారు. "ఉత్తరధృవము మేరు పర్వతమని మనవారు తెలిపియున్నారు. మఱియు సూర్యసిద్ధాంతము ౧౨ వ అధ్యాయము ౬౭ వ శ్లోకములో నీవిధముగ వర్ణింపఁ బడినది ,, మేరుపర్వతమువద్ద దేవతలకు మేష సంక్రమణమునాటి సూర్యోదయ మొక్కటే సూర్యోదయము. ఆదినము మొదలుకొని సూర్యునియొక్క అర్ధావృతమువరకు అనగా [ఆరునెలలవరకును] వారు సూర్యుని చూచుచునే యుందురు. ........ మేరు పర్వతము వద్ద మేషసంక్రమణమునాఁడు సూర్యోదయమగును. తిరిగి ఆరునెలలవరకు అనగా తులా సంక్రమణమువరకు సూర్యుడాకాసమునందే వెలుగుచుండును. తులాసంక్రమణములో అస్తమయమగును. తులా సంక్రమణము మొదలు తిరిగి మేష సంక్రమముణవరకు సూర్యుడడుగునకు గ్రుంకుటవలన ఆరునెలల వరకు చీకటి వ్యాపించును. దీనిభావమేమన, మేషసంక్రమణము మొదలు తులా సంక్రమణము వరకు ఉత్తరాయణము; తుల మొదలు మేషమువరకు దక్షిణాయనము. అందువలనే ఉత్తరాయణకాలము దేవతలకు పగలగుచున్నది అని చెప్పబడియున్నది. కాని భాస్కరాచార్యులగారి కాలములో ఉత్తరాయణ దక్షిణాయణ సంజ్ఞలను మార్చిరి. మకర సంక్రమణము మొదలు కర్కాటక సంక్రమణమువరకు ఉత్తరాయణమని యిటీవల వారు మార్చిరి.

ఈ పై ప్రమాణమువలన ఉత్తర ధృవమండల వాసులుగా నుండినప్పుడు మనపూర్వులగు నార్యులకు తులాసం

క్రమణమునాడు దీర్ఘరాత్రి ప్రారంభ మగుచుండెనని తెలియును. నాటినుండి తిరిగి యారునెలలవఱకు వారుచీకటిలోనే కాలము గడుప వలసివచ్చెను. కావున నాచీకటి ప్రవేశించినతోడనే వారుదీపోత్సవమును జేసి "బలి"యను శత్రువునుపాతాళమునకు తన మూడవపాదముచే నడగద్రొక్కి యచ్చటనే తాను బహుకాలముండువాడగుటచే సూర్యుడు మరల తమ కగపడుగాక యని ప్రార్థించుటకై యేర్పాటుచేసిన పండుగ యీదీపావళీయనితోచుచున్నది. తులా సంక్రమణమునాడే దీపావళి యనుటకు ప్రమాణముగా ధర్మ సింధు విట్లు వ్రాయుచున్నది.

శ్లో॥ తులా సంస్థే సహస్రాంశౌ ప్రదోషే
భూతదర్శ యోః॥
ఉల్కాహస్తా నరాః కుర్యుః పితౄణాం
మార్గదర్శనం॥

సూర్యుడు దీపావళినాడు తులారాశినిపొందుచున్నాడనియు నాడు లోకులు దివిటీలతో తమ పితృదేవతలకు మార్గదర్శనము జేయవలయుననియు దీనియర్థము. తిలకుగారు తులా సంక్రమణము నుండి దీర్ఘరాత్రి ప్రారంభమగుచున్నదని వ్రాసిన ప్రమాణ మిదవఱకే విపులముగా నుదహరించినాడను కావున పైధర్మసింధు ప్రమాణము దాని కనుకూలముగా నుండుటచే దీపావళిదినము ఉత్తర ధృవవా

నులకు దీర్ఘరాత్రి ప్రారంభ దినముగా నుండునని నిశ్చయము
న్యా. అందుచేతనే యీపండుగకు లేనట్టి దీపాళిని నీయుత్స
వమందు వెలిగించునాచారమై యున్నది. చీకటి యెడతెగక
ప్రారంభమగుటచేత నా కష్టకాలము త్వరగాఁ బోవుటకు
ప్రార్థించుటకై యేర్పడినది. అంతియకాక పై ధర్మసింధు
వు శ్లోకమందీనాడు దివిటీల (దీపములు)చేఁ బితృదేవతలకు
మార్గము చూపించవలెను అను దాని కర్థమేమో విచారిం
చిన తక్కినదంతయు విశదమగును. ఈపండుగనాడు.

శ్లో॥ యమాయధర్మ రాజాయ మృత్యవే
చాంతకాయచ

అని యమధర్మరాజును బూజింపవలెననియు పితృదేవత
లు నరకమునుండి. స్వర్గమునుపొందుటకై యముని ప్రా
ర్థించవలెననియునిదివఱకే ప్రమాణములు వ్రాసితిని. దీని
యర్థమేమన నీదీర్ఘరాత్రి కాలమందు (నీ యారునెలకాల
మందు) చనిపోయిన వారికి కర్మాదులు చేయక దీర్ఘదివ
సము వచ్చినతర్వాతనగా- నారునెలల తర్వాత వారికిఁ
గర్మములుచేయు చుండిరని నిరూపించినారు. ఈ క్రింది
వాక్యముల వారి గ్రంథమునుండి యుదహరించుచున్నాడ.

“ఎవరైనను దక్షిణాయన అనగ పితృయాన కాల
ములోఁ చనిపోవుట అశుభ సూచకమని మన హిందువులె
న్నడురుగద. మహాభారతయోధ వీరుఁ డైన భీష్ములవా
రు దక్షిణాయన కాలమంత యుంది ఉత్తరాయణపుణ్యకాల

ము వచ్చురకును ప్రాణములను విడువక అంపశయ్యమీద నిరీక్షింపు చుండెననియు మన కందరకును తెలిసియున్న యదే”

ఇచ్చట యొక్క విషయము గమనింపవలెను. ఇదివరకు తిలకుగారు నిరూపించినట్లు మన దేశములో నుత్తరాయణము మకర సంక్రాంతినాడు వచ్చును. కాని యుత్తరధ్రువమందు తులాసంక్రాంతినాడు వచ్చును. తులాసంక్రాంతినాడే దీపావళియనుట నిరూపించినారము. కావున దీపావళినాడు ధృవమండల మందు దక్షిణాయనము ప్రారంభమగును. దక్షిణాయమందు చీకటియుండుటచే చీకటిలో (రాత్రికాలమందు) శ్రాద్ధ కర్మాదులు చేయురు. కావున నీ దక్షిణాయానములో చనిపోవు వారికి నుత్తరాయణము వచ్చిన తర్వాత శ్రాద్ధకర్మములను మన పూర్వ లుత్తరధ్రువమందుండినప్పుడు చేయుచుండిరని తిలకుగారు వ్రాసినారు. ఈ క్రింది వాక్యములను చిత్తగింపుడు. “చీకటి కాలములో (పితృయానములో)చనిపోయినయెడల తిరిగి దేవయానము అనగా వెలుతురు వచ్చువరకు అపరకర్మలను జేయుటకు వలుండదు. అంతకాల మీకర్మలను చేయకుండ నిలిపియుంచుటయే చనిపోయినవానియాత్మకు యసుభదాయకము. ఇప్పటిమాటలో యేల యీకాలములో సైతము ఎవరైన రాత్రికాలములో చనిపోయిన యెడల సూర్యోదయ కాలమువరకు వాపియుంచుదుముకద. ఇట్టి సందర్భములో పితృయాన

కాలములో చనిపోవుట యశుభ సూచకమని మన పూర్వు
లు తలంచుటలో నేమియును వింత లేదు."

ఇప్పుడు మనము దీపావళినాడు దీపము లెందుకు పె
ట్టుటయు, యమపూజ నెందులకుఁ జేయుటయు, పితృలకు స
ద్గతి నెందుకీ పండుగనాడే కోరుటయు, మున్నగు సంశయము
విశదమగును. ఈ యాఱునెల చీకటి దీపావళినాడు ప్రారం
భమై యాఱునెలలవఱకు నుండుటచే నంతవఱకు చచ్చినవారు
(పితృదేవతలు) యపరికర్మ హీనులై యుత్తమ లోకములకు
దప్పినవారై నరకమందే నివసించుచుండిరని మనవారు విశ్వ
సించిరి. నేటికిని నెవ్వరైన తమ పితరులకు శ్రాద్ధకర్మలు చేయ
కుండిన పితరులకు సద్గతి లేదనియు, నరకమునందే వారు
ట్టింతురనియు జనులు చెప్పుదురు. శాస్త్రములును నట్లే
వ్వుచున్నవి. ఎవ్వరైన దమ కుమారులు లేకుండిన వేరొ
దత్తుతీసికొందురు. ఇట్లుచేయుట కేవలము తమకు వా
ద్వారా సద్గతి కలుగుట కేయని మన శాస్త్రములు చెప్పు
న్నవి. పుత్రయ నుపదమునకు కూడనిదే యర్థమున్నది. "పున్నా
మ నరకాత్ త్రాయత్ యితి పుత్రః" పుత్ అను నరకము
డి కొడుకు తల్లిదండ్రులకు దర్పణములు విడిచి కర్మలు
వారిని విముక్తి పొందించును. గనుక నా కొడుకును పుత్రు
ని పిలుచుచున్నారు. అని దీనియర్థము.

ఇట్లు పితృదేవతలీ యాఱునెలలు నరకమందుండు
గాన వారికి నరకబాధ యుండనట్లుగా యముల పూజించి
యు దివిటీలతో నాచీకటిలోఁ బితరులకు స్వర్గమార్గము

పించుటయు నీ పండుగ వలన గలుగునని మన పూర్వులూహించి యీ యుత్సవము నేర్పాటు చేసిరి.

ఇంతియ కాక మన దేశమందింకొక యాచార మున్నది. దీపావళి నుండి మొదలుకొని కార్తీక మాసాంతము వఱకు గూడ దీపోత్సవములు పెట్టుదురు. ఆకాశ దీపములని కొందరు మేడలపై దీపములు చేయుటయు మఱికొంద ఱెత్తైన గడలమీఁదను దీపముల వెలిగించుటయు కలదు. ఇదియునా దీర్ఘరాత్రిలో పితృలకు మార్గదర్శకముగా నుండుటకై పెట్టుదురని భావించ వలయును.

ఇట్లాలోచించి చూచిన నాకీపండుగు యుత్తర ధృవ నివాసుల దక్షిణాయన ప్రారంభపు పండుగుగా గానవచ్చుచున్నది. కాని నరకాసుర కథకుగాని శ్రీరాముల జయమునకుగాని, విక్రమార్కునికిగాని నీ పండుగ మానేత్రమును సంబంధించ దనినా యభిప్రాయము. విజయదశమి యనుపదములో "విజయ" అనుట కర్థము అర్జునుఁడనిచేసి యర్జునుని యుత్తర గోగ్రహణ యుద్ధము నాటి సంబంధపు పండుగుయని తప్పుకర్థము చేసినటుల నరక చతుర్దశి యను పదమునకు నరకమునుండి పితృదేవతలకు విముక్తి కలిగించుటకై చేయఁబడిన పండుగ యని యర్థము చేయుటకు మారుగా "నరక" యను పదమును నరకాసురుని కర్థముచేసి వాని వధను శ్రీకృష్ణుని కంటగట్టి యా సందర్భమున నీ పం

డుగును జేయుచున్నారని వ్యాఖ్యానముచేసి జనులను దక్ష
ప్రోవలందు నడిపించినారు.

కావున పై విమర్శన సారాంశ మేమన నీ నరకచతు
ర్దశి దీర్ఘరాత్రి కాలమందు జచ్చిన పితృలకు నరక విముక్తి
చేయు పర్వదివసమని బలి, యమ, వామన, దీప, నరక శా
తాశయాను పదములు సాక్ష్యమిచ్చు చున్నవి.

ఈ విషయమును ముగించుటకుఁ బూర్వమింక మూడు
విషయములు సూచింతును. గుప్తే పండితుఁడు నరకమును
గురించి వ్రాసిన యభిప్రాయమును గమనింపఁ దగినది. ఈ
దివసమున సూర్యుఁడు తులారాసి చేరుననియు, దాని వలన
రాత్రులు దీర్ఘ మగుననియు నారు వ్రాసినారు. ఇంత వఱకు
సరిగా నున్నది. కాని నరకమునకు, పురీషాది మలములని
యరము చెప్పి యామలమును బరిశుభ్రముచేయు కాలమిది
యనియు, నందులకై యీ పండుగ చేయుదురని చెప్పుచో
వీరు తప్పుదారిని బట్టిరి. దీర్ఘరాత్రులను మన సాధారణ
రాత్రులకన్న నొకటి రెండు గడియలు హెచ్చుగా నుండుట
యని వీరు భావించిరి. వీరి కుత్తరధ్రువ పరిస్థితులు జ్ఞాపకము
నకు వచ్చియుండిన తప్పక నా సిద్ధాంతమునకు వచ్చెడివారే!

ఇక రెండవ యంశము, బలిపూజ నీ దివసమునఁ
జేయువలయునను శ్లోకములం దీపంక్తి గమనింపఁ దగినది.

"మహారాత్రి స్సముత్పన్నా చతుర్దశ్యాం మునీ
శ్వరాః"

అనగా నీచతుర్దశినాడు మహారాత్రి యుద్భవించెను. ఈ మహారాత్రి పద మేకవచముగా వాడినారు. మఱియు మహారాత్రి యనుట మన దీర్ఘరాత్రి కర్థ మన్వయించు చున్నది. ఉత్తరధ్రువ పరిస్థితులు పురాణకారులకుఁ దెలియ నందున వారు మహారాత్రియని వాడినను దాని యాథార్థ్యమును గమనింపక పోయిరి. ఇక మూడవ యంశము వామనుఁడు బలిని పాతాళమునకు త్రొక్కెనని వర్ణించుచు బలి రాక్షసులకు రాజని చెప్పఁబడెను. రాక్షసులు రాత్రించరులని ప్రసిద్ధి నొందినవారు. మఱియు బలి నివాసమిప్పుడు పాతాళమని చెప్పుదురు. పాతాళము చీకటితో నిండినట్టిది. ఈ యంశము వలన బోధయగుట యేమన: సూర్యుడు (విష్ణువు) బలిని పాతాళము వఱకు ద్రొక్కుచు వెంబడించె ననుటచేఁ జీకటిలో నిలిచి ప్రపంచమునకు జీకటి గలిగించెనని యర్థము కలుగుచున్నది. కావున బలిపూజ చేయుచు

శ్లో॥ చతుర్దశ్యాం దినేరాజ్యం బలేరస్త్వితి యాచరేత్.

అని వ్రాసియున్నారు. అనగా మవల బలి రాజ్యము కలుగు గాక! లేక మరల సూర్యుడు బలిని విడిచి మా కగపడుగాక యని దీని రహస్యము.



# విజయ దశమి



ఈ పండుగ హిందువుల పండుగలలో ముఖ్యమైనది. ఈ యుత్సవమును దస యనియు వ్యవహరింతురు. ఈ పండు ఆశ్వయుజ శుక్లదశమీ దినమున ప్ర సంవత్సరమును జరుపఁ బడును. విజ దశమి యనుట కనేక కారణములు అనేక రీతుల సూచింప బడు చున్నవి.

శ్లో॥ ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయే
సకాలో విజయోనామ సర్వకామార్థ సాధకః॥

అనగా ఆశ్వయుజ శుక్లపక్ష దశమీ దినము సాయం కాలము (సంధ్యాకాలము) విజయకాల మనఁబడును. ఆ కా లము సర్వకామ సాధకమై యున్నది. ఈ దినమందుఁ ప్ర గ్రామమందును హిందువులు శమీవృక్షమును మంగళ వాద్య ములతో సమీపించి పూజింతురు. ఆ శమీపూజ (జమ్మి ట్టుపూజ) యీ క్రింది మంత్రముతో జేయబడును.

శ్లో॥ శమీశమయతే పాపం శమీ శత్రువినాశనీ।
అర్జునస్య ధనుర్ధారీ రామస్యప్రియవాదినీ॥
శమీశమయతేపాపం, శమీ లోహితకంటకా।
ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియవాదినీ॥

కరిష్యమాణ యాత్రాయాం ।
యథాకాలం సుఖంమయా ।
తత్రనిర్విఘ్న కర్త్రీత్వంభవ శ్రీరామ పూజితే॥

అనగా—శమీవృక్షము పాపమును శమింపఁజేయు చున్నది. ఇది శత్రువుల నాశనము చేయును. ఇది అర్జునుని ధనువును ధరించి యుండెను. శ్రీరామునికి ప్రియమొనరించెను. ఇది యాత్రజేయు వారికి సౌఖ్యము నిచ్చును. కార్యములను నిర్విఘ్నముగా సాగించును.

ఈదినము దేవపూజలు జరుగును. సాయంకాలమందు శమీ పూజకై పోవునపుడు సీమోల్లంఘనము చేయవలయును. అనగా ప్రతి గ్రామజనులును తమ గ్రామపుఁ బొలిమెర వలకు పోయిరావలయును.

ఈ దసరా యొక్క ప్రారంభ మెట్లయ్యెనో అనేకులనేక విధములఁ జెప్పుచున్నారు, కొందఱిది రాముల విజయమునుండి ప్రారంభ మయ్యెననియు గొందఱు విజయుని (అర్జునుని) విజయము నుండి యేర్పడెననియు వచింతురు.

శమీ పూజయందు అర్జునుని పేరును, శ్రీరాముని పేరును నుచహరింపఁ బడుటచే నీయిద్దఱి మహాపురుషులతో నీయుత్సవము సంబంధించినదని యెంచి యీగాథ లేర్పడియుండును.

శ్రీరాముల సంబంధమిట్లుల జెప్పబడు చున్నది:-

శ్రీరాములు రావణునితో యుద్ధముచేయుతఱి రాక్ష
తలలు తునిమిన కొలది మఱల యుత్పత్తి యగుటను వ
శ్రీరాములు భీతిజెంది నిద్రించి యుండిన దేవిని (శక్తిని)
జించెను. దేవియు మేల్కాంచెను. మేల్కాంచిన సమయ
ఆశ్వయుజ శుద్ధ ప్రథమ. ఆనాడు దేవి శ్రీరాముల పూ
సంతసించి వారికి విజయము కలుగునట్లు చేసెను. నాటి న
పదియవ దినమందు శ్రీరాములు సంపూర్ణ విజయ
పుష్పక విమానమెక్కి యయోధ్యా ముఖుఁడయ్యెను. ఆ
ధ్యకుఁ బోవుటకుఁ బూర్వము శ్రీరాములు శమీపూజ
ను. ఆకారణముచే నీపది దినము లుత్సవము జరిపి పది
దినమున లోకులందఱును శమీ పూజ చేయుచున్నారు.

భారత పరముగా నిట్లు చెప్పెదరు:-

పాండవు లజ్ఞాతవాసము చేయుటకుఁ బూనికొని స
డు తమ యాయుధముల నొక జమ్మిచెట్టుపై దాచి యచ్చ
నుండి మారు వేసములతో విరాట నగరము జొచ్చిరి.
ల యుత్తర గోగ్రహణ కాలమందు తమ సమయము పూ
యగు డుత్తర సహాయముచే శమీ వృక్షమును బూ
యర్జునుఁడు తన ధనుస్సును దీసికొని శత్రువులపై విజయ
పొందెను. ఈ కారణముచే శమీ పూజ చేయుచున్నారు.

చారిత్రికముగా నాచార మిట్లున్నది:-

పై పురాణగాథానుకూలముగాఁ దర్వాతి రాజులు సహితము ప్రతి సంవత్సరమును దమ శత్రువులపై జయము పొందఁ గోరి యీ యాశ్వయుజ మాసారంభము నుండి తొమ్మిది దినములు దేవీ పూజలు సలిపి పదవ దినము తమ సిబ్బంది గుఱ్ఱము, ఏనుగులు, ఆయుధములు మున్నగు వానితో నూరేగింపుచేసి శమీ వృక్షపూజ చేయఁదొడఁగిరి. నేటికిని హిందూ రాజులు తమ తమ రాజ్యములలో దేవీ పూజలతోఁ బాటిగా నొక దినము ఆయుధ పూజను సలిపి కడపటి దిన మూరేగింపు తర్వాత దర్బారు చేయుదురు. అందు రాజు సింహాసనాసీనుఁడై బ్రాహ్మణుల మంత్రములచే నాశీర్వదింపఁబడి వారిని నితరులను దక్షిణాది బహుమానములచేఁ దృప్తిపఱచును.

ఈ పండుగు క్షత్రియుల సంబంధమగు పండుగ యనుటకు

శ్లో॥ తస్మిన్ నరై ర్విధాతవ్యా యాత్రా విజయకాంక్షిభిః

అను దానిచే దీనిని రాజులు శత్రువులపై జయమును పొందఁగోరి చేయుచుండిరని తెలియవచ్చెడి. రామాయణ భారతవీరులందఱకును నాదర్శపురుషులు కావున నావీరులీమాసమందే యుద్ధసన్నద్ధులై నందున రాజులందఱును నిదియే జైత్రయాత్రకు దగిన కాలమని నిర్ణయించినట్లున్నది.

శమీవృక్ష పూజయందు,

శ్లో॥ అర్జునస్య ధనుర్ధాత్రీ రామస్య ప్రియదర్శినీ॥

అని యుండుటచే లోకమందు పై నుదహరించిన శ్లోకము రాముని పరముగను నర్జునుపరముగను నెవ్వరికి ప్రియమగునట్లువారు చెప్పఁదొడఁగినారు. కాని ముఖ్యముగ రామాయణమునకే యీపండుగ సంబంధించినదని నాయభిప్రాయము ఎట్లన రామాయణమందు శ్రీరాముఁడు శరదృతువు ప్రారంభమగుట తడవ విరహార్తుఁడై నానావిధములఁ బరితపించి యాఋతువు రాజులకు జైత్రయాత్రకు జాల యనుకూలమైయున దని ఇట్లు లక్ష్మణునితోఁ బరిపరివిధముల బరితపించెను.

శ్లో॥ సూర్యాతపక్రమణ నష్టపంకా
భూమిస్సముత్పాదిత సాంద్రరేణుః।
అన్యోన్యవైరా మర్షాయతానా।
ముద్యోగకాలోద్య నరాధిపానామ్.

శ్లో॥ అన్యోన్య బద్ధవైరాణాం, జిగీషూణాం నృపాత్మజ॥
ఉద్యోగ సమయస్సౌమ్య పార్థివానా ముపస్థితః॥
ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ॥

మఱియు హనుమంతుఁడు సుగ్రీవునితోఁ నీశరదృతువుయొక్క యారంభమందు రాజులు శత్రువులపై దండెత్తుదురని నీక్రిందివిధముగ నివేదించెను.

శ్లో॥ ప్రాప్తముద్యోగ కాలంతు నావైపి. హరిపుంగవ॥

అనంతరము సుగ్రీవుఁడు వానర సైన్యమును పదిదిన ములలో కూర్చుట కాజ్ఞ యీశ్లోక మందీయఁ బడినది.

శ్లో॥ అహోభిర్దశ భిర్యేహి నాగచ్ఛంతి మమాజ్ఞయా
హంతివ్యాస్తే దురాత్మానో రాజశాసన దూషకాః॥

అనగా వానర సైన్యమంతయు పది దినములలో సర్వ దిక్కుల నుండి తన నగరము చేర రావలసినదనియుఁ దడసిన వారిని శిరచ్ఛేదము చేయుదుననియు నీ విధముగ నాజ్ఞ ప్రక టించెను. శరదృతువు ఆశ్వయుజ మాసారంభము నుండి ప్రా రంభమగును. వానర సైన్యము లన్నియు నాశ్వయుజ దశమి నాడు సుగ్రీవుని పట్టణమందు సమకూడెను. ఇది రామాయ ణ సంబంధము.

ఇట్లు రామాయణ పరముగాఁ బ్రమాణము లున్నను హిందువు లందఱును భారత పరముగనే యందును సరుసుని పరముగనే యీ పండుగు నన్వయించు చున్నారు. ఇందు లకుఁ గారణ మేమన విజయ దశమియందును దానిలో విజయ మను పదమునకు జయమను నర్థమేకాక అర్జునుడను నర్థము గూడఁ గలదు. కావున నీ పండుగు అర్జునుఁడు తన పేడి రూప మును వదలి నిజ రూపము దాల్చిన దినమనియు, పాండవులు

శమీ పూజచేసి తమ యాయుధములు తీసికొని పోయిన ది
మనియు అర్జునుడు ఉత్తర గోగ్రహణము చేసినదీ దివసమే
నియు బలువురు పలువిధముల జెప్పెదరు. ఇందెవ్వి యథా
ములో మఱివ్వి యయథార్థములో నెమ్మదిగా విచారింతము

ఉత్తర గోగ్రహణ మీ శుద్ధదశమి నాడనుటకు భా
మందుఁ బ్రమాణముండుటకు మారుగా దానికి విరుద్ధమ
ప్రమాణ మున్నది. తెనుఁగు భారతమున నుత్తర గోగ్రహ
మును గుఱించి యిట్లున్నది. సుశర్మతో దుర్యోధనుఁ డి
పలుకు చున్నాడు.

క॥ బహుళాష్టమి నీతఁడు స
న్నహనముతోఁ బసులబట్టు నవమిని మన గో
గ్రహణమని నిశ్చయించిన
సహ కేతనుపలుకులకు మహాహ్లాద మునక్.

దీనినే సంస్కృతమునం దిట్లు వ్రాసియున్నారు.

శ్లో॥ ఆదాతుంగాః సుశర్మాథ కృష్ణ పక్షస్యసప్తమీం।
అపరేదివసేసర్వే రాజన్ సంభూయ కౌరవాః।
అష్టమ్యాం తేన్యగృహ్ణంత గోకులాని సహస్రశః॥

తెనుగు భారతమందు బహుళాష్టమీ నవమీ తిథు
దక్షిణోత్తర గోగ్రహణములకై నిర్ణయింపఁ బడెనని య

సంస్కృత మూలమున బహుళ సప్తమ్యష్టమీ తిథులు నిర్ణయింపఁ బడెను. ఏది యెట్లున్నను నీ తిథు లేమాసమందు వచ్చిన వైనను శుక్లపక్షమందు గాక బహుళ పక్షమందు వచ్చుటచే విజయ దశమి యుత్తర గోగ్రహణ సంబంధమైనది కాదని నిశ్చయమైనది.

ఇఁక శమీపూజ యీ దినము చేసినట్లు భారత మందే నిదర్శనములును లేవు. శమీ పూజచేసి పాండవులు తమ యాయుధములను దీసికొనిన యనంతరమే యభిమన్యుని పెండ్లి యయ్యెను. ఈ యభిమన్యుని పెండ్లి యెప్పుడైనది నిర్ణయించిన శమీ పూజా దివసము కూడ నిర్ణయ మగును. భారత యుద్ధమెప్పుడు జరిగినది నిర్ణయించిన అభిమన్యుని పెండ్లి నిర్ణయమగును. కావున ముందు భారతయుద్ధ ప్రారంభ దివసమును నిర్ణయించెదము.

శ్రీకృష్ణుని రాయబార ముద్యోగపర్వమందు జరుగును. అతఁడు రాయబారిగాఁ బోవు నప్పుడిట్లు వర్ణింపఁ బడినది.

శ్లో॥ తతోవ్యపేతతమసి సూర్యేవిమల వద్గతే
మైత్రేముహూర్తే సంప్రాప్తే మృద్వర్చిషి దివాకరే।
కౌముదేమాసి రేవత్యాం శరదంతే హిమాగమే।
స్ఫీతసస్య సుఖే కాలే కల్యఃసత్వ వతాంవరః॥

అనగా శ్రీకృష్ణుడు సూర్యోదయమయిన వెంటనే మైత్ర ముహూర్తమందును కార్తీక మాసమందును శరత్కాలాంతమందును హేమంతర్తు ప్రారంభమందును రాయబారియై బయలు దేరెను. ఈ శ్లోకమున నీలకంఠ వ్యాఖ్యానమందు కౌము దేమాసి అనగా కార్తీక మాసము అని యర్థము వ్రాయబడినది. అంతియుకాక శరదంతము హిమాగమము కార్తీ మాసాంతమందే వచ్చును. ఈపై ప్రమాణమున కుప్రోద్బలముగా శ్రీకృష్ణుడు తానుతిరిగి పాండవుల దగ్గఱకువచ్చుచు కర్ణునితోఁ జెప్పినవాక్యములందు గానవగును. శ్రీకృష్ణుడు కర్ణునితో నిట్లనెను.

శ్లో॥ బ్రూయాత్కర్ణ ఇతోగత్వా ద్రోణశాంతనవం కృపం।
సౌమ్యోయం వర్తతేమాసః సుప్రాపయవసేంధనః।
సర్వౌషధివనస్ఫీతః ఫలవానల్పమక్షికః।
నిష్పంకో రసవత్తోయో నాత్యుష్ణ శిశిరస్సుఖః।
సప్తమా చ్చాపిదివసా దమావాస్యాభవిష్యతి।
సంగ్రామోయుజ్యతాంతస్యాంతామాహుశ్శక్రదేవతాం।

అనగా ఓకర్ణ నీవుపోయి భీష్మద్రోణ కృపాచార్యుల సన్నిధిలో నిట్లనుము. ఈమాసము సౌమ్యమయి పొట్టుకట్టెలు సులభముగా దొరుకు కాలమై నానాఫలౌషధి సంయుతమై

-ఈగలులేనిదై సమశీతోష్ణస్థితికలదై బురదలేనిదై యున్నది. కావున నింకఏడుదివసములకు అమావాస్య వచ్చును. నాఁడా ల్లభంగుల ఖండనము కాఁగలదు"

ఇట్లుచెప్పుటచే నమావాస్యనాఁడు యుద్ధముప్రారంభ మయ్యెనని విశదమగును. శ్రీకృష్ణుడు కార్తికమాసాంతము లో రాయబారిగాఁ బోయియుండెనని పైన జూపియుంటిమి. మఱి యిప్పటిశ్లోకమువలన శ్రీకృష్ణుడు కార్తిక బహుళ షష్ఠినాడు పాండవుల పక్షమున రాయబారిగాఁ గౌరవులద గ్గఱకుబోయి బహుళాష్టమినాడు తిరిగివచ్చెనని యర్థమగుచు న్నది. ఏలన షష్ఠినాడు బయలుదేరి రాత్రి కుశస్థలములోని దించి సప్తమినాడు కరినగరముజేరి యారాత్రివిదురునింట నిదించి అష్టమినాడు ప్రొద్దున రాయబారముజరిపి విఫలీకృ తుఁడై తిరిగి పాండవుల పాలికిఁబోవుచు కర్ణునితో పైవిధమున జెప్పినట్లు భారతమందు వర్ణింపఁబడినది. కావున కృష్ణుఁడు బహుళాష్టమి తిరిగివచ్చుటయు కార్తికామావాస్యనాడు యుద్ధము ప్రారంభమగుటయు నిశ్చయమయ్యె. కార్తికా మావాస్యనాటి వర్ణనయు గమనింపఁదగినది. హేమంతారం భమందే నిష్పంకము, నిర్మక్షికము నాత్యుష్ణము నాతిశీత ఎము ఫలసమృద్ధిమున్నగునవి కానవగును. భారతయుద్ధము కార్తికామావాస్య నాడేయను విషయము నితరాధారముల

చేతను సిద్ధయింపవచ్చును. శాంతిపర్వమందు భీష్ముని సంత ర్పించినప్పుడు శ్రీకృష్ణుఁ డాతనితో నిట్లనెను.

శ్లో॥ పంచాశతం షట్చ కురుప్రవర
శేషం దినానాంతవ జీవితస్య
తతశ్శుభైః కర్మఫలోదయైస్త్వం
సమేష్యసే భీష్మ విముచ్యదేహం॥

ఈశ్లోక మనేక శంకలకు మూలమైనట్లున్నది. కావున గ్రంథవిస్తరమైనను నిచ్చట వివరముగా జర్చించుట యావ కర్తవ్యమైయున్నది.

ఈపైశ్లోకమునకు సాధారణముగా నందఱకును గోచరించు నర్థమునే తిక్కనసోమయాజి గారర్థముచేసికొని యీ క్రిందివిధముగా తర్జుమాచేసినారు.

తే॥ అనఘ యినుడింక యేబదియాఱుదివస
ములకు దానుత్తరాయణమునఁ జెంపఁ
దొడఁగు నీవిష్ణు దేహంబు విడిచియేగు
దపునరావృత్తి పదమున కభిమతముగ॥

శాంతి ౨ ఆ॥ ౧౧౧౭ ప॥

శాంతి పర్వాదియందు పాండవులు యుద్ధము ముగించిన యనంతరము నిఖిల జ్ఞాతులకు సంస్కారము గావించి "గంగాతీరంబున నశుచిత్వం బవన యించుటకై యచ్చట మాసత్రియంబు నిలిచిరి." అని యున్నది. సంస్కృతిమూలమందు నిదేవిధముగా నున్నది. ఈనెల దినముల యనంతరము శ్రీకృష్ణుడు యుధిష్ఠిర సహితుండై భీష్ముని పాలికరిగి యాయనతోసింక ౫౬ దివసముల కుత్తరాయణము వచ్చుననియు నప్పుడాతడు ప్రాణములు వదల వచ్చుననియు చెప్పెను. అనగా యుద్ధానంతరము ౮౬ దినములకు భీష్ముండు చచ్చుట యని నిశ్చయ మయ్యెను. భీష్ముండు మాఘ శుక్లాష్టమి నాడు చచ్చెనని నిరూపింతురు. ప్రకృతము అతిథిని సిద్ధాంతులు గుర్తించి దాని నుండి ౮౬ దివసములు తీసివేసి కార్తిక శుద్ధ ఏకాదశి నాడు భీష్ముండు యుద్ధభూమిపై యంపశయ్యపై బడెనని నిర్ణయించిరి. ఈ లెక్క ప్రకారము క్కై చేయవలసి వచ్చును. కావున వ్రత గ్రంథములలో ట్లు వ్రాసియున్నారు.

శ్లో॥ కార్తికస్య సితేపక్షే స్నాత్వాసమ్యగ్యత వ్రతః
ఏకాదశ్యాంగృహ్ణీయాత్ వ్రతం పంచదినాత్మకం॥
ఏకాదశ్యాం కార్తికస్య యాచితంచ జలంత్వయా।
అర్జునేన సమానీతం గాంగం బాణస్యవేగతః॥

తుష్టానితవ గాత్రాణి తస్మాదద్య దినావధి
పూర్ణిమాంతం సర్వలోకా స్తర్పయంత్వర్ఘ్య దాన్

అనగా కా.ర్తిక శుద్ధైకాదశినాడు భీష్ముఁడంపశయ్య
బడి దప్పిగొని నీరడుగ అర్జునుఁడు బాణముచే భూమినిఁ
జలధార నుబికించి భీష్ముని తృప్తుఁజేసెను. ఇంక ఈ పై
క్తికైకాదశి సరియైనదో కాదో విచారింతము. భీష్ముఁడు
పోవు నాఁడిట్లనుచున్నాఁడు.

శ్లో॥ దిష్ట్యాప్రాప్తోసి కౌంతేయ సహామాత్యో యుధిష్ఠిర
పరివృత్తోహి భగవాన్ సహసాంశు ర్దివాకరః।
అష్టపంచాశతం రాత్ర్యశ్శయా నస్యాద్య మేగతాః।
శరేషు నిశితాగ్రేషు యథావర్ష శతంతథా
మాఘోయం సమను ప్రాప్తోమాస స్సౌమ్యోయుధి
త్రిభాగ శేషః పక్షోయం శుక్లోభవితు మర్హతి॥

అనగా నేను శరపంజరము పైబడి ౫౮ దినము
ను. ఈ ౫౮ దినముల కష్టము నాకు నూరేండ్లుగాఁ గ
నది. నేఁడు మాఘ శుక్లాష్టమి కాన నిది నాకు మృతి
కుత్తమ దినము.

అనగా మాఘ శు॥ ౮ నుండి ౫౮ దినములు తీసివేసిన మార్గశిర శు॥ ౧౧ వచ్చును. ఆనాడు భీష్ముఁడు శరపంజరసుప్తుఁ డయ్యెను. ఇదియే సరియయిన ముందు జూపిన ౮౬ దివసముల లెక్క యెట్లు కుదురును. కావుననే యీ మతభేదములను సమన్వయించుటకై నీలకంఠ వ్యాఖ్యానముపై

శ్లో॥ పంచాశతంషట్చ..........

అను శ్లోకమునకు తిక్కన "అనఘ యినుడింక యేబదియారుదివసములకు దా నుత్తరాయణమున జరింప" అను నర్థము చేసినట్లు చేయక వేరు విధముగా నర్థముచేసి సమన్వయము చేసినది—ఎట్లన

పంచాశతంషట్చేతి తవజీవిత సంబంధినాం। దినానాం శేషం పంచషట్చ। పంచవార మావర్తితాః షడితిరీత్యా త్రింశతిజ్ఞేయం। తావదేవ అశతశతా వధియద్దినానాంశితేన కర్తుంశక్యం తత్త్రింశతాంకర్తుః శక్యమిత్యర్థః। తత్రత్రింశ త్పరిశిష్టాః। అష్టావింశతిః ఇతః పూర్వం వ్యతీతాః। తథాహి భీష్మస్య శరతల్పశయనా నంతరం। అష్టాదినాని యుద్ధం। తతోదుర్యోధనాశౌచం। యయుతో షోడశదినాని తేనసహాపురం

ప్రవిశతాం పాండవానామపి తావంతి దినాని
గతాని పంచవింశే సర్వేషాం శ్రాద్ధదానం।
షడ్వింశే పురప్రవేశః। సప్తవింశే రాజ్యాభిషేకః।
అష్టావింశే ప్రకృతిసాంత్వనం। అభ్యుద్దైకం దానంచ
ఊనత్రింశే భీష్మం ప్రత్యాగమనం। తద్దినం ఆరభ్య
త్రింశతి దినానీతిజ్ఞేయం॥

దీని భావమేమన శాంతి పర్వాదిలో ౩౦ దినములు పాండవులుండి పిమ్మట భీష్ముని దర్శించుకొని యాతనితో నింక ౫౬ దివసముల కుత్తరాయణమందు భీష్మునకు చావగలఁడని చెప్పుటయు భీష్ముఁడు చచ్చునాడు తాను యుద్ధానంతరము ౫౮ దినములు శరతల్ప మందుంటినని చెప్పుటయును నసమంజసము గావున దానిని సమన్వయించుటకై ౫౬ దివసములకు అనుటకు సంస్కృతములో "పంచాశతం షట్చ" అను దానికి ౫౬ అను నర్థము కాదనియు అయిదార్ల ముప్పది యను నర్థమేయనియు నీలకంఠులవారు వ్యాఖ్యానము చేసినారు. ఇట్లు చేయుటచేత గంగా తీరమందుండిన ౩౦ దినములు కృష్ణుడుత్తరాయణము "పంచాశతంషట్చ" (30 దివసములకు) వచ్చునని చెప్పుటయు కలిపిన ౮౬ దివసములకు మారుగా ౬౦ దివసములే వచ్చును. ఇవి భీష్ముడు చెప్పిన ౫౮ దినముల లెక్కకు సరిపోవును. ఇట్లుపాయము

చేసి సమన్వయము చేసినారు. యుద్ధము కార్తీకా మావా
స్యనాడు ప్రారంభమైనది నిస్సందేహము. భీష్ముడు మాఘ
శుక్లాష్టమినాడు చచ్చినది నిస్సంశయముగా అను శాసనిక
పర్వమందుఁ బైశ్లోకములందుఁ జెప్పబడినది. ఇఁక సందేహము
కలిగినది ౫౮ దినముల లెక్కయే. ఇది తిక్కన సోమయాజుల
వంటి వారికిఁ గూడ ౫౮ దినములుగా నర్థమగుచుండ దానిని
సమన్వయించుటకై వ్యాఖ్యాతకు ౩౦ దినములను నర్థము
చేయావలసి వచ్చినది. ఈ పదముల అర్థభేదము చేతనే పొర
పాటులు జరిగినవి. కావున తెనుఁగు భారతము ప్రకారముసే
నిదివఱకు లెక్కించి వ్రాయగా ఆశ్వయుజా మావాస్యనాడు
యుద్ధమయ్యెనని నిశ్చయింప వలసి వచ్చెను. సంస్కృత భారః
తమును జూచిన యనంతరము లెక్క తప్పనియు కార్తీకా
మావాస్యయే యుద్ధారంభ దివసమనియు నిశ్చయ మయ్యెను.
ఇఁక అభిమన్యుని పెండ్లి నిశ్చయింప వలెను.

స్త్రీ పర్వమందు కౌరవ స్త్రీలు తమ యాప్తుల శరీర
ముల పై బడి విలపింతురు. అందుత్తర యభిమన్యుని కళేబ
రము పై బడి యిట్లు విలపించును.

సీ॥ దేవలోకంబున నీవిప్పుడెవ్వతెఁ
దీపారుపలుకుల దేర్చెదరులు ।

* * * *

యంగనాగోష్ఠి నున్నపుడు నానడవడి
బుద్ధిదలంతె, నిన్నొంంద గాంచి
యాఱునెలలు వోయె.

యని యభిమన్యుని నుత్తరపొంది యాఱు నెల లయ్యె
నని విలపించు చున్నది.

సంస్కృత భారతమందలి భావమిట్లున్నది:—

"నిన్ను బొంది యాఱు నెల లయ్యెను. నీవు ఏడవ మాస
మందుఁ జంపఁబడితివి." మనము కార్త్తికాంతము యుద్ధారం
భమని నిశ్చయించితిమి కదా! నాటికి ఏడు నెలల పూర్వము
యుత్తరాభిమన్యుల పెండ్లి యయ్యెనని యుత్తర మాటల
వలనఁ దెలిసెకదా! అట్లైన వీరి వివాహము వైశాఖ మాస
మందయ్యెనని తెలియఁ గలదు.

ఇఁక శమీపూజా దినమును విచారింతము. అభిమ
న్యుని పెండ్లికిఁ బూర్వము పాండవులు ప్రకాశులై శమీ
పూజజేసి తమ యాయుధములఁ దెచ్చుకొనిరని యున్నది.
అనగా వైశాఖ మాసమందో లేక చైత్రమాసాంతమందో
వీరిట్లు చేసిరని చెప్పవలెను. అటు కాక వీ రాశ్వయుజ
శుద్ధ దశమి నాడె శమీ పూజ చేసిరనిన వీరిట్లు పూజ

చేసిన ౭, ౮ నెలల తర్వాత నభిమన్యుని పెండ్లి చేసిరని చెప్పవలెను. ఇట్లు లెక్కించిన వీరు శమీ పూజచేసి యొక్క సంవత్సరమయిన తర్వాత యుద్ధము చేసిరని చెప్పవలెను. ఇట్లు చెప్పుటకుఁ బ్రమాణములు లేవు. మఱియు నింత యవధి జరిగినట్లు కథా సందర్భములఁ బట్టి మనకుఁ గనుపింపదు.

కావున పాండవులు చైత్రమందు శమీ పూజ చేయుటయు వైశాఖమందు అభిమన్యుని పెండ్లిచేయుటయు నిశ్చితములగుటచేఁ బెండ్లి యనంతరమాఱు నెలల కాలమందుఁ బాండవులు సైన్యమును సమకూర్చుటయు రాయబారము పంపుటయు గావించిరని చెప్పవలెను. మూఁడు రాయబారము లీయంతరాళమున జరిగెను. కౌరవుల పక్షమున సంజయరాయబారమును బాండవుల పక్షమున పౌరోహితుని రాయబారమును శ్రీకృష్ణుని రాయబారమును జరిగెను.

ఇఁక విజయ దశమిని భారతమున కంటగట్ట వలెనని ననిట్లు చెప్పవలసి వచ్చును. ఆశ్వయుజ శుద్ధ దశమినుండి కార్తీక బహుళ షష్ఠీవఱకు కనగా శ్రీకృష్ణుని రాయబారము వఱకు సుమారు ౪౦ దివసముల వ్యవధి యున్నది. ఈ కాలములో వీరు యుద్ధసన్నద్ధులై తెగించుటకుఁ, బూర్వము శ్రీకృష్ణుని ద్వారా రాయబారము జరిపిన ట్లూహించ వలెను.

అనగా నీ శుద్ధ దశమి నాటికి పాండవులు తమ సైన్యములను కావలసి నన్ని టి ని స మ కూ ర్చు కొ ని యు ం దు రు. శ్రీ కృ ష్ణ ని రా య బా ర ము న కుఁ బూ ర్వ మే కాక ద్రుపదుని పౌరోహితుని ప్రథమ రాయబారమునకుఁ బూర్వ మే సైన్యము లుభయపక్షములకు వచ్చి చేరెనని యిట్లు భార తమందు వర్ణింపఁబడి యున్నది.

క॥ ఇభతురగ స్యందనగతి,
విభసంబునఁబృథు వియదుర రాఁదొడగిఁభూ
విభులునలు దిక్కులకు లో
కభయంకర లీలనుభయకటకంబులకుఁ॥

ఈ ప్రకారముగా సైన్యములు ఆశ్వయుజ శుద్ధ ౧౦ కి చేరి యుండును. ఇది కేవలమూహామే. భారత ప్రమా ణమేమియు లేదు.

సారాంశము

మొత్తముపై రామాయణమందే సరియగు ప్రమా ణములుండుటచేత నీ పండుగ రామపరముగనే యెంచవలసిన దని నా యభిప్రాయము. వాడుకలో "విజయ దశమి" అనుట చేతను "అర్జునస్య ధనుర్ధాత్రీ" అనుట చేతను భారతమున కర్థమేర్పరచి యిట్లు లోకము విశ్వసించు చున్నది. అర్జునస్య

ధనుర్ధాత్రీ యనునది శమీ వృక్ష వర్ణనలో నొక విశేషణము గానే భావింప వలెను. మఱియు విజయ దశమి యనుదానికి విజయ కాలమందు చేయఁబడు దశమి యని అర్థము.

విజయ కాలమును గుఱించి గ్రంథకారులందఱు నిట్లు వ్రాసినారు.

శ్లో॥ అశ్వినస్య సితేపక్షే దశమ్యాం తారకోదయే।
సకాలో విజయోనామ సర్వకామార్థ సాధకః॥

అనగా ఆశ్వయుజ శుద్ధదశమీ దివసమున సాయంకాలము విజయ కాలమనఁబడును. ఆకాలమందు పూజ లెవ్వరు చేయుదురో వారు తమకార్యములందు విజయము పొందుదురని దీని యర్థము.

కావున విజయ దశమికిని అర్జునునకును సంబంధములేదు. మొత్తముపై యీ విజయదశమి భారతమునకన్న రామాయణమునకే యెక్కుడు సంబంధము కలదై యున్నది.



# ఉగాది



ఉగాది యాంధ్రులకు జాల ముఖ్యమై
పండుగు. దక్షిణ దేశ మంతటను
గూడ రెండు మూడు దినములు హెచ్చు తచ్చుగానీపండుగ
చేయఁబడు చున్నది. దీనినే సంవత్సరాది పండుగని యందురు.
ప్రతి సంవత్సరము చైత్ర శుక్ల పాడ్యమి దినమున నీ పండు
గు చేయఁబడును. ఇదియే యన్ని పండుగులలో
మొదటి పండుగు. ఈ దినమున ప్రతి వా
వారును శిరస్స్నానముచేసిక్రొత్త బట్టలు కట్టుకొందురు. సాయం
కాలమున దేవాలయమందుఁజేరి బ్రాహ్మణాశీర్వాదము
బొంది ప్రతివాఁడును తనకీక నాసంవత్సరమం దెన్ని సున్న
లుండునది విచారించును. బ్రాహ్మణుఁడు పంచాంగము నూ
యేయేవ్యక్తి కెన్ని సున్నలుండునది చెప్పును. ఎన్ని సున్న
లుండిన నన్ని మారులా సంవత్సర మందా మనుష్యుఁ
రోగార్తుఁడగునని దీని భావము. నిజాము రాష్ట్ర మందు
కొన్ని భాగములలో సాయంకాలము దూరిబండ్లన్ని
నలంకరింపఁబడి మంచి యెడ్లచే నీడ్పింపఁ బడును. ఉగాది స

డుగు యొక్క భోజనములలో జాల ముఖ్యమైనది "ఉగాది పచ్చడి" లేక గొజ్జు. ఈ గొజ్జును వేపపూత చేతను లేత మామిడి కాయల ముక్కల చేతను చక్కెర మున్నగు వానిచే సిద్ధము చేయుదురు. అనగా క్రొత్త సంవత్సర ఫల పుష్పములచే నిది సిద్ధము చేయఁబడు చున్నది. ప్రకృతి యంతయు నప్పుడే పాత యాకులను డుల్చి క్రొత్త చివురుల చేతను ఫల పుష్పముల చేతను వికసించు చుండు సమయ మాంధ్రులకు సంవత్సరాది. ఈ పండుగు సర్వ వర్ణముల వారికిని ముఖ్యమైనట్టిది.

పూర్వము "యుగాది" (యుగ + ఆది) (యకారాది పదము) పండుగును నొక దానిని చేయుచుండి నట్టుల భవిష్యత్ పురాణోత్తర భాగమందలి కథనము వలన తెలియవచ్చెడి. శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో నిట్లు చెప్పుచున్నాడు.

కృతయుగము వైశాఖ తృతీయ నాడు ప్రారంభ మయ్యెను. కార్త్తిక నవమినాడు త్రేతాయుగ ముద్భవించెను. నభ త్రయో దశినాడు ద్వాపరము వచ్చినది. మాఘ పౌర్ణిమ కలికాలాది యని చెప్పఁబడు చున్నది. ఈ తిథులు యుగాదులని పండితులచే జెప్పఁబడియున్నవి.

శ్లో॥ యుగాదయశ్చ కథ్యంతే
తథైతాః సర్వసూరిభిః॥

ఈ నాలుగు యుగముల యాది తిథులందు నారా
దేవతలను బూజించి బ్రాహ్మణులకు నానా దానము లియ్య
వలెను.

కలియుగము మాఘ మాస మందు ప్రారంభ మయ్యె
నని పై పురాణము చెప్పుచున్నది. మన ఉగాది చైత్రమందు
జరుగు నట్టిది. కావున పై పురాణము మనకుఁ బ్రమాణము
కాదు.

ధర్మసింధుకారుఁడును నిర్ణయ సింధు కారుఁడును నీ
యుగాది పండుగ సంవత్సరారంభపుఁ బండుగయని నిర్ణయిం
చినారు. ధర్మసింధు కారుఁడు విశేషించి యిట్లు వ్రాయు చు
న్నాడు.

అత్రిశుక్ల ప్రతిపదాది రమాంత ఏవమాసః
ప్రాయేణ దాక్షిణాత్యై ర్యాద్రియతే॥

అనగా నీపండుగు దాక్షిణాత్యులచే నాదరింపఁబడు
న్నదని వీరియభిప్రాయము. ఈపండుగు నాడీ ప్రకారము
చేయవలయునని ధర్మసింధువు చెప్పుచున్నది.

“ నూతన సంవత్సరకీర్తనాద్యారంభః— ప్రతిగృహే
ధ్వజారోపణం నింబపత్రాశనంవత్సరాది శ్రవణం నవరా
రంభో.”

అనగా నీదివసమున ప్రతియింటికిఁ దోరణములుకట్టి వేపపూతచే గొజ్జుచేసి భుజించి వత్సరఫల శ్రవణమును చేయవలయును. కొందలు ఉగాదినుండి శ్రీరామనవమివఱకు శ్రీరామనవరాత్రులు చేయుదురు.

"చైత్రశుక్ల ప్రతిపన్మత్స్య జయంతీత్యేకే"

అనుటవలననీ దివసమునాడు మత్స్యజయంతి యని కొందఱందురని యనుమానముగాఁ జెప్పినాడు.

"ఆర్యపర్వపద్ధతి" యను గ్రంథమొకటి పండితభవానీప్రసాదు [ఆర్య] గారిచే కొన్ని సంవత్సరములకుఁ బూర్వము హిందీలోఁ బ్రకటింపఁబడినది. అందుఁగొన్ని పండుగుల చర్చగలదు. ఈగ్రంథములోఁ గొన్ని విషయములు చాల యుత్తమములుగా నున్నవి. దీనిలో "నవసంవత్సరోత్సవము" లేక సంవత్సరేష్టి. యను శీర్షికయందు యుగాదిపండుగు విషయమున నిట్లు వ్రాయఁబడినది.

"మధుశ్చ మాధవశ్చ వాసంతికావృత్"
యజుర్వేద

అనగా యజుర్వేదమందు సంవత్సరము వసంతముతోఁ బ్రారంభమగుననియు నాఋతుమాసముల పేర్లు మధువు మాధవము అని యుండెననియు వీరి యభిప్రా

యము. కాని కాలక్రమేణ చైత్రాదిమాసములే వ్యవహా
సిద్ధము లయ్యెనట.

హేమాద్రి యిట్లువ్రాసియున్నాడు.

శ్లో॥ చైత్రేమాసి జగద్బ్రహ్మాససర్జ ప్రథమేహని।
శుక్ల పక్షేసమగ్రంతు తదా సూర్యోదయేసతి॥

అనగా బ్రహ్మదేవుడు చైత్రశుక్ల ప్రతిపత్తి
జగత్తుయొక్క ప్రథమ దివసమును ప్రారంభించెను.

భాస్కరాచార్యులు తమ సిద్ధాంత శిరోమణి
జ్యోతిషగ్రంధమం దిట్లుసెలవిచ్చినారు.

శ్లో॥ లంకానగర్యా ముదయాచ్చభానో
తస్యైవవారే ప్రథమం బభూవ।
మధోస్సితాదేర్దిన మాసవర్షం।
యుగాదికానాం యుగపత్ప్రవృత్తిః॥

అనగా లంకానగరమందు భాను డుదయించుట
మధుమాసము (చైత్రము) యొక్క శుద్ధ పాడ్యమి
యుగాదులయొక్క ప్రారంభమయ్యెను. పై శ్లోక మం
"యుగాదికానాం" అను పదము గమనింపదగినది.
ప్రారంభమున యకారాది పదమగు యుగాదిగానే

యుండవలెను. అదితర్వాత నపభ్రంశము కాకున్న తద్భవమై నదని యెన్నవలెను. హిందీగ్రంథకారుడు రెండు మూడు శేషము లీపండుగును గురించి సూచించియున్నాడు. ఔరంగజేబు తనకొడుకగు మొవజ్జమ్ అను వానికి వ్రాసిన జాబు నీపండుగును గురించి యిట్లు వ్రాసెనట. "ఈదినము గ్ని పూజకులగు పారసీకుల పండుగు. మరియు నిది కాఫరు న హిందువుల విశ్వాసాను సారముగ ధిక్కృతుడైన విక్ర మాదిత్యుని రాజ్యాభిషేక దివసము. మరియు హిందూదేశము నిది సంవత్సర దిగా నున్నది." దీనిమూలము పార్సీలో న్నది. పై యౌరంగజేబు ధిక్కార వాక్యములలో క్కటి గమనింప దగినదియున్నది. ఈపండుగు పార్సీల గూడ సంవత్సరాది పండుగుగా నున్నదనుటలో నీయా రము ప్రాచీన వేదకాలమందు ఆర్యులు, పార్సీలు కలిసి ండిన కాలపు మర్యాగను సూచించుచున్నది. మరియు భవాని ప్రసాదపండితుస యభిప్రాయమున నీ చైత్రాది మే పూర్వము హిందూస్థాన మంతటను నుండెనట. తర్వాత చాంద్రసౌరమాన భేదములు కలిగిన తర్వాత ణమున చైత్రమాసమందును నుత్తరనున మేషసంక్రాం దును నీపండుగుచేయు నాచారమయ్యెనట. ఈపండితు యభిప్రాయములు గమనింపదగినవి.



# శ్రీరామ నవమి



ఇది విష్ణువ తారమని పేరు గాంచిన శ్రీ
చంద్రుని పుట్టుక దినము. కావున
దూ ప్రపంచ మంతయు నీ దినమున
సుదినముగా భావించి గృహ గృహ
త్సవములు సలుపును. అవతార పురుషుల జన్మదివస
శ్రీకృష్ణాష్టమియు శ్రీరామ నవమియు ముఖ్యమైన
రామ నవమి ప్రతి సంవత్సరము చైత్ర శుక్ల నవమి
మందు జరుపఁ బడును. ఈ పండుగును గురించి ప్ర
మణి యందు అగస్త్య సంహితలో నిట్లు వ్రాయ
యుదాహరింపఁ బడినది.

శ్లో॥ నవమీచాష్టమీ విద్ధాత్యాజ్యా విష్ణుపరాయ
ఉపోషణం నవమ్యాంవై దశ ...ర్యాం పారణ
చైత్రమాసే నవమ్యాంతు జాతో రామస్స్వ
పునర్వస్వృక్షసం యుక్తాసాతిథి స్సర్వకామ

అనగా నవమీ దినమున వైష్ణవులందఱు నుపవాసముండి దశమీదిన ముదయమున పారణచేయవలయును. ఏలన చైత్రమాస శుక్ల నవమినాడు శ్రీమహావిష్ణువు స్వయముగా శ్రీరామావతారమెత్తెను. ఈదినము సమస్తకామముల నొనగూర్చునట్టిది.

శ్రీరాముల యవతారమును గుఱించి చెప్పవలయుననిన రామాయణ మంత కథయగును. శ్రీరాముల చరిత్రను మొదట వ్రాసినవాడు వాల్మీకి. యీతని రామాయణమునే యాదికావ్యమని వ్యవహరింతురు. తర్వాత నానా దేశభాషలందు రామాయణకథ తర్జుమాచేయఁబడెను. హిందువులలో సీతారాముల కథ తెలియని దౌర్భాగ్యుఁ డొక్కఁడైన లేడని గట్టిగాఁ జెప్పవచ్చును. కావున నాకథ నిందు వివరింపనైతిని.

హిందువులలో ఏకపత్నీవ్రతుని నిదర్శనమునకు శ్రీరాములకన్న మించిన యుదాహరణ మింకొకటి కానేరదు. హిందూ స్త్రీలకు పతివ్రతా ధర్మమునకై సీతాదేవికన్న మించిన యాదర్శముండదు. రామాయణకథ హిందూపురాణముల యన్నింటిలో నత్యంత ప్రాచీనమైనదిగా సత్యమైనదిగాఁ గనఁబడు చున్నది. దక్షిణ అమెరికా దేశములోని మధ్యభాగమందు నివసించు రెడ్ ఇండియన్ మున్నగు నాదినివాసులలో నేటికిని "సీతారాముల" యుత్సవ మొక

టి ప్రతి సంవత్సరము జరుపc బడుచున్నదనియు, సీతా
ముల గుఱించిన పాటలు పాడుచురనియు, నీ యుత్సవ స
ర్భమున సీతారాముల గూర్చిన నాటకము లాడుదురని
చరిత్ర పరిశోధకులు తెలుపు చున్నారు. ఈ యంశము
ననేక విశేషములుబయలు పడుచున్నవి. ఒక కాలమ
హిందువులు అమెరికా దేశముతో వ్యాపారము చేసిరని
నూహించిన నాశ్చర్య మేమియులేదు. ఏలన నొక కులమ
నేటి సంకుచిత పద్ధతివలె కాక హిందువులు తమ మత ప్ర
మును సర్వ ఖండములందు చేసినవారు. ఒక కాలమ
హిందువులకు మించిన సముద్ర వ్యాపారులు ,ప్రపంచ
లేకుండిరి. కావున రామాయణ కథ హిందువులచే
బనుకన్న రెండు మూడు వేల యేండ్లకుc బూర్వమే
ఖండాంతరములందు వ్యాపింపc జేయcబడినది.

రామాయణము సర్వ ప్రపంచమున కాదర్శ
మనజెల్లును. పితృవాక్య పరిపాలనకును ఏక పత్నీవ్రత
నకును, శ్రీరాములే తార్కాణము భాతృ వాత్సల్య
లక్ష్మణ భరతులే నిదర్శనము. పతి భక్తికి సీతా
పేర్కొనc దగినది. స్వామిభక్తి, సేవాపారాయణత
మంతుడే పేర్కొనc దగిన బంటు. ప్రతి హిందువున
గ్రంధమును జదువు శక్తిమకుంబోక శ్రీమద్వాల్మీకి
రచితమగు శ్రీమద్రామాయణమునే చదివి ధన్యులు

# జన్మాష్టమి



శ్రీమహావిష్ణ్వవతారముగా హిందూప్రపంచముచేఁ బూజింపఁబడు శ్రీకృష్ణభగవానుఁడు శ్రావణ బ ౮ దివసమున జననమందెను. ఈకృష్ణుఁడు అవతారములలో నెనమిదవ యవతారముగాఁ బరిగణింపఁబడుచున్నాడు. ఈమహాపురుషుని చరిత్రము సుప్రసిద్ధమైనది. భాగవతములోను హరివంశమందును, నితర మహాపురాణములందును నీతని చరిత్ర వ్రాయఁబడినది. భారతమందు సహితము శ్రీకృష్ణుఁడే ప్రధాన పాత్ర యనవచ్చును. భాగవతములో నీమహా మహానుని జన్మమునుండి మొదలుకొని సమగ్రమైన చరిత్ర వ్రాయఁబడియున్నది. ఈచరిత్రలో నొక్కయంశము మాత్రము నిందు విమర్శించుచున్నాను. భాగవతమందు శ్రీకృష్ణుఁడు వ్యభిచారిగ వర్ణింపఁబడియున్నాడు. దీనివలన శ్రీకృష్ణుని నిర్మలచరిత్రకొక కళంకము కలిగినది. దీనిమూలమువనే వ్యభిచారమునకు శ్రీకృష్ణుఁడొక సామితగా లోకు

లచే వ్యవహరింపఁబడుచున్నాడు. భక్తిపరముగా సీవ్యర్థ
కథనమును గ్రహించవలసినదిగాఁ గొందఱు సమాధా
చెప్పెదరు. కాని యీభక్తిని బ్రదర్శించుట కిట్టివిధాన
భాగవతరచయిత యవలంబించి నందునఁ దుదకులోకము
శ్రీకృష్ణునకు నింద తప్పకపోయెను.

శ్రీకృష్ణుని చరిత్ర చాల గంభీరమైనది. పుట్టిన
ము చాలవిషమ సమయము. తల్లిదండ్రులగు దేవకీవసుదే
లు క్రూరకంసునిచేఁ జెఱసాలలో నుంపఁబడిరి. కృష్ణుడు
బలరాముఁడును బుట్టిన దాదిగ యశోదానందులను గొల్ల
రల యిండ్లలో దాఁచబడి పెంచఁబడిరి. పిమ్మట విద్య
పెద్దవారై తమ తల్లిదండ్రుల హింసించిన మేనమామను
రి. తర్వాత జరాసంధశిశుపాలాది మహావీరులదెబ్బకు
సముద్రతీరమందు ద్వారకానగరమును నిర్మించి కొం
మునకు శత్రువుల సంహరించిరి. శ్రీకృష్ణుడు మహాబల
బాల్యమందే యనేక దుర్మార్గుల బరిమార్చెను. పెద్ద
పిమ్మట తన బంధువులగు పాండవుల యొక్క రాజసూ
యాగమందు అగ్రపూజ నందెను. భారతయుద్ధమందు
సారధియై పాండవులకు జయమునాపాదించెను. శ్రీకృష్ణు
౧౨౫ సంవత్సరములు బ్రదికినట్లు భాగవతములోని సం
ఘ్ములవలన తెలియవచ్చును. (వివరములకై శ్రీ పెద్ద

ప్రీతమునఁజూడుడు,) ఇతనికి ౮ గురు భార్యలు. అందుముఖ్యురాలు రుక్మిణి.

శ్రీకృష్ణుఁడు గొప్ప తత్వవేత్త. లోకోపకారార్థము భగవద్గీతను బోధించిన మహర్షి. ఈ భగవద్గీత హిందూ మత గ్రంధములలో నొక యుత్కృష్ట గ్రంథమై యున్నది.

ప్రతి సంవత్సరము శ్రావణ బహుళాష్టమీ దివసమున శ్రీకృష్ణుని జన్మదినోత్సవము ప్రతి గృహమందును జరుపఁబడు చున్నది. సాయంకాలమందు శ్రీకృష్ణుని విగ్రహము నూరేగించుదురు. శ్రీకృష్ణుఁడు బాల్యమందు గొల్లల యిండ్లలోఁ జొరిగి పెరుగు పాలు వెన్నను దొంగిలించిన దుడుకు చేతలకు నిదర్శనముగ వీధులలో నుట్లుపెట్టి వాటిని జనులచే కొట్టించు వేడుకలు నేటికిని జరుగు చున్నవి. శ్రీకృష్ణుడెన్ని యో సాహసములు చేసియుండ నీ యుట్ల దొంగతనమునే యాదర్శముగా భారతీయులు గ్రహించి యుండుట యాశ్చర్యముగా నున్నది.

శ్లో॥ శ్రావణే బహుళేపక్షే కృష్ణజన్మాష్టమీవ్రతం ।
నకరోతినరోయస్తు సభవతి క్రూరరాక్షసః॥

అని భవిష్యత్పురాణము ఎం శ్రీకృష్ణుని జన్మదినోత్సవమును బ్రతి మనుష్యుఁడును జేయవలయునని శాసింపఁ బడినది.

## విమర్శ.

హిందువులుచేయు పండుగ లన్నిటిలో శ్రీరామ
మి శ్రీకృష్ణ జయంతి యీ రెండును జాల ముఖ్యమైన
కాని యేమి చిత్రమో శూద్రులలో ననేకు లనేక ప్రాంత
లో నాగపంచమి వంటి పండుగులకు ప్రాముఖ్య మిచ్చి
పండుగను స్మరింపనైన స్మరింపరు. కొన్ని ప్రాంతము
కృష్ణాష్టమి నాడు ఉట్ల పండుగ యనియు ఉట్ల తిరు
యనియు చేయుదురు. ఈ పద్ధతి ఆంధ్రదేశ మం దంత
విరివిగా నున్నది. ఇది దాక్షిణాత్యులు కొందఱు
"లొట్లపండుగు" కన్న మేలే కాని "గుడ్డిలో మెల్లవంటి
శ్రీకృష్ణుడు నిందలకు బాలయినట్లు ఏ యితర మహా
షుడును గాలేదన వచ్చును. ఇట్లు నిందించినవారు వా
మ భక్తులే. భక్తికొఱకై యాపరమ పురుషునిచే చిన్న
మున దొంగతనము చేయించినారు. వయసున వ్యభిచా
చేయించినారు. ఇట్లు వర్ణించుటచేత శూద్రాది జనులలో శ్రీ
కృష్ణుని గౌరవము తగ్గుచు వచ్చెను. శుకసప్తతి కారుడు
గొల్లనిచే నిట్లు చెప్పించినాడు.

సీ॥ మేరలెంచకయూరి వారిండ్లకేగి పా
లేరుగు వెన్నలు మ్రుచ్చిలించెననుచు

నీరాడుతఱి నాడు వారికట్టినపాత
లెత్తుకపోయి చెట్టెక్కెననుచు
బ్రతుకు భాగ్యముక్రింద బడగ బావనయిండ్ల
కరిగియాకటికి కూడడిగెననుచు
కడపట చుట్టాల గరితలపైటలో
జెయివేసి యేమేమొ చేసెననుచు

తే॥ గీ॥ వ్రాసికొన్నారు బావన బైసిగాండ్రు
కొలముసామి విచారించుకోకయిట్లు
చేయునేయంచుఁ బెద్దలచేతవినడు
కృష్ణకథలందు నిటువంటి వెల్లవినుచు.

ఇప్పుడు సూచించిన దేమనగ శ్రీకృష్ణుఁడు పాలు నేయి, వెన్న మజ్జిగ, పెరుగు నట్లలో బెట్టినవి చిన్నతనమున దొంగలించు చుండెనని వ్రాసిన కారణముచేత నిప్పుడా దొంగతనమును నాతని జీవితములోఁ బ్రాముఖ్యమైనదిగా నెంచి యిట్లు పండుగను నూరూరఁ జేయుచున్నారు. దక్షిణ దేశమందుఁ గొన్ని స్థలములందు శ్రీకృష్ణ జయంతి నాడు రాత్రి కాలమందు కొందఱు భక్తులు దంపతులుగా సంకేతిత దేవతాయతనములందుఁ జేరి లొట్లకొలది త్రాగి యారాత్రి కంచుక క్రీడను చేయుదురట. ఈ విషయమును గురిం చియే యొకరు కృష్ణా పత్రికలో ౧౯౧౨ లోనో ౧౯౧౩

## విమర్శ.

హిందువులుచేయు పండుగ లన్నిటిలో శ్రీరామ న
మి శ్రీకృష్ణ జయంతి యీ రెండును జాల ముఖ్యమైన
కాని యేమి చిత్రమో శూద్రులలో ననేకు లనేక ప్రాంతము
లో నాగపంచమి వంటి పండుగులకు ప్రాముఖ్య మిచ్చి యీ
పండుగను స్మరింపనైన స్మరింపరు. కొన్ని ప్రాంతములలో
కృష్ణాష్టమి నాడు ఉట్ల పండుగ యనియు ఉట్ల తిరునా
యనియు చేయుదురు. ఈ పద్ధతి ఆంధ్రదేశ మం దంతట
విరివిగా నున్నది. ఇది దాక్షిణాత్యులు కొందఱుచేయు
"లొట్లపండుగు" కన్న మేలే కాని "గుడ్డిలో మెల్లవంటిది"
శ్రీకృష్ణుడు నిందలకు పాలయినట్లు ఏ యితర మహాపు
షుడును గాలేదన వచ్చును. ఇట్లు నిందించినవారు వారి
మ భక్తులే. భక్తికొఱకై యాపరమ పురుషునిచే చిన్న
మున దొంగతనము చేయించినారు. వయసున వ్యభిచారము
చేయించినారు. ఇట్లు వర్ణించుటచేత శూద్రాది జనులలో శ్రీ
కృష్ణుని గౌరవము తగ్గుచు వచ్చెను. శుకసప్తతి కారుడో
గొల్లనిచే నిట్లు చెప్పించినాడు.

సీ॥ మేరలెంచకయూరి వారిండ్ల కేగి పా
ల్పెరుగు వెన్నలు ప్రుచ్చిలించెననుచు

నీరాడుతేటి నాడు వారికట్టినపాత
లెత్తుకపోయి చెట్టెక్కెననుచు
బ్రతుకు భాగ్యముక్రింద బడగ బాపనయిండ్ల
కరిగియాకటికి కూడడిగెననుచు
కడపట చుట్టాల గరితలపైటలో
జెయివేసి యేమేమొ చేసెననుచు

తే॥ గీ॥ వ్రాసికొన్నారు బాపన బైసిగాండ్రు
కొలముసామి విచారించు కోకయిట్లు
చేయునేయంచు బెద్దలచేతవినడు
కృష్ణకథలందు నిటువంటి వెల్లవినుచు.

ఇప్పుడు సూచించిన దేమనగ శ్రీకృష్ణుడు పాలు నేయి, వెన్న మజ్జిగ, పెరుగు నట్లలో బెట్టినవి చిన్నతనమున దొంగలించు చుండెనని వ్రాసిన కారణముచేత నిప్పుడా దొంగతనమును నాతని జీవితములో బ్రాముఖ్యమైనదిగా నెంచి యుట్లపండుగను నూరూరఁ జేయుచున్నారు. దక్షిణ దేశమందుఁ గొన్ని స్థలములందు శ్రీకృష్ణ జయంతి నాడు రాత్రి కాలమందు కొందఱు భక్తులు దంపతులుగా సంకేతిత దేవతాయతనములందుఁ జేరి లొట్టకొలది తాగి యారాత్రి కంచుక క్రీడను చేయుదురట. ఈ విషయమును గురించియే యొకరు కృష్ణా పత్రికలో ౧౯౧౧ లోనో ౧౯౧౨

లోనో "విగ్రహారాధనము" అను శీర్షికతో నీ కంచుక క్రీ
డను వర్ణించి యుండిరి. యీ క్రీడకు రవికయే ప్రధానము.
కాని చావి వరుసలైనను తుదకు పరిధానములు కావు. దీని
ప్రమాణము,

శ్లో॥ మాతృయోనిం పరిత్యజ్య విహరేత్ సర్వయోనిషు॥

అని తప్పుడు శాస్త్రము వ్రాసినారు. ఈ హేయ
మును గుఱించి యింతకన్న నెక్కుడుగ వ్రాయనొల్లను. కా
వున లొట్ల పండుగ కన్న నుట్లపండుగయే మేలని చెప్పితి.

ఇప్పుడిప్పుడు శ్రీకృష్ణుని నిజమగు గొప్పతనమును కొం
దఱు పండితులు చాటుచున్నారు. ఈనిజతత్వమును నెఱుగ
గోరువారు తప్పక యీక్రింది గ్రంథములను జదువఁగలరు.

౧. లాలా లజపతిరాయి గారి శ్రీకృష్ణుని జీవిత
చారిత్రము.

౨. బంకిమ చంద్ర చటర్జీగారి శ్రీకృష్ణుని చరిత్రము.

ఈ గ్రంథములు తెలుఁగులో నున్నవి. ఇవి గాక యిం
కను ననేక కృష్ణ చరిత్రలు సర్వభాషలందు బయలు దేరినవి

ఈ సందర్భమున శ్రీకృష్ణుని రూప మెట్లుండెనో విచా
రించుట యప్రస్తుతముగా నుండనేరదని పరిశోధకుల వినోదా
ర్థము నాయభిప్రాయమును బ్రకటించు చున్నాడను.

## శ్రీకృష్ణుని రూపము

శ్రీకృష్ణుని ఫోటో గాని ప్రాచీన చిత్రము గాని మనకు దొరికి యుండిన మన మెందఱము నెంత యాశ్చర్యపడి యుందుమో యేమో! కాని మన యీ భూమండలమున మనము మనకు దోచినట్లుగా శ్రీకృష్ణుని చిత్రించుటను దేవలోక మందలి దివ్యవిగ్రహములు చూచి యేమనుకొను చున్నారో పాపము!

నా యభిప్రాయమున ప్రాచీనము నుండి నేటివఱకును సిద్ధముచేయ బడుచుండిన శ్రీకృష్ణ విగ్రహములున్ను, శ్రీకృష్ణ పటములును సరియైనవి కావు. శ్రీకృష్ణుడను మహానుభావుడొక కాలమందుండి నదియు, నాకాలమున నాతడు లోకోత్తరపురుషునిగా భావింపఁబడి తుద కవతారములలో నెన్నికగని ప్రపంచ స్వరూపము మార్చిపోయిన మాట నిర్వివాదాంశము. అట్టి శ్రీకృష్ణుఁడెట్టి స్వరూపము కలవాఁడుగా నుండెనో చర్చించుట యీ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశము. సాధారణముగా శ్రీకృష్ణుఁడు నీలవర్ణుఁడుగను, సుందరాకారుఁడుగను, మీసములులేని యౌవ్వనుఁడుగను, స్త్రీలోలుఁడుగను, లేక సదా మురళీ గానలోలుఁడుగను, నెమలి పింఛపు తుఱ్ఱాకల కిరీటధారిగను, చిత్రింపబడు చున్నాఁడు. ఈ స్వరూపమును విశేషముగా ప్రచారమునకు దెచ్చి యుపచార

ము చేసిన వారిలో మొదటివాఁడు రాజారవి వర్మ. "అ
నైపనీయమానో యథాంధః" యన్నట్లు తర్వాతి వార
ును నీతఁడేర్పాటు చేసిన గుఃలలోనే తట్టుక పడుచువ
రి. తుదకు విశేషముగా బాగడ్తగన్నట్టి బెంగాలీ చిత్ర
రులు సహితము కొంచెము కండ్లలో వైశాల్యము, మాం
ము చూపించుటతప్ప వేరేమియు గుర్తింప దగిన మార్పు
చేయలేదు.

శ్రీకృష్ణుని యొక్క స్వరూప మిదిసరియైనది కా
నా నమ్మకము. అయితే శ్రీకృష్ణుని నేను నేదివ్యజ్ఞాన మూ
కముగా జూచిన నాడనుగాను. కాని మన పురాణ గాథలు
బట్టి యిదమిద్ధమ్మని నిర్ణయించుటకు గొంత వీలుగల
నామనవి.

మొట్టమొదలు శ్రీకృష్ణుడు నీలవర్ణుడు కాఁడు. ఈ
గు ప్రకృతివిరుద్ధము. ప్రపంచములో నెవ్వఁడను నీలం
పుట్టినట్లు మనమెచ్చటను వినలేదు. ఒకవేళ మహాపురుష
గాని లేక అవతారపురుషులుగాని నిట్లుందురని చెప్పవచ్చు
కాని యిట్లుందురనియెందును ప్రమాణములులేవు. కా
శ్రీకృష్ణుడు నలుపువర్ణము వాడని నిశ్చయించుట సమం
ము. "శ్రీకృష్ణ" పదమున కీయర్థమేకలదు కాని నీలిమ
వి యర్థములేదు. ఇది మొదటిపొరపాటు.

రెండవది సాధారణముగా శ్రీకృష్ణుడు సుకుమారగా
త్రుడుగా నిరూపింపబడుచున్నాడు. కొన్నిపటములలో నీతఁడు
స్త్రీయో, పురుషుఁడో యని నేటి క్రాపుచేసికొనిన పాశ్చాత్యస్త్రీ
లవలె గుర్తింప శక్యముకానివాడై యున్నాడు. శ్రీకృష్ణునకు
ముక్కుపై నొక ముత్తెపు "బులాకి" ని బెట్టి లావై నట్టియు కండ
కలిగినట్టియు చెంపలుపెట్టి యా మోముపై యొకపిల్లన గ్రోలి
ని బట్టించి దొఱకినన్ని ముత్యాలహారములను శిరసుపై కంఠ
ములో ధరింపజేసి స్త్రీత్వ మాపాదింప జేయుచున్నారు. ఇది
సరియైనదికాదు. శ్రీకృష్ణుడు బాల్యమందు గొల్లలలో బయ
లులో తిరిగి బెదిగినవాడు. నూనూగుమీసాలనాడు మంచి జెట్టీ
లతో బోరికర్కశకాయుడై నవాడు. పరిపూర్ణవయః పరిపాక
మునాడు నానారాజులతో యుద్ధముచేసి వారిని నిర్జించి య
సామాన్యుడని యనిపించికొనినాడు. ఇట్టివాడు "నాజూకు"
జనుడుగా నేటిమహారాజులవలె లీలగా కత్తిబట్టినవాడుగా
నుండియుండడు.

శ్రీకృష్ణమూర్తి స్త్రీలోలుడని భావింపబడుచున్నాడు.
ఇతనికన్న మించిన నిగ్రహశక్తి సంపన్నుడును, జితేంద్రియు
డును మఱియొకఁడు లేఁడు. "రంగీలా" రాజు ఎన్నటికిని భగ
వద్గీతను బోధింపజాలడు. కావున చీటికి మాటికిని శ్రీకృష్ణు
ని యందు స్త్రీలను నిలిపి పటము లు వ్రాయుటతప్పు.

"అయితే యిక శ్రీకృష్ణుఁ డెట్టివాఁడయ్యా" స్వ
ప్నము చూచెదముగాక" యని నావిమర్శకులందురు. వి
చుచున్నాను; చిత్తగించుఁడు.

శ్రీకృష్ణుఁ డాజానుబాహుఁడు. అవతార పురు
లక్షణములలో నిదియొక ముఖ్యలక్షణమైయున్నది. కా
నీతఁడుపొట్టివాఁడుగాక యెత్తైన విగ్రహమై యుండియు
ను. ఇతఁడు నల్లనివాఁడని ముందే నివేదించితిని. యా
మున్నగు నొత్తరాహులు జానుబాహులనియు, య
లందు ముందు పఙ్త్తిలో నుచఁదగిన వారనియు భారత
వర్ణింపఁబడి యున్నారు.

ఇతఁడు మీసములు కలవాఁడుగా నుండియు
శ్రీకృష్ణునికి మీసములనేలయో చిత్రకారులందఱును గొ
గివేసినారు. ఇది చాలదౌర్జన్యము. ఈచిత్రకారులు శ్రీ
ని బావమఱఁదులగు పాండవులకు బుష్టిగా లోపము
నట్లుగా మీసములుంచియున్నారు. శ్రీకృష్ణుడే యవ
ము జేయనప్పుడిట్లు శిక్షించుటన్యాయముకాదు. అయి
ప్రాచీనకాల మందార్యులలో మీసములుంచు వాడుక
లేదని వాదింపవచ్చును. అట్లైన పాండవులకును నుండ
దు. ఇంతియకాక ప్రాచీనమందు మీసములు చాలగౌర
నము వహించియుండెనని మనుస్మృతిలోని శిక్షావిధా

సూచించుచున్నది. ఉత్తమస్త్రీల మానభంగ మొనరించిన వాని మీసములను గార్దభమూత్రముచే దడిపి గొఱిగవలసిన దిగా మనువాజ్ఞాపించుచున్నాడు. కావున నింతవఱకును వ్రాసిన దానివలన శ్రీకృష్ణుడట్టైన వాడుగను నల్లనివాడు గను, కర్కశ శరీరుడుగను, మీసములు కలవాడుగను, నేర్పడెను.

ఇంకొక్క యంశము విమర్శనీయమైయున్నది. శ్రీకృష్ణుడే పటమందు చూచినను "30 యేండ్లలోపలి" "యువక సంఘసభ్యుడు" గా గనబడుచున్నాడు. భగవద్గీతలలోని ముఖపటములందు శ్రీకృష్ణుడు కోచివాడుగా చిత్రింపబడిన పటములు ముఖ్యముగా గమనింప దగినది. అందును శ్రీకృష్ణుడు ౩౦యేండ్ల వాడుగా గోచరించును. కాని యివన్నియు సరిగావు. శ్రీకృష్ణుడు భగవద్గీతా భోధనా కాలము నాటికి ౮౯ యేండ్ల వృద్ధుడు. హరివంశమందును, విష్ణుపురాణ మందును, శ్రీకృష్ణుడు ౧౨౫ యేండ్లు జీవించెనని వర్ణింపబడినది. ఇది సంశయించుటకు వీలులేదు. భారతమందును పాండవుల వయస్సు ౧౧౦ యేండ్లకు పైగానుండినట్లు కాలని ర్ణయ నిదర్శనములు కలవు. పాండవులలో ధర్మరాజుతప్ప తక్కినవారికన్న శ్రీకృష్ణుడు పెద్దవాడు. కావున శ్రీకృష్ణుని యాయుర్దాయము ౧౨౫ యేండ్లు నిశ్చయమైనందున నాతడు యుద్ధము ప్రారంభము నాడు (అనగా భగవద్గీత

బోధచేసిననాడు) ఎంతవయస్సువాడని నిర్ణయించుట సులభ
ము. యుద్ధము ముగిసిన వెంటనే గాంధారి తననూర్గురు
పుత్రుల కళేబరములను జూచి నిర్భర విషాద యుక్తయై
శ్రీకృష్ణుని జూచి యిట్లనెను. "కృష్ణా! ఇదంతయు నీమూల
ముననే జరిగినది. కావున నీవు నేటికి ౩౬ సంవత్సరము
లనంతరము దిక్కులేని వాడవై చత్తువుగాక. ఈ శాపము
వలన శ్రీకృష్ణుడు భారత యుద్ధమునాటికి ౭౫ ఏండ్ల వృద్ధు
డైనదమయ్యెను. ఈవార్ధక్య చిహ్నము లేశము నందును
నేను గాంచలేదు.

శ్రీకృష్ణుని వయస్సునుగురించి ఛాందోగ్యోపనిషత్తు
నుండి కొంతవరకు నిర్ణయింపవచ్చును. ఛాందోగ్యోపనిషత్తు
లో శ్రీకృష్ణుని చర్చయుండుటచే శ్రీకృష్ణుడు చాల ప్రాచీ
కాలమందే అనగా వేదకాలమందే సుప్రసిద్ధుడనియు విశద
మగును. మం॥ తద్ధైతద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా
యోక్త్వో వాచాపిపాస ఏవసబభూవ సోంతవే లాయామేతత్త్రి
యంప్రతి పద్యేతాక్షి తమస్యచ్యుతమసి ప్రాణసంశితమసీ
తత్త్రైతేద్వే ఋచౌభవతః॥

దీని యర్థమేమన "ప్రసిద్ధుడగు యజ్ఞ విజ్ఞానమునే
ఆంగిరస గోత్రుడైన ఘోరుడు అను ఋషి కృష్ణు
న కుపదేశముచేసి యా యుపాసనాంగముగా, స్థూలశరీరము
యొక్క అంత్యకాలమందు మూడు మంత్రములను జపముచే
యవలసిన దని చెప్పెను." పై మంత్రము తృతీయప్రపాఠక

మందు ౧౭ వ ఖండములో ౬ వ మంత్రముగానున్నది. ఈ మంత్రమందలి కృష్ణుశంకెవ్వారైన వేరు కృష్ణుఖండవచ్చునని చెప్పుటకు వీలులేదు. ఏలయన నితను దేవకీపుత్రుడని వర్ణింపబడియున్నాడు. అయితే మనప్రకృతాంశమునకు సంబధించి నదేమన నీపురుషయజ్ఞమంత్రమును పఠించునాతడు ౧౧౬ ఏండ్లు సంపూర్ణవయస్కుడై యుండునని పై యుపనిషత్తులోని ౧౬ వ ఖండములోని మంత్రములు బోధించుచున్నవి. పై ఖండములో ౭ వ మంత్రమిట్లు చెప్పుచున్నది.

మం॥ ఏతద్ధస్మవై తద్విద్వానాహమహీదాస ఐతరేయస్స కింమ ఏతదుపతపసి యోహమనేన నప్రేష్యామీతిస్సహ షోడశంవర్ష శతమ జీవత్ప్రహషోడశం వర్ష శతంజీవతియ ఏవంవేద॥

దీని భావమేమన నేపురుషుడైనను పురుషయజ్ఞమును పాసించిన నతడు రోగాదివిముక్తుడై ౧౧౬ వర్షములు జీవించి పూర్ణాయువునొందును. కావున శ్రీకృష్ణుడుపై మంత్రమున శక్తుడై బోధింపబడిన వాడన నతడు ౧౧౬ వర్షలో లేకయంతకన్న నెక్కుడు కాలమువఱకో జీవించినవాడని యుందుకు నాకాలమున దెలిసినవిషయముగా నుండినందున ఉపనిషత్తులో నుదాహృతుండయ్యెననుటలో సందేహము వేదు.

ఇదే తృతీయ ప్రపాఠకములోని ౧౬ వ ఖండమందలి యింకొక మంత్రము గమనింపదగినది.

మం॥ అథయ త్తపోదాన మార్జవమహింసా సత్య
మితితా అస్యదక్షిణా॥

అనగా పురుషయజ్ఞమున కందులను నక్షాలుగా
ఎవ్వరు తపస్సంపన్నులో, దానపరులో, ఇంద్రియ నిగ్ర
లో, అహింసాతత్పరులో, సత్యవంతులో, వారే యారు
జ్ఞమున కర్తృలని పై మంత్రము బోధించుచున్నది. ఇందు
లమున శ్రీకృష్ణుడు పురుషయజ్ఞమున కర్తృడయ్యెనని నే
డు "తపోదానమార్జవ మహింసాసత్యవచన" ము
ప్రఖ్యాతివహించిన వాడని వేదప్రమాణము సిద్ధాంతీక
టచే దద్విరుద్ధముగా వచించు పురాణములన్నియు శుద్ధ
ములే యగును. కావున పై ప్రమాణములచేత శ్రీకృష్ణ
౧౧౬ ఏండ్లకన్న హెచ్చుకాలము జీవించినవాడని నో
మయ్యెను.

ఇది నాకుదోచిన శ్రీకృష్ణస్వరూపము. ఇకని
శిరోవేష్టనము కలిగియుండెనో యెట్టిబట్టలు ధరించియుం
విచారింతము. సాధారణముగా మనచిత్రకారులు శ్రీకృష్ణ
వైదికవు ధోవతి పింజకట్టుసు చెంచువారివలె నెత్తిన నె
పింఛపు శతగోపురమును నుంచుదురు. ఇది సరియైనదో
నేను చెప్పజాలను. కాని అజంటా ఎల్లోరా గుహల

హిందూ దేవతల విగ్రహముల అలంకారములను పరీక్షిం చుట (study) మంచిది. ఆచిత్రములు ౨౦౦౦ యేండ్ల క్రిం దటి వగుటచే యించుమించు భారత కాలమునకు సరిపోవు నట్టివని నాయూహ!

ఈప్రకారముగా నెవ్వరైన శ్రీకృష్ణుని పటముచేయుచో వారుచేసిన బాగుండునని నాయభిప్రాయము. ఈ నాయభిప్రా యములు యుక్తముగా గనబడిన నేచిత్రకారుడైనను నేనుజూపినటి శ్రీకృష్ణుని సిద్ధముచేయ ప్రార్థించుచున్నాను. నాటకము లాడువారును రవివర్మాది చిత్రకారుల ననుసరించి యే త. శ్రీకృష్ణులకు వేషములు తీర్చుదురు. వారును నాట క సాంప్రదాయమును నగలుకొందురని నమ్ముచున్నాను. శ్రీ కృష్ణుని సంబంధమగు నితర విషయములను భీష్మైకాదశీ వ్రత ము: జూడగలరు.

(Note:-నేనీ వ్యాసము వ్రాసిన తర్వాత శ్రీయుత కే.రామా చారి గారొక పటమును సిద్ధముచేసినారు. ఇందది ముద్రింపఁ బడినది. వారి సహాయమునకు నేనత్యంత కృతజ్ఞుడను.)



# హనుమజ్జయంతి



హనుమజ్జయంతిని ప్రతి చైత్ర పౌర్ణిమా సమున జరుపుదురు. హనుమంతు వానర జాతిలోఁ జేరినవాఁడు. ఇతని తల్లిపేరు అంజన ఈమె పూర్వజన్మమందు పుంజికస్థల యనుపేరఁ బరగు యప్సరయై యుండెను. శాప ఫలితముగా వానరాంగన జన్మించి కేశరియను వానరుని బెండ్లాడెను. ఒకనాఁడు గతిచే యామె వలువలు జారి వలుద గుబ్బలు బయ వాయు దేవునికి మనస్సు చెదిరి యామెను గట్టిగా గౌగి కొని యామె తోడి సంబంధ ఫలితముగా నామెకొక గ డును బ్రసాదించెను. ఆమె కొడుకునే ఆంజనేయుఁడని తురు. ఇతఁడు కేసరికి క్షేత్రజుఁడుగను వాయువునకు డుగను నేర్పడెను. ఇతని నొక గుహలోఁగని యచటనే పెంచుచుండ నొకనాఁడీతఁడు సూర్యబింబమును జూచి మును నాకటఁచే దానిఁ గబళింపఁబోయెను. అప్పుడింద్రు తన వజ్రాయుధముచే నీతని గొట్టెను. నాటినుండి హను తుఁడను పేరు గలిగెను. కొడుకును గొట్టినది వాయువు

తాను ప్రపంచములో సంచరించుట మానకొనగా నఖిల భూతములు దేవతల సమేతముగా నార్వదించెను. అప్పుడు బ్రహ్మ హనుమంతునికిఁ జిరంజీవత్వమును బ్రసాదించి వాయువు కుందుమాన్పెను.

హనుమంతుఁడు పెద్దవాఁడై సంస్కృతాద్యనేక విద్యల నేర్చెను. సీతతో మాట్లాడునప్పుడు మనుజ భాషను మాట్లాడెను. ఇతఁడు నిత్య బ్రహ్మచారిగా నుండెను. పెద్దవాఁడైన తర్వాత సుగ్రీవు నాశ్రయించి యతనికి మంత్రియైయుండి రాముని సుగ్రీవునికి సంధి కుదిర్చి వాలిఁ జంపించి, పిమ్మట సీతాన్వేషియై సీతఁజూచి లంక గాల్చి రామునికి వార్త దెలిపి యుద్ధమందు బవసత్త్వముల జూపి సంజీవ పర్వతమునే దెచ్చి యిచ్చి లక్ష్మణు మూర్ఛ దెలిపి శ్రీరామునికి సమ్మాన బంధుఁడై జీవనమ్ము గడపిన మహానుభావుఁడు. ప్రపంచములో శ్రీరాముల వంటి యజమాని పుట్టలేదు. హనుమంతుని వంటి సేవకుఁడు పుట్టఁబోడు.

## విమర్శ

ఈ హనుమజ్జయంతి మధ్వులకుఁ ముఖ్యమగు పండుగ. వానర జాతి యేజాతియో పండితులు నిర్ణయించుటకు వీలు లేనివారై యున్నారు. కొందరు తోకలు కలిగిన మనుజులే యనియుఁ గొందఱు అడవి మనుష్యులనియుఁ దలచుచున్నారు. ఏది యెట్లున్నను హనుమంతుఁ డాదర్శపురుషుఁడు అనుకరణీయుండు పూజ్యుఁడు.



# భీష్మైకాదశి; (భీష్మాష్టమి)



భీష్ముఁడు భారతవీరుఁడని యెందఱికో తెలియును. ఇతని జీవితము చాలగంభీరమైనది. ఇతఁడు శంతనునికిని గంగాదేవికిని బుట్టినవాఁడు. ఈయన తల్లిదండ్రుల వివాహమును గుఱించియు నితని బాల్యమును గుఱించి తర్వాత యితఁడు తండ్రికొఱకై సత్యవతిని తెచ్చి పెండ్లిచేయుటయు నాసందర్భమున తాను రాజ్యపదవిని వదలుకొనుటయు, నిత్యబ్రహ్మచారిగా నుండుటకై ప్రతిన బూనుటయు నీమున్నగు కథలనన్నింటిని భారతమందు జూడనగును. సత్యవతివలన నీతనితండ్రికి విచిత్రవీర్యుఁ డుద్భవించెను. అతనికి అంబ అంబాలికలను కన్యలను రాక్షసముగా దెచ్చి పెండ్లిచేసెను. కాని విచిత్రవీర్యుం డనపత్యుఁడై గతించెను. అతనిభార్యలను వ్యాసుడుపొంది పాండుధృతరాష్ట్రుల బుట్టించు కథనుగూడ భారతమందుఁ జూడనగును.

ఇచ్చట మనము కేవలము భీష్మసంబంధమగు వ్రతములను గుఱించియే చర్చింతము. భీష్మైకాదశీ వ్రతము

యొకటి కలదు. కార్తీక శు॥ ౧౧ నాఁడు భీష్ముఁడు పది దివస ములు యుద్ధముచేసి యంపశయ్యపై పడిపోయెను. ఆ సందర్భపు జ్ఞాపకార్థమై యీ యేకాదశి వ్రతమాచరింపఁ బడు చున్నది.

కార్తీకైకాదశినాఁడు భీష్ముఁడంపశయ్యపై బడినాడని యు, మాఘ శుద్ధాష్టమినాడు చనిపోయి నాడనియు వ్రత గ్రంథములు వ్రాయుచున్నవి. మాఘ శుద్ధాష్టమినాడు చని పోయినట్లు భారతమందు సరియగు ప్రమాణము లున్నవి. కాని యతడంపశయ్యపై బడినది మార్గశిర శుద్ధైకాదశియే- కార్తీక శుద్ధైకాదశి కాదని విజయ దశమీ యను పండుగ వివరములలో వ్రాసినాడను అందుఁ జూడనగును.

భీష్ముఁడు తర్వాత ఉత్తరాయణము వచ్చినప్పుడు మృతించెను. ఉత్తరాయణము మాఘ శుద్ధ ౮ దివసమున వచ్చెనని కొన్ని ప్రమాణములు కలవు. నిర్ణయ సింధువులో ను ధర్మసింధువులోను మాఘ శుద్ధ ౮ దివసమున భీష్మునికిఁ దిలాంజలి విడచి పూజింప వలెనని నిర్దేశింపఁ బడినది. ధర్మ సింధుకారుఁడిట్లు వ్రాయుచున్నాఁడు.

"మాఘశుక్లాష్టమీ భీష్మాష్టమీ అస్యాంభీష్మోద్దే శేన యేశ్రాద్ధం కుర్వంతి తే సంతతిమంతోభవంతి. తత్రశ్లో

ద్ధకామ్యం తర్పణంతునిత్యం తర్పణేకృతే సంవత్సరో పా
దురితనాశః అకృతేపుణ్యనాశః—తత్రతర్పణమంత్రః।

శ్లో॥ వైయాఘ్రపదగోత్రాయ సాంకృత్య ప్రవరాయచ
గంగాపుత్రభీష్మాయ ఆజన్మబ్రహ్మచారిణే॥

ఈ పైశ్లోకము వలన భీష్ముని గోత్ర ప్రవరము
తెలియ వచ్చెడి. భీష్మాష్టమినాడు భీష్మునికి శ్రాద్ధకర్మ
చేయువారికి సంతానాభివృద్ధి కలుగుననియు, పుణ్యము క
లుగుననియు, చేయనివారికి పుణ్యనాశ మగుననియు పైప్రమా
ణముల వలన విశదమగును.

ఇట్లు భీష్మైకాదశియు, భీష్మాష్టమియుఁ బుణ్య ది
ములై యున్నవి. భారత వీరులలో నెవ్వరెవ్వ రేతిథులంద
బుట్టిరో సరిగాఁ జెప్పుట కష్టమైనను భీష్ముని యొంభవ
దినమును, మరణ దివసమును నిశ్చితములై యున్నవి. ఆ
యన యెప్పుడు పుట్టెనో యెంతకాలము జీవించెనో య
వివరములు సరిగాఁ గానపడవు. అయినను గొన్ని గ్రంథ
ములచే నతని వయస్సించు మించుగా నెంతయుండెనో
తెలియుచున్నది. భారతమందు శ్రీకృష్ణుని యొక్కయు పాండవుల
యొక్కయు వయస్సు మనకించుమించు సరిగా గుఱుతు ప
డుచున్నది. శ్రీకృష్ణుఁడు ౧౨౫ సంవత్సరములు జీవించె
భాగవత పురాణ ప్రమాణముల వలనఁ దెలియ వచ్చెడి

భాగవతము :దిట్లున్నది:—

బ్రహ్మోవాచ

శ్లో॥ యదోర్వంశే వతీర్ణస్య భవతః పురుషోత్తమ ।
శరచ్ఛతంవ్యతీతాయ పంచవింశాధికంవిభో ॥

ఈ శ్లోకమును పోతనామాత్యుఁడిట్లు తెనిగించి-
నాడు: —

గీ॥ అఖిలలోకేశ! సర్వేశ! యభవ! నీవు ।
నుదయమొందుట భూభార ముడుపు కొఱకు ।
పంచవింశోత్తర శతాబ్దపరిమితంబు ।
నయ్యెవిచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు ॥

(ఏకాదశస్కంధము)

మఱియు భారతమందంతటను శ్రీకృష్ణుఁడు ధర్మరాజు-
నకు నమస్కారము చేయుటయు భీమునాలింగనము చేయు-
టయు, నరుని నాశీర్వదించుటయు వర్ణింపఁ బడినది. అనగా
ధర్మరాజు శ్రీకృష్ణునికన్న పెద్దవాఁడు. భీముడు సమానీ-
డు. అర్జునుఁడు చిన్నవాడని దీని యభిప్రాయము. ధర్మ
రాజుకన్న భీమార్జును లొక్కొక్క సంవత్సరము చిన్నవారు
గావున ధర్మరాజు వయస్సు ౧౨౬ సంవత్సరములున్నూ.

భీముని వయస్సు ౧౩౫ సం॥ లున్ను, అర్జుని వయస్సు ౧౩
అనియు నిర్ణయము చేయవలసి వచ్చును. ఈ యూహ
భారత ప్రమాణముల చేతనే సమర్థించెదను.

ధర్మరాజు శతశృంగమునుండి వచ్చినప్పుడు ౧
వయస్సీ క్రింది వాక్యము వలన తేటపడును.

"యుధిష్ఠిర భీమార్జునయములు గర్భమంబున షో
పంచదశ చతుర్దశ త్రయోదశ వర్షజాతులై శతశృంగంబు
వచ్చి యందుఁ గౌరవులంగలసి యస్త్రవిద్యలం గఱ
పదమూడేండ్లుండి యపుడు ధృతరాష్ట్రు నియోగంబున
ణా వతంబునకు జననీ సహితంబుగఁ బోవనమకట్టిరి."
వలన ధర్మరాజు వారణావతమునకుఁ బోయిన కాలము
౨౯ సంవత్సరముల వాఁడని బోధపడును. వారణా
ములో

క॥ ధనధాన్యములను బ్రియభో ।
జనదానములను విశిష్ట సద్ద్విజతతులన్ ।
దనుపుచునుండగఁ దత్పుర ।
మున షణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్.

అనగా లక్కయిల్లు కాలువరకు ధర్మరాజు
సంవత్సరముల వాఁడు. వారణావతమునుండి పాండవులు
పాంత్రునొద్దికి వచ్చి యతనిదగ్గఱ

"అనేక ధర్మశాస్త్ర నీతిశాస్త్రంబు లభ్యసించి యమ్మునిని వీడ్కొని చని విదర్భ మత్స్యత్రిగర్త కీచక విషయంబులు గడచి యేకచక్ర పురంబును గనిరి" ఇట్లు ఏకచక్ర పురమందు కొంతకాలముండి బకాసురునిజంపి పాంచాల దేశమునకుఁబోయి ద్రౌపదిని వివాహ మాడిరి. అనేక ధర్మ నీతి శాస్త్రము లభ్యసించి నానా దేశములందు సంచారము లు చేయుట వీరికి ౧౦ సంవత్సరము లైన పట్టియుండును. కావున ద్రౌపదీ వివాహము నాటికి ధర్మరాజునకు ౩౯ సంవత్సరముల వయస్సుండును. వివాహానంతరము పాండవులు మామ యింటిలో "ఒక్క సంవత్సరం బుండిరి" అని యున్నది. అనగా ౪౦ సం॥ ముల వయస్సు అయ్యెను. తర్వాత ధృతరాష్ట్రుఁడు వీరిని బిలిపించు కొనెను. పాండవులు "దుర్యోధనాదులతోఁ గలసి యెప్పటియట్లు రాజ్య వినోదంబుల నేను సంవత్సరము లుండునంత" ధృతరాష్ట్రుడు వారిని ఇంద్రప్రస్థ పురమున కంపెను. అనగా నిప్పటికి ధర్మరాజునకు ౪౫ సంవత్సరములు తర్వాత వీరు జూదమందోడి పోయిరి. "ఇట్లింద్ర ప్రస్థపురంబున నిరువదిమూడేండ్లుండి పాండవులు పాపద్యూత పరాజితులైరి." అని సభా పర్వాంతములో నున్నది. కావున ధర్మరాజు అరణ్యమునకు పోవువరకు ౬౮ యేండ్ల వాఁడని తెలిసెను. అరణ్యాజ్ఞాత వాసములు ౧౩ యేండ్లు కలిపిన ధర్మ

రాజు యుద్ధప్రారంభ కాలము నాటికి ౮౧ సంవత్సరము
వాఁడు. యుద్ధాంతమందు గాంధారి శ్రీకృష్ణునికి శా
మిచ్చెను. ఇంక ౩౬ యేండ్లకు శ్రీకృష్ణుఁడు దిక్కులే
చావు చచ్చునని శాపించెను. కావున పాండవులు శ్రీకృష్ణు
డు చచ్చిన వెంటనే చచ్చినవారు గావున వీరును ౩౬ ఏండ్లు
యుద్ధానంతర ముండిరని విశదమగును. అప్పటికి ధర్మరా
నకు ౧౧౭ సంవత్సరముల వయస్సుండును. అనగా మనము
పైన సూచించిన ౧౨౬ యేండ్లకు ఈ నిర్ణయము ౯ ఏండ్ల
వ్యత్యాసము కలదియై యున్నది. శాలిహోత్రునొద్ద చే
వినకాలము అందాజా వేసినారము. మఱియు ఏకచక్ర పు
ములోనున్న కాలము యుద్ధమునకు సంసిద్ధులగుటకై నల
మందు చేర్పలేదు. కావున నించుమించు ధర్మరాజు ౧౨
సం॥ముల వయస్సువాఁడని తేలెను. శ్రీకృష్ణ జయంతిలో
వ్రాయుచు ఛాందోగ్యోపనిషత్తులో శ్రీకృష్ణుఁడు ౧౧౬
ఏండ్లు జీవించినట్లు నిదర్శనముల చూపినాడను. ఇందు భార
ప్రమాణములను బట్టిచూపిన విషయముల వలన ధర్మరా
౧౧౭ ఏండ్లవాడని తేలుటచే శ్రీకృష్ణుఁడు సరిగా ౧౧౬ ఏండ్ల
వాడని పైఉపనిషత్తు ప్రమాణము ప్రబలమగుచున్నది. ఎట్ల
లైనను శ్రీకృష్ణుఁడు ౧౧౬ ఏండ్లకు తక్కువకాకను ౧౨౦
ఏండ్లకు హెచ్చుకాకను జీవించి యుండెనని ప్రాచీన ప్రమా
ణముల సారాంశమై యున్నది.

ఇఁక మనము భీష్ముని కాలము నిర్ణయింప వలెను. భీష్ముఁడు ధర్మరాజునకు ౮౧ సంవత్సరముల వయస్సుండి నప్పుడు—యుద్ధకాలమందు—మృతించెను. భీష్ముఁడు ధర్మరాజుతాత. ధర్మరాజు ౪౦ వ సంవత్సరమున వివాహమాడెను. ఈ కాలమువలె బాల్యవివాహములు కాక యాకాలమందు క్షత్రియులు కనిష్టము ౩౦ సంవత్సరముల వయస్సు వచ్చినప్పుడే వివాహ మాడెడివారు. ఏలయన నాకాలములో స్వయంవరములందు కన్యచేవరింపఁబడని క్షత్రియులు వరించిన వానిపై యుద్ధము చేసెడివారు. అట్టిచో ౨౦ యేండ్ల పిల్లవాని కేమియస్త్రవిద్యయుండును? ఎట్టి పాటవముండును. కావున పాండురాజు కుంతిని తన ముప్పదియవ యేట వివాహమాడెనని నిర్ణయించిన కొంతకాలము శాపమనుభవించి నియోగముచే కుంతీదేవియందు పుత్రులను గాంచెను. అనగా ధర్మరాజు పుట్టువరకు పాండురాజు ౪౦ యేండ్లవాఁడుగా నుండియుండును. పాండురాజు తండ్రి విచిత్రవీర్యుడు. విచిత్రవీర్యుఁడు పుట్టకముందే భీష్ముడు పుట్టియుండెను. అతఁడు బ్రహ్మచారిగా నుండు ప్రతిజ్ఞనుబూని రాజ్యమున కర్హతను వదలుకొను నప్పటికి ౨౦ సంవత్సరముల వాఁడుగా నుండియుండవలెను. అప్లు ౨౦ సంవత్సరముల యీడునాడు తన

తండ్రికి సత్యవతిని దెచ్చి పెండ్లిచేసెను. సత్యవతికి విచిత్ర
వీర్యుడు పుట్టెను. విచిత్ర వీర్యుఁడు మనము పైన వ్రాసి
సిద్ధాంతము ప్రకారము ౩౦ సంవత్సరముల యీడువాడు పె
ండ్లి చేసికొనియుండును. అతనికొఱకే భీష్ముఁడు బలిమిచే అం
యంబాలిక లను పడుచులఁ దెచ్చెను. కావున విచిత్రవీర్యు
పెండ్లినాటికి భీష్ముడు ౭౦ సంవత్సరముల వాఁడు. విచిత్ర
వీర్యుని భార్యలందు నియోగముచే పాండురాజును ధృతరా
ష్ట్రుఁడును బుట్టిరి. పాండురాజునకు ధర్మరాజు పుట్టువఱకు
౪౦ యేండ్ల వయస్సుండునని ముందే తెలిపియుంటిని. కావున
ధర్మరాజు పుట్టువరకు భీష్మునికి ౯౦ యేండ్ల వయస్సుండవ
వలెను. భారతయుద్ధమునాటికి ధర్మరాజునకు ౮౧ ఏండ్లు అని
చెప్పితిమికదా, కావున భీష్ముఁడు యుద్ధముచేసి చచ్చినప్పు
డు కనిష్ఠము ౧౭౦ ఏండ్లవాఁడని నిర్ణయించ వలసివచ్చును.

౧౭౦ ఏండ్లవఱకు సాధారణముగా ప్రపంచ మందెవ్వ
రును బ్రదుకరని యను మానింప నవసరములేదు. ఈ కాల
మందే జపాను, తుర్కీదేశములందు నొకరిద్దఱు ౧౬౦ యే
డ్లవా రున్నారని పత్రికలలోఁ జదువుచుందుము. అట్టిచో
ప్రాచీనకాలమందాయుః పరిణామము విశేషముగా నుండె
నట నమ్మదగినదే. మఱియు భీష్ముఁడు నిత్యబ్రహ్మచారి

మహాబలశాలి. కావున ౧౫౦ యేండ్లు బ్రదికినను బ్రదికి యుండవచ్చును.

ఇట్టిభీష్ముని నేలపూజింపవలెనో యని సంశయింపఁబనిలేదు. ఇతఁడాదర్శపురుషుఁడు. భాగవతమందు శ్రీకృష్ణుఁడీతనిఁగుఱించిచెప్పుచు నీతఁడుచనిపోయెనేని ప్రపంచమునకుగొప్పనష్టము కలుగునని యు, నీతనికి దెలిసినన్ని విషయములు మఱెవ్వరికిని దెలియవనియు స్తుతించెను. ఇట్లువయస్సునందునుసర్వజ్ఞత్వమందును నీతఁడు పరిపూర్ణుఁడు. ఇఁకగుణములందును నీతఁడు తక్కువవాఁడు కాఁడు. ముసలితండ్రియొక్క సుఖముకొఱకై వయస్సునందుండిన నీతఁడు రాజ్యసుఖములను వదలుకొనెను. మీఁదకు నిత్యబ్రహ్మచారిగా నుండునని వ్రతము పూనెను. కొంతకాలము తర్వాత యంబికను వివాహమాడుమని యతని గురువగు పరశురాముఁడు బోధించినను వినలేదు. ఈకారణముచే వారిద్దఱికి ౨౩ దివసములు యుద్ధముజరిగెను. పరశురాముఁడోడి పోయెను, ఇట్లు గురువుతో యుద్ధము చేయుటకు గూడ జంకలేదు. కాని తనప్రతిజ్ఞా భంగముమాత్రము గలుగకుండునట్లుగా గాపాడుకొనెను. ఇట్లతిలోకుఁడై గుణగణోత్తముఁడై వృద్ధుఁడై జ్ఞానఖనియై నిష్కళంకజీవనముగడిపి ప్రార్థించినట్టి పాండవులకుఁ దనను జంపునుపాయముచూపి తన ప్రాణములర్పించి మరలవారికే సమస్తనీతులు బోధించి "అపునరా

వృత్తిపదమున కేగిన" భీష్ముఁడు నిశ్చయముగా నాదర్శనీయుఁడు పూజ్యుఁడు. నిత్యస్మరణీయుఁడు.

ఈతనిపూజను బ్రాహ్మణులుచేయుదురు. జనసామాన్యమం దితని గుఱించిన పండుగ చేయరు.



# మహాలయ పక్షము.

---

ఇది భాద్రపద కృష్ణపక్షమందువచ్చును. ఈపక్షమందు హిందువులు తమతమ పితృదేవతలకుఁ దర్పణములు విడుతురు. ఈపక్షమందఖిల మృతజ్ఞాతులకు దర్పణములు విడుతురు. ఇది చాల ముఖ్యమైన దినములు. ఈదినములలోఁ దప్పక చచ్చినవారికి శ్రాద్ధకర్మలు చేయవలెను. ఇది సర్వవర్ణముల వారిచేఁ జేయఁబడును. బ్రాహ్మణులగువారు మంత్రపూర్వకముగాఁ దర్పణములువిడుతురు. బ్రాహ్మణేతరులలో విశేష సంఖ్యాకులు మంత్రములు లేకయే చేయుదురు.

బ్రాహ్మణేతరులు_అనగా శూద్రులు చేయుపద్ధతి నించుక విచారింతము. ఈభాద్రపదమాసములో మన యాంధ్రదేశమందు రెండు పండుగలను శూద్రులు ముఖ్యముగా జేయుదురు. ఒకటి "మాల పున్నమ" రెండవది "పెద్దల అమాస". దీనినే నోరుతిరుగక "పెతర్ల అమాస" అనియు, పెతాళ అమాసయనియు పెత్తాళ అమావాస్యయనియు నపభ్రంశముగా నుచ్చరింతురు. ఇందు రెండవది పేరుచేతనే పితృదేవతల సంబంధము కలదని విశదమగును. భాద్రపద కృష్ణ ప్రతిపత్తునుండి యమావాస్యవఱకెప్పుడైన బితృకర్మలు చేయవచ్చును. గాన శూద్రులీ కడపటి దివసమునఁ జేయు

దురు. ఆనాడు కొందరు మాంసముతోను, కొందరు భక్ష్యములతోను బండుగఁ జేసికొందురు.

ఇక మాలపున్నమ యన నేమొ విచారింతము. మాలపున్నమను గుఱించి యిట్లు కథ చెప్పెదరు. జోకరయ్య యను తెలగవాఁడు మాలపిల్లనొకదానిని మోహించి దానిఁ బొందెనట. కేవలము పొందుటయే కాదు దానియింటిలో దినము మాంసము మెక్కుచుండెనఁట. ఈతని జారత్వమును గుర్తించి పట్టవలెనని యీతని కులస్థులొకనాఁడు వీని ప్రియురాలి యింటికిఁబోవుచుండిరఁట. అప్పుడీ జోకరయ్య తనప్రియురాలి యింట మాంసము భుజించుచు నొక ఎముకను గొఱుకుచుండెనఁట. అంత నీతని ప్రేయసి యాతనితో దనబంధువులు వచ్చుచున్నారని తెలుప గబగబ నామెముకను మ్రింగబోవ నది వీనిగొంతులో నిఱికెనట. అంత జోకరయ్య యావేదనచే జనిపోయెను. అప్పుడా మాలలీ జోకరయ్యను నొక యెండిన గుంతలో బాతిపెట్టిరట.

జోకరయ్య స్వర్గలోకమునకు బోయెను. అప్పటికింతకు మునుపే వినాయకులవారు బాగుగ గుండ్రాళ్లపరమాన్నమును, కుడుములను భుజించి కుంటుచుపోయియుండెను (అనగా నీభాద్రపద మాసమందే శుక్ల చతుర్థీ దివసమున

వినాయక వ్రతము జరుగును, కాన నీ విఘ్నేశ్వరుఁడు స్వర్గలోకము పోయినప్పుడు ఇంద్రుఁడు "ఏమయ్యా! లోకములో మానవుల స్థితిగతు లెట్లున్నవి" అని విచారించెనట. అప్పుడు "వెనకయ్య" యిట్లనెనట. "ఏమిచెప్పుదు దేవరా! లోకములోఁ గాపులు, బాపలు, అందరు బలసిపోయినారు. వర్షములు సమృద్ధి. పంటలు పుట్లుపుట్లు. నాకు బొట్టబగుల మంచి మంచి తిండ్లు పెట్టగా మెక్కి పొట్ట బగిలి వచ్చితిని". ఈకథ విని యింద్రుఁడు వర్షమును బిగియబట్టెనఁట. లోకమందు వానలులేక పున్నమవఱకే జనులకిక వర్షము రాదను భయము కలిగెనట. అప్పుడు పున్నమనాడు మనజోకరయ్య యెండిన గుంతలోఁబడి చావుతప్పి కన్నులొట్టఁబోయినట్లు పొర్లి లేచి స్వర్గమునకుఁ బోయెను. ఇంద్రుఁడిటీవలివార్తలు—శుద్ధచతుర్థి నుండిపున్నమవఱకు లోకములోని జనులసంగతి యేతంతీమూలమునను దెలిసికొనలేదు. కావునమనజోకరయ్య పోయినవెంటనే "ఏమయ్యా! ఇప్పుడెట్లున్నదిమానవలోకము" అనిప్రశ్నించెనట. అందులకు జోకరయ్య జవాబు "ఏమిచెప్పుదును దేవరా! ప్రపంచమందు వానలులేక లోకులుకూడులేక చచ్చుచున్నారు. నాకు బట్టెడైనఁ బట్టుమని యన్నముపెట్టజాలక యెముక నోటిలోఁబెట్టి పట్టి గుంతలోఁ బారవేసిరి. చెఱువులు, కుంటలు బావులు, అన్నియు నెండిపోయినవి."

ఇంద్రునికి దయగలిగెను. తాను బంధించిన మేఘము
ల మరలవిడిచెను. వర్షములు సమృద్ధియయ్యెను. ఇట్లుపకార
చేసినందుకు నీజోకరయ్యను నీ దినము శూద్రులలో కొం
మాల మున్నగువారు పూజింతురు. జోకరయ్య మాలస్త్రీ
బొంది మాలడైనందున నీపండుగను మాలపున్నమ
యందురట.

ఇదిమాల పున్నమను గురించి యాంధ్ర దేశమం
ప్రచారమందుండు కథ. పౌరాణికులు లోకటికల్పించిన
పదికల్పించు శక్తి కలవారు. ఈకథకు మూలము కింవదం
పురాణములేప్ప నేపురాణమును గాదు. ఇది కేవలముకల్పిత
ము. అబద్ధము.

ఇక యథార్థమును గుఱ్తించెదము. ఈ పండుగ మహా
లయపక్ష సంబంధమైనది. మహాలయ పదమునకు
నాథుడు తన వాచస్పత్యము నం దిట్లు వ్రాసియున్నారు
మహాలయః=౧ మహత్ అత్యంతికే లయోయత్ర

౨ కన్యాస్థరవికమాస కృష్ణపక్షే
"తస్యాఃదద్యాత్ నచేద్దత్తం
పితౄణాం వై మహాలయే" భవిష్యపురాణే

మహాలయము అనగా గొప్ప వినాశనము శోభ
ఇది కన్యాసంక్రమణమాసమందు వచ్చును. అనగా

పద కృష్ణపక్షమందు వచ్చును. ఈపక్షమందుఁ దిలతర్పణము లచేఁ బూజింపఁ బడకుండినట్టి పితృదేవతలకుఁ దర్పణముచేయ వలెను అని భవిష్యత్పురాణ వచనము. కావున మహాలయ పక్షమునఁ బితృపూజలు జరుగును. ఇక యీ మాల పున్నమ అనుపదములలో "మాల" యనుపదము "మహాలయ" యను పదమున కపభ్రంశము. శూద్రులు మహాలయ యనుమాటను నోరుదిరుగక "మహా"ను "మా" జేసి "మాలయ" యనుట కూడఁ గష్టముగాఁ దోచి కడపటి అ"య్య"నుఁబంపివేసి "మాల"నుజేసిరి. మాలయన జంగాలజాతిభేదము కనుకజోకరయ్యె కథను గల్పించిరి. ఈపండుగ బితృ సంబంధమనుట కీపున్నమ నాఁడు శూద్రులు మాంసముచేతను, కల్లుసారాయి చేతనుఁబండుగచేసికొనుట యొకనిదర్శనము. అయితే పితరులకుఁ(పెద్దలకు) మాంసమునకేమైన సంబంధమున్నదాయన నున్న దని పురాణ ధర్మశాస్త్రములే చెప్పుచున్నవి. భారత శాంతిపర్వమందును, విష్ణుపురాణమందును, ఆపస్తంబమనుధర్మశాస్త్రాదులందును, ప్రతిమాస మొక్కొకరీతి జంతు మాంసముచే శార్ధకర్మలు చేయవలెనని యాదేశములు కలవు.

మనుస్మృతి యిట్లాదేశించు చున్నది.

శ్లో॥ పితౄణాం మాసికంశ్రాద్ధ మన్వాహార్యం విదుర్బుధాః
తచ్చామిషేణ కర్తవ్యం ప్రశస్తేన ప్రయత్నతః॥

మాసికశ్రాద్ధమును పరిశస్తమైన మాంసముచేత చేయ వలసినది అని దీనిభావము.

శ్లో॥ భక్ష్యం భోజ్యంచ వివిధం మూలానిచ ఫలాని చ
హృద్యానిచైవ మాంసాని పానానిసురభీణిచ॥
—మను. 3 అ. ౨౨౭ శ్లో॥

ఈ శ్లోకముకూడ పితృశ్రాద్ధ కర్మలందు బ్రాహ్మణులకు—అందు ముఖ్యముగా వేదములుజదివిన బ్రాహ్మణులకు శ్రాద్ధానంతరము రుచికరమగు మాంసపుగూరచే గుడ్డ బెట్టవలెనని చెప్పుచున్నది.

మనుస్మృతిలోని తృతీయాధ్యాయములో ౨౬ ౨౬౯, ౨౭౦, శ్లోకములలో చేపలమాంసము చేలను పొట్టేలు, పక్షులు, మేక, దుప్పి, ముండ్లపంది. దున్నపోతు కుందేలు, తాబేలు, వీనిమాంసముచే శ్రాద్ధముచేసిన పితృదేవత లత్యంతముగా తృప్తిపొందుదురని వర్ణింపబడియున్నది.

కానియిటీవల బ్రాహ్మణులు మాంసభోజనము విడుచుట యుత్తమమని భావించి దానికాధారము కల్పింపనెంచి పరాశరునిచే "పలపైతృకము" కలియుగమందు వర్జ్యము అని చెప్పించిరి! కాని శూద్రులు మాత్రమలకను నేటికి మున సత్యయుగ ధర్మమునే యాచరించుచున్నారు!!

అయితే "మాలపున్నమ" మహాలయపక్ష సంబంధ మనుటకొక్క యాక్షేపణము కలుగుచున్నది. బహుళపాడ్య మినాఁడు చేయుచుండిన సందేహమే యుండదు. అయితేయిది శూద్రుల.దటిలో నాచారమై యున్నందున వారీ పున్నమ నాఁడే యొకదినము ముందుగానే నీ పండుగను జేసి మరల అమావాస్యనాఁటు అనగా కడపటి దివసమునను నీపండుగ చేయుటచే నిది మహాలయ (పున్నమ) యగుటలో నేమియు సందేహ ము లేదు.

మనుస్మృతిలో మహాలయశ్రాద్ధ విధినిగుఱించి యిట్లున్నది.

శ్లో॥ యత్కించిన్మధునా మిశ్రం ప్రదద్యాత్తుత్రయోదశీం।
తదప్యక్షయ మేవస్యాద్వర్షాసుచ మఘాసుచ॥

వర్షర్తువునందు భాద్రపద కృష్ణ ౧౩ నాఁడు తేనెతో శ్రాద్ధముచేసిన నది అక్షయముగా నుండునని దీనిభావము.

ఇట్లే వివరములు తెలిసికొన గోరువారు మనుస్మృతిలో తృతీయాధ్యాయ మందలి ౨౭౩ నుండి ౨౮౬ వరకుండు శ్లోకములను జూచికొన గలరు.



# దత్తాత్రేయ జయంతి



దత్తాత్రేయజయంతి మార్గశిర శుద్ధ దశ
చేయఁబడును. దత్తాత్రేయుఁడు త్రిమూర్త్య
యవతారమని భావింపఁబడును. ఇతని సృష్టిని గుఱించి
క్రింది యితిహాసముగలదు. నారదుఁడొకతూరి త్రిమూ
భార్యలతో నత్రి భార్యయగు అనసూయను బోలు
తలు సర్వలోకములం దెందును లేరని చెప్పి కలహ
నాటిపోయెను. త్రిమూర్తులనుఁ దమతమభార్యలు అనసూయ
పాతివ్రత్యమునకు భంగముకలిగించునట్లు చేయవలెనని
పణచేసిరి. ముగ్గురుమూర్తులట్లే ప్రకారము మారు
లతో ననసూయయింటి కతిథులై వచ్చిరి. అనసూ
ని బూజించి భుజింపఁ గూర్చుండఁబెట్టెను. కాని వా
నగ్నవై వచ్చిననే భుజింతుమని చెప్పిరి. అప్పుడు నన
తన భర్త పాదములుఁగడిగి యానీటిని వీరిపై చల్లెను
ర్యము! ఆముగ్గురు దేవతలు పిల్లలై కావుకావు
ఆపిల్లల కామె దిగంబరవై పాలిచ్చెను. పిమ్మట వా
నుయ్యెలయందుంచి యూపెను. ఇట్లు మూర్తిత్రయ

యమైరి. వారిభార్యలా వారికై యెదురుచూచి చూచి
దకు శంకితులై అనసూయా దేవి యింటికివచ్చి తమ మగ
యవస్థనుజూచి ఖిన్నలై యామెనుఁ బతిభిక్షపెట్టుమని
ప్రార్థించిరి. అప్పుడామె మరల తన భర్త పాదములఁ గడిగి
నీటిని వారిపై చల్లగా శిశువులు యథారూపమును
ల్చి త్రిమూర్తులైరి. అప్పుడీ బ్రహ్మ విష్ణు మహేశ్వరు
నసూయా పాతివ్రత్యమునకు మెచ్చి వరమును వేడుమన
మె వారిని వేరురూపమునఁ దనకుఁబుత్రులై యుండఁ గో
ను. కావునే దత్తాత్రేయుఁడుఁబుట్టెను. ఇతని కాఱుచేతులు.
మూడుతలలు. మధ్యశిరస్సు విష్ణువుదనియు, దానికుడిది శివుని
దియు, నెడమది బ్రహ్మదనియు, జెప్పుదురు.

వేదకాలమందు నింద్రాది దేవతల ప్రాముఖ్యము హెచ్చు.
రాణకాలమందు మూర్తిత్రయము మేర్పడెను. ఈముగ్గురు
ర్తులు భిన్నులుకారనియు నొక్కరేయనియు దేవు
డొక్కడేయను వేదప్రమాణమును సమన్వయించుటకయియా
త్తాత్రేయోద్భవ కథాసందర్భ ముద్దేశమై యుండియుం
డును. మఱియుఁ బాతివ్రత్య ప్రభావము వలన సాక్షాద్దేవ
తలనైనఁ దాగుమారు చేయవచ్చునని బోధించుటయు
ఖోద్దేశములలో నొకటియై యుండును.



# కూర్మ జయంతి



ఇది వైశాఖ పౌర్ణమీ దివసమునఁ
బడును. ఇదంత ప్రాముఖ్యమైనదికాదు
వు దేవదానవు లమృతమును మధించినప్పుడు మంద
ము సముద్రమందుఁ గ్రుంకకుండునట్లుగాఁ గూర్మ
దాల్చి దానిని మోసెనని పురాణములందుఁ
కూర్మావతారము దశావతారములలో నొక్కటిగా
పఁ బడుచున్నది.

ఈ కూర్మావతార విషయమై యాంగ్లపండి
ప్రాయ మిట్లిచ్చినారని గుప్తే పండితుఁ డుదహరించినా

"పూర్వ మొకప్పుడు సంపూర్ణ సూర్యగ్ర
సంభవించెను. అది బెంట్లీపండితుని యభిప్రాయము
ము క్రీస్తునకు పూర్వము ౧౪౫౬ వ సంవత్సరమున
చెనఁట. దీనినే దేవదానవుల యుద్ధముగా వర్ణించినా
తలు వెలుతురునకును దానవులు చీకటికిని గల్పింప
ఈ సూర్యగ్రహణమునాఁడే శనిగ్రహము. మొట్ట

జ్యోతిష్కులకుఁ గనఁబడెనఁట. (గ్రహణసమయమున చంద్రుఁ డడ్డము వచ్చి చీకటిని గలిగించినందున నది మందరపర్వతముగాఁ గల్పింపఁబడెనఁట. కౌస్తుభరత్నము దొఱకెననుట శనిగ్రహమును గుర్తించుట యఁట. తక్కిన దంతయు నుత్ప్రేక్ష యఁట." విమర్శకు లేది నిజమో విచారించికొనఁగలరు.



# నృసింహ జయంతి



ఈ నృసింహజయంతి ప్రతి వైశాఖ చతుర్దశీ దినమునఁ గావింపఁబడును. వ్రతచూడామణి గ్రంథకారుఁడిట్లు వ్రాయుచున్నాడు.

“తదుక్తం నృసింహపురాణే హేమాద్రౌ —

శ్లో॥ వైశాఖ శుక్లపక్షేతు చతుర్దశ్యాం నిశాముఖే।
మజ్జన్మ సంభవం పుణ్యం పాపప్రణాశనం॥

ఈజయంతి సర్వవర్ణములవారు చేయవచ్చునని ప్రమాణము చెప్పుచున్నది.

“సర్వేషామేవ వర్ణానామధికారో ఽస్తిమద్వ్రతే”

అట్లైనను నిది కేవలము బ్రాహ్మణులచేతనే ... డును. బ్రాహ్మణేతరులలో శ్రీరామ నవమీ కృష్ణ ... జయంతులు ప్రధానముగా నుండినట్లు ఈనృసింహ ... ప్రాముఖ్యముఁ బొందలేదు.

ఈవ్రతమును గురించి హేమాద్రి బ్రాహ్మణములిట్లు వ్రాయుచున్నవని వ్రతగ్రంథకారుఁడు ... నాఁడు.

## నృసింహ జయంతి కథ

నృసింహస్వామి హిరణ్యకశిపుని చంపి ప్రశాంతుఁడై యున్న తర్వాత ప్రహ్లాదుఁడు చేతులు జోడించుకొని యాస్వామి నిట్లు ప్రశ్నించెను. "ఓస్వామీ మిమ్ముల ప్రీతుఁగా జేయు టెట్లు"? ఆమాటకు స్వామి యిట్లాన తిచ్చెను. "నాయందు భక్తికలవాఁడే నాకు ప్రియుడగును. పూర్వజన్మమందు నీవును వేశ్యాలోలుఁడవై యుండి నన్ను భజించినకతన నీయుత్తమజన్మమును బొందితివి. అదెట్లన. పూర్వము అవంతీపురమందు సుశర్మయను వేదపారగుఁడగు బ్రాహ్మణోత్తముఁడుండెను. అతని భార్య సుశీలయను సార్థకనామధేయ. ఆపవిత్రత కైదుగురు కొడుకులు పుట్టిరి. అందొకడవు నీవు (ప్రహ్లాదుఁడు.) నీవు వేశ్యాలోలుఁడవై నానాపాపము లాచరించితివి. సురాపానము సువర్ణస్తేయము మున్నగు మహాపాతకము లొనర్చితివి.

అట్టి నీవు వేశ్యయు మీరుచేసిన పాపములనుండి నా వ్రతము తెలియకచేసి ముక్తి పొందితిరి. ఒకనాఁడు నీగృహమందు కలిపురుషుండు నీభోగపు సానితోఁ గూడి యుండెను. ఆదివసమే వైశాఖచతుర్దశి. ఈనూతనవిటునితో నీకు కలహము జరుగుటయు, నీవానాడుపగలు మిటిమీరి తినుటచే రాత్రి భుజింపక జాగరణ చేయుటయు, నావ్రతము చేయునదిగా నయ్యెను. దానిచేనీవు విముక్తుఁడవైతివి. నావ్రతము దేవతలు

కూడ జేసినారు. బ్రహ్మదేవుడు సృష్ట్యర్థమై వ్రతము చేసెను. ఈశ్వరుడు త్రిపురాసురవధకై నన్నారాధించెను. నా వ్రతముచేయు జనులు కల్పకోటానంతరము కూడ నీలోకము నకురారు. వారు నిత్యకైవల్యపదముఁ బొందుదురు. మఱియు పుత్రులు లేనివారు ధనములేనివారు వేయేల యేయే వస్తువ నభిలషించు వారు వ్రతమాచరించిన తమ యాప్తితము బొందుదురు. వ్రతముచేయని వారు నరకమునకు బోదురు. వ్రతముచేయువాఁడీ దివసమున నదీతటాకాదులందు స్నానము చేసిశుచియైనన్ను ఋతుకాలోద్భవములైన పుష్పములచే బూజింప వలెను. రాత్రి జాగరణ చేయవలయును. బ్రాహ్మణులకు స్వర్ణమయమగు సింహ విగ్రహమును దానము చేయవలయును. ఈ విషయములో విత్తశాఠ్యము చేయ జనదు. అనగా లోభత్వము చూపఁ గూడదు. మఱియు బ్రాహ్మణులను భోజనముచే సంతోష పెట్టవలయును. ఈ ప్రకారముగా వ్రతమాచరించువాఁడు సర్వపాప విముక్తుడై సద్గతి పొందును.” ఇది నృసింహ జయంతి కథ.

## విమర్శ

దశావతారములలో నృసింహావతార మొక యవతారముగాఁ బరిగణింపఁబడు చున్నది. ఈ యవతార కథ యందఱకును విదితమే. భాగవమందీ కథ చాల రమ్య

ముగా వర్ణింపఁ బడినది. ఆంధ్ర భాగవతమందు సహితము పోతన ప్రహ్లాదుని చరిత్రమును బహు రమ్యముగా వర్ణించి నాఁడు. సహృదయులందీ వివరములను జూచికొనఁ గలరు.

ఈ యవతారము కేవలము హిరణ్య కశిపుని వధ కేర్పడినదని పురాణములు చెప్పుచున్నవి.



# వామన జయంతి



ఈ వామన జయంతి ప్రతి సంవత్సరము భాద్రపద శుక్ల ద్వాదశినాడు చేయుదురు.

శ్లో॥ మాసిభాద్రపదే శుక్లే ద్వాదశీ శ్రవణాన్వితా।

అని దీనికి ప్రమాణము. భాగవతమందును నీతిథి యందే వామనుఁ డుద్భవించెనని యున్నది. ఆంధ్ర భాగవతము నుండి యీ యంశము నుదహరించు చున్నాను.

మ॥ రవిమధ్యాహ్నమునం జరింప గ్రహతా
రాచంద్ర భద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు శ్రోణాభిజిత్
సంజ్ఞాత లగ్నంబునన్
భువనాధీశుఁ డుపుట్టె వామనగతిన్
బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరు మాతకున్ బరమపా
తివ్రత్య విఖ్యాతకున్.

ధర్మ సింధువు నందును నీజయంతి తిథిని గురించి యిట్లు వ్రాసియున్నారు.

"అథ వామనజయంతీ భాద్రపద శుక్లద్వాదశ్యాం
శ్రవణాయుతాయాం మధ్యాహ్నే వామనోత్పత్తిః॥

దశావతారములలో నీ వామనావతార మొకటిగా భావింపఁబడు చున్నది.

శ్లో॥ మత్స్యంకూర్మంవరాహంచ నారసింహంచ వామనం
రామంరామం రామకృష్ణంబౌద్ధం కల్కింనమామ్యహం.

అని వామన పూజలోఁ జెప్పిన మంత్రమందీ పదియవతారముల నామములు వివరింపఁ బడినవి.

ఈ వామనునికథ శ్రీ మహాభాగవత మందుఁ జాల విపులముగా వర్ణింపఁ బడినది. అందఱకుఁ దెలిసినదియైనను రెండు మాటలలో దాని సారాంశము నిందు వ్రాసెదను.

పూర్వము బలిచక్రవర్తి యను రాక్షసుఁడు చెలరేఁగి దేవతలఁ గెలిచి యింద్రుని పాఱద్రోలి ముల్లోకముల కధిపతి యయ్యెను. ఈ దైన్యమును దేవతల తల్లి యౌర్వాక కశ్యపునితో జెప్పికొని విష్ణునారాధించెను. విష్ణువు తన యంశముచే ఆమె గర్భమందు వామనుఁడై పుట్టెను. ఈ పొట్టివాఁడు పెద్దయై బలిచక్రవర్తి దానములు చేయుచున్నాఁడని విని బ్రాహ్మ

ణుల గుంపులో గలసి బలిదగ్గఱకుఁబోయి మూడడుగుల భూ మిని వేడెను. బలియొక్క గురువగు శుక్రుఁడు వలదని వారించి నను వినక మాట తప్పనివాఁడై వామనునికి ధారపోసెను. వామనుఁడు తన నిజరూపముతో భూమ్యాకాశ్యములను దన రెండు పాదములచే నావరించి మూడవపాదమునకుఁ జోటు లేక బలిశిరస్సుపై నుంచి యతనిఁ బాతాళమున కడఁగ ద్రొక్కెను.

ఇదికథ. ఈ బలిచక్రవర్తిని నిగ్రహించి యింద్రునికి మరల స్వర్గ రాజ్యమిప్పించుటకై యీ యవతార మేర్పడినదిగా పురాణములు చెప్పుచున్నవి.

విమర్శ

ఈ బలిచక్రవర్తి విషయమై వామనుని మూడడుగుల విషయమై దీపావళి పండుగయొక్క విమర్శన యందు వివరించినాడను. అందుఁజూడనగును. బలిచక్రవర్తిని నిగ్రహించు టకు మాత్రమే యీ యవతార మెత్తుటలో విశేషమేమియు గానరాదు.

శ్లో॥ యదాయదాహిధర్మస్యగ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్యతదాత్మానంసృజామ్యహం॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

అని భగవద్గీతయందు బోధింపఁబడిన రీతిగా దుష్టశిక్షణార్థమే యవతారమవసరమగును. అట్టిచో బలిచక్రవర్తి దుష్టుడని నిరూపింపఁజాలము. ఆడినమాటతప్పువాఁడు కాడు. తుదకు తన గురుశాపమునైన నోర్చునుగాని సత్యమును తప్పక పోయెను. రాక్షసులందఱు వామనుని కైతవముజూచి కత్తులు కఠారులు చేతబూని యుద్ధసన్నద్ధులుకాగా వారిని శాంతి పఱచెను. ఈ బలి రాజ్యములోఁ బ్రపంచ మంతటను సకాలవర్షములు కలిగెననియు ధన ధాన్య సమృద్ధి యుండెననియు, ముఖ్యముగా బ్రాహ్మణులు తృప్తిబొంది కోరిన యర్థముల నాతని నుండి పడసిరనియు భాగవతమందు వర్ణించియున్నారు. తుదకు వామనుడే బలి నిట్లు ప్రశంసించెను.

శా॥ బద్ధుండై గురుశాప తప్తుడయి తా
బంధు ప్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవ
క్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యమున్ గరుణయున్
సొంపేమి యుందప్పఁడు
ద్బుద్ధుండై యజయాఖ్య మాయగెలిచెం
బుణ్యుండితం డల్పుఁడే॥

ఇట్టివాని వినాశార్థముగానీ యవతారము వచ్చు నేలనో యూహింప శక్యముకాదు. ఇంద్రలోకమునీ బలి గెలిచెను. నెపమున సీతకు వామనునిచే పాతాళలోకము నంపబడెను. ఈ పై సందర్భములం బట్టి చూడ నేను దీపావళి ని గురించి వ్రాసిన విమర్శలోని విషయములనే యొకరమ్య మగు కథారూపముగా పురాణకారులు వ్రాసిరని విశ్వసింప వలయును.

ఈ వామన జయంతి నృసింహజయంతివలెనే బ్రాహ్మణులకే ప్రధానమైనది. తక్కిన వర్ణముల వారు దీని నాచరించుట లేదు.



# తులసీ వ్రతము



ఈ వ్రతమును క్షీరాబ్ధిశయన వ్రతమనియు, క్షీరాబ్ధివ్రత మనియు వ్యవహరింతురు. ఈ వ్రతము బ్రాహ్మణులలో, సర్వవర్ణ వితంతువులలో విశేష ప్రాముఖ్యమును వహించి యున్నది.

అనేక పురాణములలో ననేక విధముల నీ తులసీ కథను వ్రాసి యున్నారు. ఒక పురాణమం దిట్లున్నది. తులసి పూర్వజన్మములో కాలనేమి యను రాక్షసుని బిడ్డయై జన్మించెను. ఆమెను జలంధరుఁడను రాక్షసునికిచ్చి పెండ్లిచేసిరి. ఈశ్వరుఁడొక మారింద్రుచే ఛీవాట్లుతినివచ్చు డతని ఫాలస్థలము చెమ్మరించెనట. ఆచెమట సముద్రమందుఁ బొర్లు వేయంబడ దానినుండి యాజలంధరుఁ డుత్పత్తి యయ్యెను. ఈ జలంధరుఁడు సముద్రమందుఁ బుట్టినందునఁ దనయబ్బయైన సముద్రమునుండి దేవతలు లాగికొనిన లక్ష్మి కౌస్తుభ పారిజాత కామధేన్వాది వస్తువుల మరలఁ దనకిమ్మని నింద్రునిఁ గోరెను. ఇంద్రుఁ డియ్యకొననందున జలంధరుడు స్వర్గలోకము నాక్రమించుకొనెను. జలంధురినికి బ్రహ్మయొక వరమిచ్చి యుండెను.

ఎంతవరకు కాలని భార్య జలంధరుని తప్ప నితరులను
దోయంత వఱకు జలంధరుని ఏకుండే లోకమునకు
డని. ఈ కీలకము నెఱిఁగి విష్ణువు జలంధరుని వేషమున
సిని బొందెను. అప్పుడు ఇది జలంధరుని తెలియక
నాతల తులసీ ముందఱ వచ్చెను. తులసి నర్వము
విష్ణువును రాయిగమ్మని శపించెను. గండకీనదిలో దొ
సాల గ్రామశిలలే యాశాప శిలలు. విష్ణువు
తులసికిఁ బ్రతిశాపమిచ్చి మొక్క మొలకలై యుం
నెను. గావున నాదేవి తులసి చెట్టై యున్న
అయినను వీరిద్దఱకు నేటి విహాహముచేసి
లు చేయుచున్నారు.

పద్మపురాణమందీ కథ కొంచెము భేదముగా
జలంధరుఁ డీశ్వరుని మూడవ కంటమునుండి జన్మించె
ఇతని భార్యపేరు బృంద. ఈ బృంద తనభర్త దేవతలతో
యుద్ధమందు జయమందుట విష్ణువు గూర్చి పూజచే
చుండెను. అప్పుడు విష్ణువు జలంధరుని రూపము
గనంబడెను. తనభర్త వచ్చెనని సంతోషమున నామె
పూజ పూర్తిగాఁ జేయకపోయెను. అనుమానా భర్త
బృందయుఁ గొన్ని దినములు పురము నేయుచుండె
ధరుని శిరము దునుమబడి బృంద ముంగలఁ

అప్పుడు తులసి విష్ణువును శపింపఁబోవ విష్ణువామెతోఁ దా నెల్ల లోకములఁ దులసీదేవిగాఁ బూజింపబడునట్లు వరమిచ్చి పోయెను.

ఇక బ్రహ్మవైవర్త పురాణమున నీకథ యిట్లున్నది. యుధిష్ఠిరుఁ డరణ్యావాసము చేయుచుండ వ్యాసుల వారు వారి దగ్గఱకువచ్చి ప్రసంగ వశమున నీ తులసీదేవీకథ నిట్లు చెప్పిరఁట. "కార్తిక శుద్ధద్వాదశినాఁడు విష్ణువు క్షీరసముద్రమునుండి మేల్కాంచి బృందావనమునకు వచ్చి యిట్లు లోకమునకు వెల్లడించెను. ఏమానవుఁడీ దివసమున నన్ను దులసినిబూజించునో వాఁడు సర్వపాప విముక్తుఁడగును." కావున కార్తికశుద్ధ ద్వాదశినాఁడు తులసికి దీపములుపెట్టి పూజింపవలెను. ఒక దీపదానము చేసిన ననేక పాతకములు నశించును. నూరు దీపములచేత విష్ణు రూపమును బొందును. నూటికి మించిన దీపదానములు చేసిన నాఫలమును వర్ణించుటయే కష్టము.

శ్లో॥ ఏకేనదీపదానేన వ్యూపపాతక నాశనః।
శతసంఖ్యైః ప్రదీపైశ్చ విష్ణురూపో భవేద్ధ్రువం।
అతఊర్ధ్వం దీపఫలంమయావక్తుం నశక్యతే॥

తులసీ మహిమ బ్రహ్మకుఁ గూడఁ దెలియదు. ఈ తులసీ పూజను ద్వాదశినాఁడెవ్వఁడు చేయుఁడో వాడు కోటి

జన్మము లు చండాలురై పుట్టును. తులసి చెట్టును పెంచిన వారాచెట్టుకెన్ని వేరులుండునో యన్ని మహాయుగము విష్ణులోక మందుందురు. దీనిని గుఱించిన కథయొకటికలదు కాశ్మీర బ్రాహ్మణు లిద్దరు కాశీయాత్ర చేయుచుండిరి. అం దొకఁడు బాటలో నొకతులసిని జూచి దానిని వలగొని నమ స్కరింప రెండవబ్రాహ్మణుడా విశేషమే మని విచారింపవా రువురొకచింతతోఁట క్రిందఁ గూర్చునితులసీ మాహాత్మ్యము జెప్పుకొనిరి. అంత తటాలున నచ్చెట్టు తొఱ్ఱనుండి యిద్దఱు దివ్యపురుషులు బయటకు దుమికి "మహాత్ములారా! మీరు మాకుఁ జాల యుపకారము చేసితిరి. మేమప్సర సలతోడి వినోదములందుఁ దగిలి రోమశ మహాముని శాపము వలన బ్రహ్మ రాక్షసులమై తులసీ మాహాత్మ్య శ్రవణానంతరము విముక్తిఁ బొందనను గ్రహింపఁ బడితిమి. మీకుఁ బదివేల దండములు. మీకు శుభమగును. మేము పని వినియెదము" అని ప్రార్థించి, దీవించి యంతర్ధానమైరి.

వితంతులకిది ముఖ్యముగా నేర్పాటు చేయుట కీక్రింది కథ ప్రమాణము. పూర్వము ద్వారవతీ నగరమున నొక బ్రాహ్మణుని కూతురు చిన్నతనమందే నవ్యవైధవ్య బహువి వ్యథలచేఁగుంది తండ్రితో నాదుఃఖోపశ మనార్థమై జ్ఞానోపదే ము చేయుమని వేడ నాతఁడు సంతసించి యీతులసీ పూజా

ట్టునడఁ జేసెను. ఈ కారణమున నాయమ రెండవ జన్మమున మిత్రవిందయై పుట్టి శ్రీకృష్ణునికి భార్యయయ్యెను.

ఈ తులసీ మాహాత్మ్యమును గుఱించి యింకొక కథ కూడఁ గలదు. అదెట్లన: —

తంటాల తాళట్లు నారదుఁడొకతూరి సత్యభామతో భర్తనువశీకరించు వ్రతమొకటి యున్నదని చెప్పి యందులకై శ్రీకృష్ణునే యాతనికి దానమియ్య వలసినదని బోధించెను. మరలయా కృష్ణుని తూకముతో సమానమగు బంగరునిచ్చి శ్రీకృష్ణునివిడిపించి కొనవచ్చునని చెప్పెను. సత్యభామయీ యుపాయమున కొప్పుకొని శ్రీకృష్ణుని తోఁ దనముచ్చట యొకటి నెరవేర్పవలెనని ప్రార్థించి యొప్పించి యాభర్తను నారదునికి దానము చేసెను. నారదుఁడా కృష్ణునికిఁ దనతంబురాను, జింక తోలును నిచ్చి మోసికొని తన వెంట రమ్మని యాజ్ఞాపించెను. శ్రీకృష్ణుఁడట్లే చేసెను. సత్యభామ పిమ్మట శ్రీకృష్ణునినొక త్రాసునందుంచి యాతని తూకమునకు సరిపోవునట్లు తనవగలనన్నింటిని దూచెను. కాని త్రాసుచింతాకంతకూడ కదలకపోయెను. సత్యభామ ఖిన్నురాలయ్యెను. నారదుఁడు శ్రీకృష్ణుని వెంటఁగొని పోదునని తొందర పెట్టెను. అప్పుడు శ్రీకృష్ణుని యితరభార్యలు సహితము తమ తమ యాభరణములను ధనమును సర్వము తక్కెడలందుం

-చిరి కాని యేమియుఁ ద్రాసునందుఁ జలనములేదు అప్పు
రుక్మిణీదేవి భక్తితోఁ దులసి పూజించి యొక్క తులసీపత్రము
దీసికొని త్రాసులో వేయగా శ్రీకృష్ణుడు పైకి దూది
లేచెను. అపుడు నారదుఁడు రుక్మిణిభక్తిని తులసీమహిమ
గొనియాడి సత్యభామ గర్వభంగ మొనరించి శ్రీకృష్ణు
విడిచెను.

ఈకథనే శ్రీకృష్ణ తులాభార మందురు. ఇవి తుల
సంబంధమగు కథలు.

## విమర్శ

ఈ తులసీ మాహాత్మ్యమును గురించి వ్రాసిన కథ
పరస్పర విరుద్ధముగా నున్నవి. ఈ కథలు కేవల కల్పిత
లనియు నబద్ధములనియుఁ జెప్పినఁ బూర్వాచార పరాయ
లకుఁ గోపము కలుగవచ్చును. అయినను నాకుఁ దో
సత్యమును బ్రకటించుట నావిధియై యున్నది. జలంధ
డను వాఁడు శివుని చెమటనుండియో కంటి మంటనుండియో
పుట్టుటను, వాఁడు దేవతల నందఱి నోడించి త్రి
త్రిమూర్తులను సహితము తిప్పలు పెట్టుటను, వానిని జం
టకై విష్ణువాతని భార్య యొక్క పాతివ్రత్యమును చెఱ
టను, నట్టి స్త్రీ యొక చెట్టుగా జన్మించుటను, నా జనన

ర్థమును మానవులు బూజించిన యుగయుగాంతరముల వరకు సర్వపాప విముక్తులై విష్ణువుతో నైక్యమొందుటను మనము నమ్మవలయునట. నమ్మక. మ[illegible]హా తులసిని పూజింపక పోయినఁ గోటిచండాల జన్మము లెత్తుట సంభవించు ననెడి భీతియు మనకుఁ గలిగింపఁ బడినది. సర్వధర్మ స్థాపకుఁడగు విష్ణువే యొక పతివ్రతను జెఱచుట[illegible]ప్ప వేఱుపాయము గానఁడ య్యెననుట సమంజసము కానేరదు. మనుష్యుఁడు తన కన్న మించిన వారిని బూజించుట న్యాయము కాని తన కన్న తక్కువయగు సృష్టివర్గములోఁ జేరిన తులసిని బూజించిన వారలకి ముక్తి గలుగుననుట దురూహ్యము.

కావున దీని ముఖ్యతత్వము మనము గుర్తింప వలయును. తులసి చాల యుత్తమమగు నోషధి. ఇది ప్రతివారి యింటనుండిన నారోగ్యకరముగా నుండును. కావున నీ తులసిని బ్రతియింట నుంచవలెనని పౌరాణికుల యభిప్రాయమై యుండును. అట్టిచో "మీ యింటిలోఁ దులసిని దప్పక పెంచుఁడు. అది యనేక రోగముల హరించును. దాని వలన మీరు మేలుఁ బొందుదురు." అని వారు చెప్పియుండిన నెవరు విందురు. మఱియు నట్లుబోధించుట వారి పద్ధతి కాదు. ఏదన్న విషయమును గాని భక్తుల మనస్సున కెక్కింప వలయునని నా వస్తువు త్రిమూర్తులకే ముఖ్యాధారమైనట్టిదని చెప్పుచుండిన వారి కులమునకుఁ దప్పావచ్చును. కావున వారి

తులసిని గుఱించి "ఇది యిట్టి పతివ్రత. ఇది విష్ణువు భా
ఇది దేవతలచేతనే పూజింపఁ బడినది. ఇది పూజించిన వా
యుగాంతరముల వఱకు విష్ణుసాయుజ్య మొందుదురు." అ
వర్ణించి యుందురు.

ఇక తులసి యొక్క గుణము లెవ్వియో విచా
తము. వైద్య గ్రంథములు దీని గుఱించి యిట్లు వ్రా
యున్నవి.

౧. ఇది వాయువును శుభ్రపఱచును.
౨. దీఁని తినిన నాకలి గుణము కలుగును.
౩. ఇది రక్తమును శుభ్రపఱచును.
౪. ప్రక్కనొప్పులను బాగుచేయును.
౫. చర్మరోగముల బాగుచేయును. (గజ్జి, దుర
తామర కలవారిది రుద్దుకొనిన నవ్వ తక్కు
యగును )
౬. మూత్ర వ్యాధులఁ బోగొట్టును.
౭. తులసి విశేషముగా నిండ్లలో నుంచిన దో
లుండవు. దోమలు లేకుండిన చలిజ్వరము
(మలేరియా) యుండదు. మలేరియాకిది మం
మందని పాశ్చాత్యులు కూడ నొప్పుకొని య
న్నారు.

౬. కుష్ఠవ్యాధులకును పాముకాటులకును దీని యాకురస
ము, వేరువలని గంధము పనికివచ్చును. ధన్వంతరి ని
ఘంటువందు తులసిగుణములనిట్లు వర్ణించినారు.

శ్లో॥ తులసీలఘురుష్ణోష్ణా రూక్షా కఫవాతనుత్।
క్రిమిదోషంహరత్యే సా రుచికృద్వహ్నిదీపనీ॥

అనగా తులసి తేలికగను వేడిగను ఉష్ణము కలిగించు
నదిగను నుండును. మఱియు రూక్షముగను కఫవాతము, బో
గొట్టునదియునై యున్నది. ఇది క్రిమిదోషము హరించు, రు
రుచికరము గానుండును. ఇంతియుకాక అగ్నిదీపనమును గలి
గించును. మఱియు అష్టాంగహృదయము (వాహటము)లో
నిట్లు దీనిగుణము వర్ణింపబడినది.

శ్లో॥ హిధ్మకాసశ్రమశ్వాస పార్శ్వరుక్పూతిగంధహా॥
అర్థము — ఈవల్లతులసి హిధ్మకాసముల్ శ్రమశ్వాసము
పార్శ్వశూల దౌర్గంధ్యము వీనినిహరించును.

ఇట్టి దివ్యగుణములు గలిగిన యీ మొక్కను బ్రతి
యింటిలోను దప్పక యుంచవలసినదే. కాని దీనినిబూజించిన
విష్ణులోకములు దొరకుననియు, బ్రూజింపకుండిన కోటిచం
డాలజన్మములు లభించుననియుఁ జెప్పుట న్యాయముగాదు. ఇది
చపలమతములను, భక్తిని వంచించుటయగును.

# కపిలాషష్ఠి

ఌ



శ్లో॥ భాద్రేమాస్యసితేపక్షే భానౌచైవకరేస్థితే
పాతేకుజేచరోహిణ్యాం సా షష్ఠీకపిలాస్మృతా
సంయోగేతుచతుర్ణాంచనిర్దిష్టా పరమేష్ఠినా

తత్రసూర్యదేవతాపాస్థ్రన తత్పూజనతర్పణ హవనాదికంకృత్వా కపిలాంగాందద్యాదితి వ్రతవిధిః॥

షష్టిఅనగా ౬౦ సంవత్సరములు. కావున నీవ్రతము ౬౦ సంవత్సరముల కొకతూరివచ్చును. భాద్రపదమాసములో కృష్ణపక్షమందు సూర్యుడు హస్తానక్షత్ర సమీపమందుండి బుధ మంగళవారమునాడు రోహిణీనక్షత్రమున నీవ్రతము చేయవలెను. అనగానిన్నిగ్రహములు భాద్రపదమాసమందు కూడియుండవలెను. ఏసంవత్సరమువన్నియుంగూడునో యప్పుడిదిచేయవలెనని యర్థము. దీనినిగురించి యొకకథగలదు అదెట్లన:—

నారదుడొకతూరి గంగలో స్నానము చేయుచు రెండు చేపలు క్రీడించుట జూచెను. వానిని జూచి యతనికి సంసార సౌఖ్యముపై కాంతగలిగెను. కలిగి యిట్లనుకొనెను "శ్రీకృష్ణునికి ౧౬౦౦౮ గురు భార్యలంట. అందొక దానిని

నాకిచ్చిన నతనికేమి తక్కువ. కావున నాతనినే యడిగెదను" అని బయలుదేరెను.

"కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేత నాచేతనేషు" అని కాళిదాసు మేఘసందేశమందు వ్రాసినట్లు కాముకులకు యుక్తాయుక్త వివేచన తప్పును. నారదుఁడు శ్రీకృష్ణునితో దన యభిలాష నెఱింగించెను. శ్రీకృష్ణుఁడును నిదియొక వినోదముగా భావించి కోపగించుకొనక నారదునితో నిట్లనెను. నీవు నా భార్యల యిండ్లకుఁ బొమ్ము. ఏభార్యదగ్గఱ నేనుండనో దానిని నీవు పరిగ్రహింపుము. నారదుఁడట్లే ౧౬౦౦౦ యిండ్లు తిరిగెను. కాని ప్రతి యింటిలోఁ గృష్ణుఁడే కనఁబడెను. ఇంతలో నాతఁడు స్నానముచేయ బ్రొద్దయ్యెను. కావున చరల గంగకుఁబోయి యొక మునక మునిగెను. మునిగి పైకిలేచు వఱకతఁడొక సుందర స్త్రీ యయ్యెను. అతఁడు తన సర్వాంగములు మారినది చూచుకొని విస్మితుఁడయ్యెను. ఇంతలో నొక సన్న్యాసివచ్చి యా నూతన వధువును చేయిబట్టిలాగి బలవంతముగఁ బెండ్లిచేసికొని యామెను దన కుటీరమందే యుంచికొని యామె వలన ౬౦ కుమారులఁ గనెను. ఇట్లు ౬౦ సంవత్సరములు గడిచెను. పిల్లలఁ బోషింప లేక సంసారము నుండి విముఖురాలై యాస్త్రీ నారద విష్ణువును బ్రార్థించెను. అప్పుడా సన్న్యాసిభర్త మాయమైె విష్ణువు ప్రత్యక్షమయ్యెను. "ఏమివరము కోరెదవో కోరుము".

అనెను. నారదునికిఁ దెలివి వచ్చెను. "స్వామీ నేను మూర్ఖుడనైతిని నాకీ సంసారములో సుఖమున్నదని తలఁచితిని. ఇంత దుఃఖభాజనమైనది మఱియొకటిలేదు. దీని నుండి నన్ను దప్పించి యీ పెంటిరూపును మాన్పి నన్ను మరల పూర్వము వలెనే చేయవలెను." అని యడిగెను. ఇట్లనుచుండగనే యీతని ౬౦ కుమారులు "తల్లీ" చుట్టుముట్టి "కూడో కూడు" అని లబలబ కొట్టుకొను చుండిరి. విష్ణువు కనికరించి యిట్లనెను. "నారదా! నీవు యథాప్రకారముగా పురుషుఁడవై యుండ గలవు. ఈ నీ కుమారులు ప్రపంచ రాజ్యమున ప్రతియేట నొకరి వంతున ౬౦ యేండ్లు ప్రకారము అనుభవించుచు నుండగలరు." ఇది కథ.

## విమర్శ

ఈ యరువది కుమారులే ప్రభవ, విభవాది యరువది సంవత్సరములు. ఈ సంవత్సర విభాగము వింధ్యకు దక్షిణ భాగమందు శాలివాహన శకము చెల్లుదేశము లందున్నది. ఈ విభాగ ప్రకారము ౬౧ యేండ్లు నిండునప్పుడే కపిలావ్రతమును జేయవలెనని వ్రతకారుల యుద్దేశమై యున్నది. మఱియు నీ సంవత్సరముల ప్రాముఖ్యమును జూపుటకై నారదునకీ యవస్థను గల్పించి యాతని కుమారులనుగా వీని నేర్పాటు చేసిరి.

ఈ వ్రతమునాడు కపిల ధేనువు నొకదానిని విచిత్ర వస్త్ర నిర్మాణముచే సిద్ధము చేయింప వలెనట. ఈ విగ్రహమునకు బంగారు కొమ్ములు రెండుండ వలెను. రాగి రేకుతో వీపు చేయవలెను. గిట్టలు వెండివిగా నుండవలెను. తక్కిన భాగము కంచు. దీని దూడ కూడ నిట్లే యుండవలెను. దీనిని బ్రాహ్మణునికి దానము చేయవలెను. అట్లు చేసిన శాశ్వతయశమగును.

ఈకథయంతయు కల్పితమని విశదము.



# సూర్యచంద్రగ్రహణములు



ప్రతి సంవత్సరము ఒకతూరి సూర్యగ్రహణమును, చంద్రగ్రహణమును సంభవించుచుండును. దీనికి కారణము పురాణములందు రాహువను రాక్షసుని యొక్క పీడయని చెప్పబడుచున్నది. భాగవతమందీ కథ అష్టమస్కంధమందు వ్రాయబడి యున్నది. ఆకథను సంక్షేపముగా నాలుగు మాటలలో జెప్పెదను. పూర్వము దేవదానవులకు నిరంతర వైరముండెను. ఆ వైరముచే వారికి పోరాటములు జరుగుచుండెను. అందు రాక్షసులే జయము పొందుచుండిరి. అప్పుడు దేవతలందఱును రాక్షసులతో సంధిచేసి వారి గర్వము నణచుటకై శ్రీమహావిష్ణువును ప్రార్థించిరి. విష్ణువు వారికి సముద్ర మథనము జేసి అమృతమును సంపాదించుటకై నియోగించెను. దేవతలును రాక్షసులును గలిసి యాపనికై పూనికొనిరి. రాక్షసులు మందర పర్వతమును సమూలముగా పెకలించి కొనివచ్చి సముద్రములో వేసిరి. పిమ్మట సురాసురులు వాసుకి సర్పమును కవ్వపు త్రాడుగా జేసిరి. విష్ణు

వు కూర్మరూపియై పర్వతమును దన వీపుపై మోసెను. సురాసురు లిట్టి సాధనములతో సముద్రమును మథింపఁగా నందు లక్ష్మి, ఉచ్చైశ్శ్రవము, ఐరావతము, కల్పవృక్షము, కామధేనువు మున్నగునవి యుద్భవించెను. తరువాత హాలాహలమను విషముద్భవించి ప్రపంచమును దహింపఁ జొచ్చెను. దానిని శివుడు మ్రింగెను. అందు చేతనే యాతనిని నీలకంఠుడని కీర్తించు చున్నారు. తుదకు ధన్వంతరి అమృత కుంభముతో సముద్రము నుండి వెడలెను. వెడలిన వెంటనే రాక్షసులా కుంభమును లాగికొని తామే దానిని భుజింతుమని నిశ్చయించిరి. అప్పుడు విష్ణువు మోహినీ రూపము ధాల్చి రాక్షసుల మోహింపఁజేసి వారినుండి అమృత కుంభమును డీసికొని సురాసురులకు సమముగాఁ బంచియిత్తునని నమ్మజెప్పి మొదలు దేవతలకా యమృతము బంచిపెట్టెను. రాక్షసులలో నొకఁడగు రాహువు దేవతల పంక్తిలోఁ గూర్చొని యమృతము త్రాగెను. ఈ సంగతిని సూర్యచంద్రులు విష్ణువున కెఱింగింప నాతఁడు తన చక్రముచే వాని తలదునిమెను. కాని యతఁడంత వఱకే యమృతము త్రాగినవాడగుటచే వాని శిరమొక గ్రహమై యాకసమున నిలిచెను. ఈ గ్రహము ప్రతి సంవత్సరము సూర్య చంద్రులను బట్టి విడుచును. ఇది పురాణ గాథ.

## విమర్శ:

ఈ పురాణగాథ యసత్యమైనది. జ్యోతిశ్శాస్త్ర గ్రంథము లన్నియు సూర్యచంద్ర గ్రహణములకుఁ గారణము లను వేరుగాఁ జూపుచున్నవి. అవియే విశ్వసనీయములు. ఏలనఁ బంచాంగములను వ్రాయువారీ జ్యోతిశ్శాస్త్ర ప్రకారము గుణించి ప్రతి సంవత్సరమాయా కాలములందు సూర్యచంద్ర గ్రహణములు కలుగునని చెప్పెదరు. అదే ప్రకారము నేటికిని మన యనుభవమందుఁ జరుగు చున్నది. ఒక్కొక్క సంవత్సరము గ్రహణములు కనుపించును. వేరు సంవత్సరములందు వేరు దేశములందుఁ గనుపించును. ఇవి భూమిచంద్రుల గమనమునుబట్టి యుండును. ఈ గ్రహణములకు గారణము గణకానందమను జ్యోతిశ్శాస్త్ర మందిట్లు సూచింపఁబడినది.

చంద్రగ్రహణ కారణము:—

శ్లో॥ కింతుభూమేరథసూర్యే శోఽర్ధ్వభాగే నిశాకరః
ఉభయోఃపూర్ణిమాయాంతు రాశి షట్కాంతరంభవేత్

శ్లో॥ అతోర్ధ్వ న్యస్యభూఛాయాం యావద్విశతిచంద్రమాః
తావద్విశేషతశ్చంద్ర గ్రహణన్యమితిర్భవేత్ ॥

పౌర్ణిమనాడు సూర్యచంద్రుల మధ్య భూమి వచ్చిన చంద్రగ్రహణమగును.

సూర్యగ్రహణ కారణము:—

శ్లో॥ స్వకక్ష్యారాశితుల్యత్వం దర్శాంతే సూర్యచంద్రయో
భవంత్యేవహిసూర్యస్య కక్ష్యాధస్స్థితశ్శశీ
కాలేనయావతిస్స్వార్క మాచ్ఛాదయతిపర్వణి
సూర్యస్యతావద్గ్రహణం భవేద్గ్రసనసంశయః॥

అమావాస్యనాడు సూర్యునికి భూమికిని మధ్య చంద్రుడు వచ్చిన సూర్యగ్రహణము కలుగును.

పురాణగాథయందు ధన్వంతరి యమృత కుంభముతో నుద్భవించెనని వ్రాసి యున్నారు. కాని యిది విశ్వసనీయము కాదు. ధన్వంతరి తాను వ్రాసిన వైద్య గ్రంథమందు తన కాలమును దేశమును తండ్రి నామధేయమును సూచించి నాడు. ఇందుచేత నితడు మనుష్యునికిఁ గాక సముద్రమందుఁ బుట్టెననుట ప్రమాణము కాదు. వైద్య గ్రంథకర్తయగు ధన్వంతరి కాక యింకొక ధన్వంతరి సాగర పుత్రుడుండెననిన నేను చెప్పజాలను.



# ఋషిపంచమి



భాద్రపద శుక్ల పంచమీ దివసమున నీవ్రతము చేయఁబడును ఇది సర్వజనులకుఁ బ్రాముఖ్యము కాదు. బ్రాహ్మణులలో సహితము కొందఱే చేయుదురు. ఇది సప్తర్షుల నుద్దేశించి చేయఁబడునట్టి వ్రతము. సప్తర్షు లెవరనః—

శ్లో॥ కశ్యపో౽త్రిర్భరద్వాజో విశ్వామిత్రోథ గౌతమః
జమదగ్నిర్వసిష్ఠశ్చ సాధ్వీచైవా౽ప్యరుంధతీ॥

కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు—వీరు సప్తర్షులు. ఈ ఋషిపంచమీ వ్రతము చేయువారు వీరితోసహా వసిష్ఠుని భార్యయగు నరుంధతిని గూడ నర్చింతురు. ఈ దివసమున సప్తర్షి పూజల ప్రత్యేకముగఁ జేసి తర్వాత యందఱి పూజయుఁ జేయవలెను. ఈ వ్రతమును జేయువారు సర్వపాపముల నుండి విముక్తు లగుదురని చెప్పఁబడినది.

## ఋషిపంచమీ కథ.

పూర్వము విదర్భదేశమందు ఉదంకుడను బ్రాహ్మణుడును, సుశీలయను నామ భార్యయును చిన్నతనముననే వితంతువైన వారి బిడ్డయును నివసించుచుండిరి. రాత్రి కాలమందావిధవ నిద్రించిన యనంతరము క్రిమిరాశియై పోవుచుండెను. దాని కారణము భార్య విచారింపగా త్రికాలవేదియగు భర్త యిట్లనెను. "పూర్వమీ బిడ్డ యేడవ జన్మమందు ఋతుమతిగా నుండిన కాలమున భాండాది స్పర్శనము చేసిన దోషమున నీ జన్మమునందామె శరీరము క్రిమిరాశిగా నగుచున్నది." కావున దీని పరిహారార్థము ఋషిపంచమీ వ్రతము చేసినట్లైన నీ స్త్రీ పరిశుద్ధురాలగును.

ఈ వ్రతమును గురించి శ్రీకృష్ణుడు ధర్మరాజుతో నిట్లు చెప్పెను: —

"రజస్వలయగు స్త్రీ మూడు దినములు చండాలుని వలె, చాకలివలె, బ్రహ్మఘాతకునివలె మహాపాతకియై యుండును. నాల్గవ దినమున స్నానముచేసిన బరిశుద్ధురాలగును. రజస్వలగా నుండు కాలమున దెలిసియో, దెలియకయో యింటిలోని కుండలు మున్నగునవి ముట్టిన నా స్త్రీ మహాపాతకమును బొందును. పూర్వమిందుడు వృత్రాసురుని జంపి పాపము బొంది యాపాపమును అగ్నికి, జలమునకు, చెట్లకు, స్త్రీలకును బంచిపెట్టి తాను పాపవిముక్తుడయ్యెను. స్త్రీ జంతునకు వచ్చిన పాపభాగమే యీ రజోదోషము,

దాల్చుచున్నది. దీనిని గుఱించి యొక కథ యున్నది. పూర్వము విదర్భ దేశమందు సుమిత్రుఁడను బ్రాహ్మణుఁడుండెను. అతని భార్య రజస్వలగా నుండిన కాలమందు భాండములను ముట్టుకొనెను. ఆ పాపముచే వారు జాతిస్మరణ కలిగినట్టి కుక్కలుగా తమ కొడుకు గృహమందే పుట్టిరి. కొంతకాల మిట్లుండ నొకనాడు తండ్రి తద్దినమునకై యాయింట పాకముచేసిన పాయస భాండమందొక పాము విషము విడిచిపోయెను. తల్లియగు కుక్క దీనిని జూచి దానిని ముట్టి కొడుకున కుపకారము చేసెను. కాని కొడుకది గుర్తింపక దానిని నడుము విఱుగ నడచెను. పెంటికుక్క పోతుతో తమ పూర్వ జన్మపుఁ గొడుకు చెయిదములను జెప్పికొని యేడ్చెను. ఇది కొడుకు విని ఋషులను సమీపించి వారి యుపదేశముచే నీదీనదశనుండి తన తల్లిదండ్రులకు ముక్తి నిప్పించుటకై ఋషిపంచమీవ్రతము నేడు సంవత్సరములు చేసెను. అప్పుడు దేవ విమానమందు తల్లిదండ్రులు శునరూపములఁ జాలించి దివ్యలోకముల కేగిరి."

ఇది భవిష్యోత్తర పురాణమందు శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ జెప్పినట్టి వ్రతకథ. ఈ ఋషిపంచమీ వ్రతమ వలన స్త్రీలు పాపవిముక్తులై సుఖసంపద బొంది పుత్రపౌత్రాభివృద్ధి కలిగి యుందురని వ్రతఫలముగాఁ జెప్పబడినది.



# సత్యనారాయణవ్రతము



కామ్యవ్రతములలో సత్యనారాయణవ్రతము ముఖ్యమైనట్టిది. ఈ వ్రతమునకు నితర వ్రతములవలె నొక ప్రత్యేక దినమేర్పాటు లేదు. ఈ వ్రతము నెప్పుడైనను చేయవచ్చునని శ్రీవిష్ణుభగవానుడే నారదునికి చెప్పినటుల యీ క్రింది శ్లోకములవలన విశదమగును.

శ్లో॥ దుఃఖశోకాదిశమనం ధనధాన్యవివర్ధనం।
సౌభాగ్యసంతతికరం సర్వత్రవిజయప్రదం।
యస్మిన్కస్మిన్దినే మర్త్యో భక్తిశ్రద్ధాసమన్వితః।
సత్యనారాయణం దేవం యజేచ్చైవనిశాముఖే।

ఈ వ్రతము దుఃఖములను బోగొట్టునది. ధన ధాన్యము లిచ్చును. సౌభాగ్యమును సంతతి నిచ్చును. దీని నేదినమందైనను నొక దినమందు సాయంకాల సమయమున జేయవలయును. అని దీని భావము.

ఈ సత్యనారాయణవ్రత ప్రభావ మెట్టిదో తెలుపుటకై స్కాందపురాణమందలి రేవాఖండమం దిట్లు వ్రాయబడినది. మున్నొకతూరి నారదుడు ప్రపంచమందలి జనుల దుర్గతిని జూచి వారి నుద్ధరించు నిమిత్తమై వైకుంఠమున

కరిగి శ్రీమహావిష్ణువును స్తుతించి ప్రసన్నునిగావించుకొని యా దేవుని నిట్లు ప్రశ్నించెను—“మర్త్యుల విమోచనార్థమై సులభోపాయమును తెలియజేయుడు.” అందులకు శ్రీవిష్ణువు సమ్మతించి యిట్లు సెలవిచ్చెను.

“ప్రపంచములో నేజనులు సత్యనారాయణ వ్రతమాచరింతురో వారు సుఖులై, దుఃఖవిముక్తులై ధన ధాన్య సౌభాగ్య సంతతియుక్తులై సుఖింతురు. ఈవ్రతమును పూర్వమెవ్వరు చేసిరో యా విషయమును తెలుపుచున్నాను. పూర్వమొకప్పుడు కాశీపట్టణమున నొక దరిద్ర బ్రాహ్మణుడు వ్యాకులుడై దేశదేశముల దిరుగుచుండ సత్యనారాయణుడు కరుణించి వృద్ధబ్రాహ్మణ రూపధారియై యాతని క్షేమమును బోధించెను. అటులనే యాతడానాడు ఆర్జించిన ద్రవ్యముచే సత్యనారాయణవ్రత మాచరించి సర్వదుఃఖములనుండి విముక్తిబొంది సుఖించెను. ఈ బ్రాహ్మణుడిటులే పలుమారు వ్రతము నాచరించుచుండ నొకనాడొక (కాష్ఠ క్రేత) కట్టెలమ్మువాడది చూచి విచారించి సంగతి నెఱిగి తానును జేయ నుద్యుక్తుడయ్యెను. ఇట్లు సంకల్పమాత్రము కలుగగా నాదినము వాని కట్టెలకు క్రయము రెండంతలు దొరకెను. ఆక్రయమునంతయు వ్రతమునకే వినియోగించి వాడు సుఖించెను. అట్లు సుఖించుటే కాదు. వాడవసానమందు సత్యలోకమును బొందెను.

ఈ వ్రతమును గూర్చి మఱియొక కథయు నిట్లే స్కాంద పురాణమందు కలదు. అదేమన పూర్వమందు జితేంద్రియుడును సత్యప్రియుడునునగు ఉల్కాముఖుడను రాజు ఈ వ్రతమును శ్రద్ధాళుడై యొనరించెను. వ్రతము చేయు కాలమందొక కోమటి వచ్చి దాని విశేషమును రాజువలన నెఱిగి తాను సంతానహీనుడగు కారణమున తనకు సంతానము కలిగిన సత్యనారాయణుని కొలుతుననని మ్రొక్కుకొనెను. కొంతకాలమునకు కళావతియను కూతురు వీనికి పుట్టెను. భార్య తిన్నగా భర్తతో తన మునుపటి మ్రొక్కును జ్ఞప్తికి దెచ్చెను. "బాలిక పెండ్లియప్పుడా వ్రతమును జేయుదము. ఇప్పుడేమిలే" యని యతడు ప్రత్యుత్తరమిచ్చెను. కన్యకకు పెండ్లియయ్యెను. కన్యతండ్రియు, అల్లుడగు వరుడును కలసి ద్వీపాంతరమునకు వ్యాపారార్థమై వెళ్లిరి. పెండ్లిజరిగినను వ్రతము జరుపనందున సత్యనారాయణుడు క్రుద్ధుడై వైశ్యునికి ఘోర దుఃఖములు సంభవమగునట్లు శపించెను, వైశ్యుడే ద్వీపమున కేగెనో యచ్చట రాజగృహమందు దోపిడియయ్యెను. దొంగలు రాజభటులచే తఱుమబడి వారినుండి విముక్తిగానక మన సెట్టిగారి బసలో తము దొంగిలిన ధనమును బారవైచి యథేచ్ఛఁజనిరి. సెట్టిగారిని, అల్లుని రాజభటులు పట్టుకొని రాజసభకు బోయిరి. వారి ద్రవ్యమును లాగికొని వారిని కారాగృహమందు ద్రోయించిరి. సత్యనారాయణుని కోప మంత

ట్టో నిమించలేదు. ఇంటిలో సెట్టిగారి భార్యయు, బిడ్డయు దరిద్రులై వీధులందు కూటికి తిరుగసాగిరి. ఇట్లుండ నొకనా డొక భక్తుని యింట వ్రతము జరుగగా. నావ్రతాంతమందు స్వామి ప్రసాదము కొంత సెట్టి బిడ్డకు లభించెను. అప్పుడు తల్లిబిడ్డలకు వ్రతము జ్ఞాపకము వచ్చుట తడవ వారా వ్రతమును గావించి దేవుని ప్రసన్నునిగా జేసికొనిరి. ఇట్లు ప్రీతు డై సత్యనారాయణుడు సెట్లను చెఱనుంచిన రాజు స్వప్నమందు గనిపించి వారిని విడుదల చేయునట్లు జ్ఞాపించెను. రాజును మఱునాడు మామయల్లుండ్రను కారాగృహ విముక్తులనుగా జేసి వారి ద్రవ్యము వారికిచ్చి వారిని మర్యాదతో బంపించెను.

అయితే ధనమదాంధులగు నీ వియ్యంకులను మరల పరీక్షింపనెంచి సత్యనారాయణస్వామి వారికొక సన్యాసిగా గనబడి వారియోగలోనేమియున్నదని విచారించగా వారు గర్వముతో నిట్లనిరి—"దానిలోనున్న ధనమును నీవపహరింప నెంచినసది వ్యర్థప్రయాసమే యగును. అ దేమియు లేదు. అందు గుండులుతప్ప నింకేమియు లేవు". కనుక నా సన్యాసియు నట్లేయగుగాక, యని శపించెను. వైశ్యులు తమధనమునకు మారుగా నిజముగా పాత్రలే యుండుట జూచి ఖిన్నులై సన్యాసి పాదములు పట్టుకొని శుభ్రూషణము చేసి

ముఖముఁ గావించుకొని గండము తప్పించుకొని తమ గేహమును జేరికొనిరి. చేరినవార్త యింటిలోఁ దెలిసెను. సెట్టి గారి కూతురు వ్రతము చేయుచుండినదై భర్తయు తండ్రియు వచ్చిన వార్తను విని సంతోషమున వ్రతమును బూర్తిచేయ కుండచి సముద్రతీరమున కెదురొ్కొన బోయెను. సత్యనారాయణునకు మరల పట్టరాని కోపము కలిగెను. సెట్లనిరువుర సముద్రమందే ముంచివైచెను. మరల వ్రతమును జేసిరి. మరల దేవునికి దయగలిగెను. మరల కోమట్లు సముద్రముపైకి వచ్చిరి.

ఇందుల కింకొక కథయుఁ గలదు. ఒక రాజు మృగయా వినోదియై నానాజంతు సంహారమొనర్చి యలసి యొకచో గొల్లలుచేయు వ్రతముచెంత విశ్రమించెను. గొల్లలు ప్రసాదమర్పించినను తీసికొనడయ్యెను. దేవునికి గోపము వచ్చెను. రాజు రాజ్యభ్రష్టుడయ్యెను. అప్పుడు రాజు తెలివి తెచ్చుకొని మరల గొల్లలుండుచోటికి వచ్చి వ్రతమాచరించి వారిచ్చు ప్రసాదమును స్వీకరించి తన రాజ్యమును మరల పొందెను

ఇవి సత్యనారాయణస్వామిని గూర్చిన వ్రతకథలు. ఈ వ్రతమును సర్వజనులాచరించవచ్చును. ప్రత్యేక కాలనియమము లేదు. అయినను కొన్ని సమయములలో చేయుట మంచిదని వ్రతగ్రంథములలో చెప్పబడినది.

"పౌర్ణమాస్యా మమావాస్యాం సూర్యసంక్రమణ
ష్వతీపాతాష్టమీ ద్వాదశీ భానుభృగు సూర్య

పర్వదినేషు చన్ద్రార్కే కూర్యేమన ఉత్సాహ బ్రాహ్మ
ముఖోక్త పర్వసువా సత్యనారాయణవ్రతం కుర్యాత్.

అనగా పౌర్ణిమామావాస్య సూర్యసంక్రమణాది కా
ములందును, అష్టమీ ద్వాదశీ తిథులందును లేక బ్రాహ్
ణులు సూచించిన దినమునందును నీవ్రతమును నాచరి
వచ్చును. బ్రాహ్మణాది ద్విజులకు వేదోక్తముగ వ్రత
చేయవలయును.

"స్త్రీశూద్రాదిః కర్తాచేద్వైదికం మంత్రప్రయోగ
నకార్యః"

స్త్రీశూద్రులు వ్రతమాచరించిన వారికి వైదికమం
ములు కూడదు. అనగా పౌరాణికముగా నీవ్రతము వారి
చేయించవలయును.



# శ్రావణ పూర్ణిమ

రాకీపున్నమయని నీ పండుగ వ్యవహరింప బడును. దీని సంస్కృతములో రక్షికా పూర్ణిమ యని యందురు. రక్షయనగా సంరక్షణ. ఈ రక్షికా పూర్ణిమయే వికృతిరూపమున రాకీపున్నమయైనది. ఈ పండుగనాడు బంధువులును స్నేహితులును నొకరినొకరు ముంజేతిపై ప్టు దారమునైన వెండి తీగెనైన, బంగారుతీగెనైన నింక వెలగల రత్నమౌక్తికములతో జేరిన కంకణములనైన కట్టుదురు. దీని నేరక్షాబంధనమని యందురు. ఈ పండుగ ప్రతి సంవత్సరము శ్రావణ పూర్ణిమనాడు జరుగును. ఈపండుగనాడు యజ్ఞోపవీతధారులగు ద్విజులు క్రొత్తజందెములను ధరింతురు. కావుననీపండుగ బ్రాహ్మణాదులలో బ్రాముఖ్యమొగన్నది. శూద్రులచేనీపండుగ నాచరింపబడదు. రక్షాబంధన విధానము ఆంధ్ర దేశమందు విశేష ప్రచారమందు లేదు. విశేషముగా నుత్తరహిందూస్థానమందు జరుపబడుచున్నది. కొంకణదేశములో నీదినమునాడు సముద్రమునకు ...ందఅరిగి టెంకాయలతో సముద్రమును బూజింతురు. ...అనా దేశమున నీపండుగను "నారళీ పూర్ణమ"యని యందురు. ఈ పండుగవిషయమై భవిష్యత్పురాణ మందిట్లున్నది. "పూర్వము రాక్షసులు దేవతలచే నోడింపబడిరి. అ

ప్పుడుబలిమున్నగురాక్షసులు తమగురువగు శుక్రునితో త
విషాదమును దెలుపుకొనగా నాతడు దేవతలు రక్షాబంధన
చే నజేయులైరనియు సట్టిరక్షాబంధము నే రాక్షసులకును
డనేర్పాటు చేయుదునని చెప్పి వారలకుందుమాన్పెనట. అ
డుధర్మరాజు శ్రీకృష్ణునితో నిట్లనెను. ఈరక్షాబంధ మెట్టి
ఎట్లు ఎప్పుడుచేయవలెను" శ్రీకృష్ణు డిట్లు చెప్పెను:—

—— శ్రావణ పౌర్ణమనాడు బ్రాహ్మణాదిచాతుర్వర్ణ్యము
వారు స్నానముచేసి దేవపితరులను పూజింపవలెను. త
తఉపాకర్మాదికమును జేయవలెను. మధ్యాహ్న కాలమం
రక్షను సిద్ధముచేయవలెను. గృహాంగణమునగు నలికి పీటవ
యవలెను. అచ్చటియజమాని బ్రాహ్మణపరివృతుడై కూ
ని వారిచే రక్షను గట్టించుకొనవలెను. ఈ ప్రకార మె
కొ క రు నా లు గు వ ర్ణ ము ల వా రు ర క్షా బం
ధమును గ ట్టు కొ న వ లె ను. ఇట్లు చేసిన నాసంవ
కాలమువఱకు వారుసుఖముగా నుందురని యీ
శ్లోకము తెలుపుచున్నది.

శ్లో॥ అనేనవిధినాయస్తు రక్షకాబంధమాచరేత్ ।
సనర్వదోషరహితః సుఖీసంవత్సరంభవేత్ ।

పండితభవానీ పర్షాదుగారీ శ్రావణపూర్ణిమను గు
చి తన «ఆర్యపర్వపద్ధతి» యను గ్రంథమందుత్తమ

ధనాఫలితములగు విషయముల వ్రాసియున్నారు. వానిన్కిం దనుదహరించు చున్నాను.

ఈపండుగను గుఱించి పారశ్కరగృహ్య సూత్రమంది ట్లున్నది:—

«అథాతోఽధ్యాయోపాకర్మ । ఓషధీనాం ప్రాదు ర్భావే శ్రవణేన శ్రావణ్యాం పౌర్ణమాస్యాం శ్రావణస్యపం చమ్యాంహస్తేనవా ॥

భావము:— ఈ యుపాకర్మను శ్రావణ పంచమి నాడుగాని పున్నమనాడుగాని చేయవలయును.

మనుస్మృతిలోనిట్లున్నది:—

శ్లో॥ శ్రావణ్యాం ప్రౌష్టపద్యాం వాప్యుపాకృత్యయథావిధి। యుక్తశ్ఛందాంస్యధీయేత మాసాన్ విప్రోర్ధ పంచ మాన్॥
పుష్యేతు ఛందసాంకుర్యాత్ బహిరుత్సర్జనంద్విజః।
మాఘశుక్లస్యవాప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేహని॥

భావము.—

బ్రాహ్మణాదులు శ్రావణపూర్ణిమనాడుగాని భాద్ర పదపూర్ణిమనాడుగాని యుపాకర్మచేసికొని నాటినుండి ౫౹ నెలలపర్యంతము వేదాధ్యయనముచేయవలెను. తర్వాతపు ష్యమందుగాని మాఘమందుగాని యైదునెలలు ౧౫ ది నము లైన వెంటనే యధ్యయనము చాలింపవచ్చును.

“పై ప్రమాణములవలన శ్రావణ పూర్ణిమనాడు నూతన యజ్ఞోపవీతధారణము చేసికొని బ్రాహ్మణాది ద్విజాతులు ఋగ్వేద మానవుల వఱకు వేదాధ్యయనము జేయవలసిన విధియై యుండెను.

“కాని నిక్కాలమందా యాచారము లన్నియు వదుగంటినవి. మధ్యవచ్చిన యప్రధానమగు రక్షికాబంధము ప్రాముఖ్యత వహించినది.

“ఈ రక్షాబంధనమునకుఁ బ్రమాణము భవిష్యత్పురాణమందుఁ దప్ప మఱెందునులేదు. మఱియు నీ యాచారము మొగలాయి రాజులు ఢిల్లీలో సామ్రాజ్య మారంభించిన కాలములో మునల్మానుల క్రౌర్య నైచ్యముల నుండి స్త్రీలను రక్షించుటకై రాజపుత్రస్థానములో నీ యాచారము ప్రారంభ మయ్యెను. రాజపుత్రస్త్రీలు తాము మెచ్చుకొనిన వీరుని హస్తమందీనాడు రక్షికను గట్టుటచే నా స్త్రీపురుషులక్కదమ్ములు వగుచుండిరి. అట్టి సోదరిని యావజ్జీవము రక్షించు భారమా కృతక సోదరునిదై యుండెను.

చిత్తూరు మహారాణియగు కర్ణవతి తనకోటను గుజరాతు నవాబగు బహదూరుషా ముట్టడింపగా దనను రక్షింపుడని ఢిల్లీచక్రవర్తిగానుండిన హుమాయూనుపాదుషాకు రక్షాబంధన మంపి ప్రార్థించెను. ఆ ప్రార్థన మంగీకరించి బహదూరుషాను దఱిమివైచెను. నాటి నుండి యీ యాచారము మన దేశమున బహు ప్రాంతముల ప్రబలెను.

# సంక్రాంతి

ఈ పండుగ ప్రతిసంవత్సర మితర పండుగలు వచ్చి నట్లు ఒకే దినమునాఁడు రాదు. ఏలయన నీపండుగ సూర్యుని సంచారమును బట్టి యేర్పడును. సూర్యుఁ డారుమాసముల కాలము దక్షిణాయన మందుండి పిమ్మట యుత్తరాయణము నకుఁ బోవును. ఆసందర్భమున నీపండుగను జేయుదురు. సాధారణముగా నిది మార్గశీర్షమాసమందు వచ్చును. లేదా పుష్యమాసమందైన వచ్చును.

సంక్రమణమునాడు జనులుపవసించి పితరులకు తిలోదకము లిడిచి తాము నూనెపిండితో శరీరమును రుద్దుకొని స్నానము చేయుదురు. కొన్ని ప్రాంతములందు సంక్రాంతి పండుగ మూఁడు దినముల వఱకు కూడ చేయుచుందురు. ఆ దినములలో ప్రతిదినము ఇంటిముంగట నలికి రంగు రంగుల పిండితో ముగ్గులుపెట్టి గోమయముతో గురుగులు చేసి వాని లో నానా విధము లగు రంగులపూలను నూలు బియ్యమును పెట్టి యిండ్లనలంకరించి కొందురు. మఱియుఁ బ్రతిదివసము కొందఱు నూనెతో రొట్టెలనుజేసి భుజింతురు. సజ్జలు పండు భూములలో నివసించువారు సజ్జరొట్టెలకు నిండుగా నూనెనం టించి చేసి భుజింతురు. సంక్రాంతి పండుగ చలికాలమందు వచ్చును. సజ్జలు ఉష్ణము గలిగించు స్వభావముకలవి. కావున

నీనితోఁ జేసిన రొట్టె లాకాలమందు భుజించుటకుఁ జాల యోగ్యములైనవి—సంక్రాంతి పండుగనాడు నానావిధము లగు కూరల నన్నింటిని గలపి వండుదురు. ఆదినము బ్రాహ్మ ణులకుఁ గూరగాయలను ధాన్యమును దక్షిణను నిచ్చెదరు.

మొదటిదినము చేయుపండుగను భోగియందురు. రెం డవ దినమునాడు సంక్రాంతి చేయుదురు. దీనిని మకరసం క్రాంతి యనియందురు. ఈసంక్రాంతి పండుగనాఁడు బ్రా హ్మణులకు స్త్రీలు కుంకుమ సుగంధద్రవ్యములు, తండుల ములు, గుడము, పుష్పములు, వస్త్రములు మున్నగు వానిని దానములు చేయవలయునని పురాణములు బోధించియు న్నవి.

ఈపండుగ కేవలము సూర్యుని నుద్దేశించి చేయఁబడు నట్టిది. సూర్యుడు దక్షిణమునుండి యుత్తరాయణమునకు బో వును గాన నీపండుగ జేయఁబడును.

## వివర్శ

సంక్రాంతి మాసమున కొకతూరి వచ్చును. జ్యోతి శ్శాస్త్రమందు ౧౨ నక్షత్రరాశులను నేర్పాటు చేసియున్నా రు. ఒక్కొక్క మాసమందు సూర్యుఁ డొక్కరాశి యందు వచ్చుటచే నామాసమందా నక్షత్రముతో సంబంధించిన సం క్రాంతియని యందురు. ఈసంక్రాంతులలో ముఖ్యమైనది

మకర సంక్రాంతి. అనగా నాదివసము సూర్యుడు మకరరాశి యందు వచ్చును. కర్కాటకమునుండి మకరసంక్రాంతివఱకు సూర్యుడించుక దక్షిణాభిముఖుఁడుగా సంచరించుటచేత నీకాలమును దక్షిణాయనమని యందురు. తిరుగా మకరసంక్రాంతి నుండి కర్కాటక సంక్రాంతివఱకు సూర్యుడించుక యుత్తరాభిముఖుఁడై సంచరించుటచే నీకాలమును నుత్తరాయణమని యందురు. ఉత్తరాయణము దేవతలకు ముఖ్యమనియు, దక్షిణాయనము పితృదేవతలకు ముఖ్యమనియు జెప్పుదురు. కావుననే నుత్తరాయణకాల ముత్తమకాలమనియు దక్షిణాయన కాలము కీడుకాలమనియు జనులు విశ్వసింతురు. మఱియు దక్షిణాయన కాలమునందు దక్షిణదిశద్వారము తెఱచి యుంచి యుత్తరద్వారము మూసియుంచుదు రనియు, నుత్తరాయణ కాలమందే యుత్తరద్వారము తెఱచియుంచుదురనియు జన విశ్వాసము. ఇందుచే దక్షిణాయన కాలమందు మరణించిన వారి కుత్తమగతియుండదనియు, భీష్ముఁడు దక్షిణాయనములో యుద్ధభూమిపైఁబడినవాఁడైననుత్తరాయణము వఱకు ప్రాణముల నిలుపుకొని యుండెననియుఁ జెప్పుదురు. (ఈవివరములను దీపావళి పండుగయను శీర్షిక క్రిందఁజూడుడు)

సంక్రాంతివిషయమై జయసింహకల్పద్రుమమందిట్లున్నది:—

తత్ర మేషాదిషు ద్వాదశ రాశిషు క్రమేణ
సంచరతః సూర్యస్య పూర్వస్మా ద్రాశేరుత్తరాశౌ
సంక్రమణప్రవేశః సంక్రాంతిః —

అనగా సూర్యుఁడు క్రమముగా మేషాది ద్వాదశరాశులందు సంచరించుచు పూర్వరాశినుండి యుత్తరదిక్కుముగమై ప్రవేశించినప్పుడు సంక్రాంతియగును.

ఉత్తరాయణ దక్షిణాయన పదములలోని అయనము అనుపదమునకర్థము (జయసింహకల్పద్రుమ)మందిట్లున్నది.

"అథాయనం-అను తేయాన్యనేన ఋతుత్రయేణ సూర్యోదక్షిణాశా ముత్తరాశాంచేతి ఋతుత్రయమయనం-పూర్వషణ్మాసాన్ దక్షిణాదిత్యవతి, పరాన్ షణ్మాసాన్ ఉత్తరాదిత్యవతికే చిత్తుచాంద్రమాసేనాయనద్వయ మభ్యుపగచ్ఛంతి మార్గశీర్షమాసాదిత్రైభిర్ ఋతుభిఃకల్పితాః కాలః షణ్మాసాత్మకముత్తరాయనం జ్యేష్ఠమాసాదికైర్దక్షిణాయనమితి ఆహుః। కర్క సంక్రాంతిమారభ్య దక్షిణం। మకర సంక్రాంతి మారభ్యోత్తరం।"

దీనిఅర్థముసూర్యుఁడు ఋతుత్రయమందుత్తరదక్షిణాముగా సంచరించుదానిని అయన మని యందురు. ఆఱుమాసములు దక్షిణముగా, నాఱుమాసము లుత్తరముగా సూర్యుఁడు సంచరించును, మార్గశీర్షమాసమునుండి మొదలు కొనిమూఁడు ఋతువులవఱకనగా ఆఱుమాసముల వఱకు సూర్యుఁడుత్తరాయనమందుండును జేష్ఠమాసము మొదలుకొని మూఁడు ఋతువులవఱకు అనగా నాఱుమాసముల పర్యంతము సూర్యుఁ

దక్షిణాయనమందుండును. కర్కాటసంక్రాంతి మొదలుకొని సూర్యుడు దక్షిణాయనమందుండును. మకర సంక్రాంతి మొదలుకొని సూర్యుడుత్తరాయణ మందుండును.

ఇట్లు పై ప్రమాణముల బట్టి మకరసంక్రాంతినాడు సూర్యుడుత్తరాయన గతుడగుటచే జనులీనాడు సంక్రాంతి పండుగ చేయుదురని విశదమగును.

హిందీ గ్రంథకారులగు భవానీప్రసాదుగారి యభిప్రాయమొకటి గమనింపదగినది. అదేదన:—

"ఈపండుగనాడు నువ్వులు, నెయ్యి, గొంగళ్లు, బీదలకు దానము చేయవలయునని వ్రతకారు లాదేశించినారు. దీని యందు మంచియర్థము కలదు. ఈ పండుగ శీతకాలమందు వచ్చును. కావున పై మూడు వస్తువు లుష్ణమును గలిగించునవి గాన నీవిధి చెప్పబడినది.

"నువ్వుల ద్రవ్యగుణములను గురించి వైద్య గ్రంథము లివి యుష్ణముగలిగించునవని వ్రాసినారు.

"మఱియు కంబళి విషయమై చెప్పవలసినది లేదు. 'కంబలవంతంన బాధతేశీతః" యని శ్లిష్టోక్తిగా నొకకవి వ్రాసియున్నాడు.

"నెయ్యి ఓజస్సు, తేజస్సు, అగ్నిదీపనము కలిగించు దని వైద్యగ్రంథములు చాటుచున్నవి. కాన యత్యంత శీత మాండు నుత్తర హిందూస్థానమందీ పండుగనాడీ వస్త్ర దానము చాలసమంజసము"

సంక్రాంతి సర్వసాధారణముగా చలికాలమందు వచ్చు ను. ఈ సందర్భముననే శ్రీనాథకవితన శివరాత్రి మాహాత్మ్య మందిట్లు రమ్యముగా వర్ణించినాడు:—

"ఇండ్లమొదలను నీరెండ నీడికలను
ననుగుదమ్ముఁడు వన్నయు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడు గుమ్మ
గాచుచోటికి మకర సంక్రాంతివేళ"



# అనంత చతుర్దశి



శ్లో॥ అనంతవ్రత మస్త్యేక మథా వశ్యమను
త్తమమ్। సర్వపాపహరంస్త్రాణాం స్త్రీ
ణాంచైవయుధిష్ఠిర । శుక్లపక్షే చతు
ర్దశ్యాం మాసిభాద్ర పదేభవేత్ ।
తస్యానుష్ఠాన మాత్రేణ సర్వపాపం
వ్యపోహతి॥

అనంత వ్రతము భాద్రపద శుక్ల చతుర్దశీ దినమున నాచరింపఁబడును. ఇది వైష్ణవులకుఁ జాల ముఖ్యమైనది. దీనిని గుఱించి భవిష్యోత్తర పురాణమందు విశేషముగా వ్రాయబడి యున్నది.

పూర్వము ధర్మరాజు రాజసూయ యజ్ఞమందు సకలైశ్వర్య యుక్తుఁడై యుండినతఱి దుర్యోధనుడు మయనిర్మిత సభయందు నేలయని భ్రమించి నీటఁబడినప్పుడు ద్రౌపది పరిహసింపగా దుర్యోధనుఁడు క్రుద్ధుఁడై కొంత కాలమునకుఁ బాండవులను శకుని సహాయుఁడై మాయాద్యూత మందోడించి యరణ్యావాసము చేయఁబాండవులఁ బంపెను.

అరణ్యమందు ధర్మరాజు ఖిన్నుఁడై తన్నుజూడ వచ్చిన కృష్ణునితోఁ దాము మరల తమ స్వత్వములఁ బొందు నుపాయమెట్లని ప్రశ్నింపఁగృష్ణుఁడు వారికనంత వ్రతమాచరించు

నట్లాదేశించెను. ధర్మరాజు అనంతుఁ డననేమని ప్రశ్నింప
గృష్ణుఁడిట్లు చెప్పెను.

అనంతుఁడు అనగా సర్వేశ్వరుఁడగు విష్ణువు. అత
గూర్చిన వ్రతమే యనంతవ్రతము. ఆ వ్రతమును బూర్వ
శీలయను పతివ్రత యాచరించి సర్వాభీష్టముల నందెను.

అదెట్లన తొల్లి కృతయుగమందు సుమంతుఁడను బ్రా
హ్మణుఁడు దీక్షాదేవియను భార్య వలన శీలయను కూతు
బడసెను. దీక్ష కొంతకాలమునకు మృతింప సుమంతుఁడ
కొక భార్యను గర్కశయను సార్థక నామధేయను కొంచె
డెను. శీల సుశీలయై వినయ విధేయ తలచే నొప్పుచుండె
అంత నామె పెద్దదికాగా కౌండిన్యుఁడను బ్రాహ్మణుఁడొక
డామెను వివాహమాడెను. దంపతులు ప్రయాణమగు స
డు సవతితల్లి వారికేమియు బహుమతుల నొసఁగక క
ముగా వారిని వెడల నడచెను.

ప్రయాణము చేయుచు దంపతులు యమునానది
సమీపించిరి. అచ్చట యనేక పుణ్యస్త్రీలు కుసుంభ
వస్త్రాలంకృతలై యమునాపూజలు సేయుచుండిరి. ఆదిన
భాద్రపద శుద్ధ చతుర్దశి. శీలయాస్త్రీల సమీపించి నా
అనంతవ్రత మాచరించుట యెఱింగి యా విధానము
నెఱిగి యాచరించి బ్రాహ్మణులకు దమ యన్నమందు స
భాగమిచ్చి మరల ప్రయాణమై. భర్తృగృహము చేరు

అచ్చట యీ మె గృహము సంపదలకు నిలయ మయ్యెను. ఒకనాఁ డామెభర్త యామె వామహస్తమందు చతుర్దశ గ్రంధి యుక్తమైన దోరకమును జూచి యీ ముళ్లు గల దారమునీ హస్తమం దేల యున్నది. నన్నేమైన వశీకరము చేయుటకై కట్టుకొనిన తంత్రమా యిదియేమి చెప్పుము అని యామెను కఠినముగా నడిగెను. ఆయమ యనంత వ్రతకథను జెప్పెను. భర్త యిది విశ్వసింపక కోపముతో నాదోరకమును ద్రుంచి యగ్నిలో వైచెను. ఈ దుడుకునకు ఫలితముగాఁ గౌండిన్యుని సంపద యంతయుఁ గొల్లఁబోయెను. కొలఁది కాలము లోపలనే సర్వదరిద్రుఁ డయ్యెను. దీనిఁ జూచి ఖిన్నుఁడై యొకనాఁడు తన భార్యతో దాని కారణ మడుగ నాసాధ్వి యాతఁడు దోరకమును ద్రుంచివైచి నందులకీ యవస్థ ఘటిల్లినదనియు మరల నావ్రతమాచరించుట యుక్తమనియు బోధించెను.

కౌండిన్యుఁ డప్పుడరణ్యమున కేగి కొంత కాలము ఘోరతపము చేసి పిదప పిచ్చివానివలె వనమంతటను గ్రుమ్మరుచు నెదురగు చేతనాచేతనములఁ దామనంతుని జూచితిరా యని ప్రశ్నింపఁ దొడఁగెను. ఒక మామిడిచెట్టు చెదలచే తిండియు ఫలవంతమై యొక్క పక్షియేనియు దానిపై వ్రాలక యుండఁజూచి కౌండిన్యుడు దానితో ననంతుని విషయమడిగెను. ఆవృక్షము అనంతుని జూచలేదని ప్రత్యుత్తర మిచ్చెను.

పిమ్మట యొక యావును దాని దూడను నరణ్యములోఁ బోవుచుండఁజూచి దానిఁ గూడ ననంతుని వృత్తాంతమడిగి చూడలేదను ప్రత్యుత్తరము వడసి ముందరిగెను. మఱి కొంతదవ్వరిగి రెండు తటాకములను జూచెను. అప్పటకూడ నదే ప్రత్యుత్తరమందెను. అటు పిమ్మట యొక గాడిదను, గజమును జూచి వానివలనఁ గూడ నదేజవాబు వినెను. ఇట్లు నానావిధములఁ బ్రయత్నించియు ననంతుని సాక్షాత్కారము బొందక హతాశుఁడై యొక చెట్టుపై యురి వేసికొని చావ సిద్ధుఁడయ్యెను. అప్పుడొక వృద్ధబ్రాహ్మణుఁడచటికివచ్చి కౌండిన్యుని యుద్యమమును వారించి యతనినొక గుహలోనికిఁ గొంపోయెను. అచ్చటనొక గొప్పనగరము గుపడెను. ఆనగరమధ్యమందొక మహాసౌధము, దానిలో నొక రత్నఖచిత సింహాసనముండెను. దానిపై అనంతుఁడు కూర్చుని గరుడుని సేవింపఁ బడుచుండెను. అప్పుడా కౌండిన్యుఁడు వృద్ధబ్రాహ్మణుని పాదములపై బడి తాను మహాపాతకిననియుఁ దయతో క్షమింపుమనియుఁ బ్రార్థించెను. ఆవృద్ధబ్రాహ్మణుఁడు తన నిజమగు ననంతరూపమును జూపి కౌండిన్యుని వరము వేడుమని చెప్పెను. కౌండిన్యుఁడిట్లు పలికెను "ఓదేవా! నేను సంపదచేగర్వించి నాభార్య చేసిన వ్రతములనరకుఁగొనక దోరకమున్ద్రుంచి మంటవైచి మిమ్ముననవమానపఱచి మహాదోషినైతిని. దానిఫలితముగ వెంటనే యనుభవించితిని. నాసంపదయంతయు నాశనమయ్యెను. బంధువులందఱు నాతోఁ గలహించిరి. మరల మీ

కుంచేసినప్పుడు మీదివ్యవిగ్రహమును జూడఁగంటిని. ఇంతియ చాలును. అయినను నాపాతకముల నెట్లు బాపికొనవలెనో నాకుఁదెలుపవేడెదను" అనంతుఁడు కౌండిన్యుని గరుణించి యిట్లానతిచ్చెను. "నీవు నీగృహమునకుఁబొమ్ము. పదునాల్గు సంవత్సరములవఱకు దోరకమును బూజించి నావ్రతమును జేయుము. నీపాపములన్నియును నశించిపోవును. నీవు పుత్రపౌత్రుల తోడను, సర్వసౌఖ్యములతోడను వృద్ధికిరాగలవు. ఇంతియ కాక యికముందుఁ బఠించుచుండెవ్వరెవ్వ రనంతవ్రతమాచరింతురో యెవ్వరెవ్వరు నీభార్యయగు శీలయొక్క చరిత్రమును జదువుదురో వారెల్లరును నీవుపొందునట్టి సౌఖ్యముసముక్తిని బొందఁగలరు." ఈమాటలువిని కౌండిన్యుఁడు ధన్యోస్మియని దేవుని నానావిధముల స్తోత్రముచేసి యాదేవునిట్లు ప్రశ్నించెను.

"దేవా! నేను గొన్నిదృశ్యములజూచితిని. అవన్నియు నేల యిట్లయ్యెనో సెలవీయవలయును."

అనంతుడు:—నీవు జూచిన మామిడిచెట్టు పూర్వజన్మమున బ్రాహ్మణుఁడై యుండెను. అతఁడు తనశిష్యులకు వేదముల బోధింపనందున చెడలకాహారమగు చెట్టుగాఁ బుట్టినాడు. ఆవు భూదేవతగా నుండెను. ఆమె నేను సృష్టించిన యోషధులను భ్రమింగినందున జంతువైపుట్టినది. చెరువులు బ్రాహ్మణకన్యకలు. వారు దానముల నెవ్వరికి నీయ

కుండ నన్నియుఁ దామేయనహరించు చుండినందున చెరువు లైరి. గాడిద కోపముయొక్క పరిణామము. ఏనుగు అహంకారము.” ఇట్లుచెప్పి యనంతుఁడదృశ్యుడయ్యెను.

కౌండన్యుఁ డింటికేగి దేవుఁడానతిచ్చినట్టుల పదునాల్గు సంవత్సరములు వ్రతమాచరించి సంపదలబొందెను. కాని యీకాలమందే భక్తుడైన నొక్క సంవత్సర మీవ్రతమాచరించిన నభీష్టములఁ బొందును. అని శ్రీకృష్ణుడు ధర్మజునికి బోధించెను.”

ఇదే భవిష్యత్పురాణ మందీ వ్రతమును త్రయోదశితో కూడిన చతుర్దశినాఁ డాచరించిననది నిష్ఫలమగుటయేగాక యా సంవత్సర మాచరించిన పుణ్యమంతయు నశించుననియు, కావున పూర్ణిమతో కూడిన చతుర్దశినాడే యీ వ్రతమును జేయవలయు ననియు నాదేశింపబడి యున్నది.



# రథసప్తమి



రథసప్తమీ వ్రతము మాఘ శుక్ల సప్తమీ దినమున జేయఁబడును. ఈ వ్రతము సూర్యు నుద్దేశించి చేయఁబడు చున్నది. సూర్యమాహాత్మ్యము ను గుఱించి సూర్యపూజా విధానమును గుఱించియు భవిష్యత్పురాణ మందనేకాధ్యాయములు వ్రాయఁ బడియున్నవి. రథసప్తమీ విషయము గూర్చి విశేషముగా వర్ణింప బడియున్నది. ఈ వ్రతము ను హిందువులందన్ని వర్ణముల వారు చేయుదురు. ఇది కేవలము బ్రాహ్మణులకే ప్రాముఖ్యమైనది. అయినను పురాణములందు రాజుల నుద్దేశించి చెప్పిన కథలందీ వ్రతమునాడు బ్రాహ్మణులకు బంగారు మొదలుగాని ధాన్యవస్త్రముల వఱకు దానమియ్య వలసిన దిగాఁ జెప్పఁబడి నందున వారి యుద్దేశమున నితర వర్ణముల కును నీ వ్రత ముపకరించుటకేయని భావింప వలెను.

శ్రీకృష్ణ పరమాత్ముల నొక పరియుధిష్ఠురుల వారు రథసప్తమీ వ్రతమునెట్లు చేయవలెను? ఎందులకు చేయ వలెను? దానవేమి ఫలము? అని ప్రశ్నింపగా కృష్ణభగవాను లిట్లు సెలవిచ్చిరట:—

## కథ

పూర్వము కాంబోజ దేశమందు యశోవర్మయను రాజుండెను. అతనికి ముసలి ముప్పునకు సర్వవ్యాధియుతుఁడైన కొడుకొకఁడు జన్మించెను. బ్రాహ్మణులఁ బిలిపించి యా రాజు దానికారణ మడిగెను. ఆ త్రికాలవేదు లిట్లనిరి. "రాజా! వీడు పూర్వజన్మములో లుబ్ధాగ్రేసర చక్రవర్తియైన కోమటి. వీడు రథసప్తమీ వ్రతము చేయుచుండఁ జూచి దరిసించెను. అదర్శనమాత్రా ఫలితముగా వీడు మీకుఁ బుత్రుఁడై జన్మించెను. వాని కాజన్మమున సంపద లశేషముగా నుండియు నాదినమున చిల్లిగవ్వఁ గూడ దానము చేసినవాడు కానందున నీ వ్యాధిని వెంటఁదెచ్చుకొనినాడు." రాజీ మాట విని యిట్లనెను. "ఓ భూసురులారా! వీని రోగమును బోగొట్టను పాయమేమో సెలవిండు." మరల త్రికాలవేదులు గణించి గుణించి తుదకిట్లు తమ యభిప్రాయమును భూపతికి విన్నవించిరి. "ఏ వ్రతదర్శనముచేత వీనికీయఖండ వైభవము కలిగినదో, ఏ కార్పణ్యముచే వీనికీ జాడ్యము సంభవించినదో యా వ్రతమునే చేసి వ్రతానుష్ఠాన కాలమందు షోడశ మహా దానములు చేసిన జాడ్యము కుదిరి పోవును. ఈ రథసప్తమీ వ్రతము నెవ్వారు భక్తిశ్రద్ధా సమన్వితులై యాచరింతురో వారు చక్రవర్తిత్వమును బొందుటలో నేమియు సందేహము లేదు. కావున నావిధానమును వివరించెదము వినుడు.

మాఘ శుక్లషష్ఠీ దివసమున నదీకూప తటాకాదులందు బరిశుద్ధ జలమునఁ దిలపిష్టముతో శరీరమును శుద్ధుఁ జేసికొని స్నానముచేయ వలయును. పిమ్మట సూర్యాలయమునకుఁ బోయి భక్తి పూర్వకముగా మార్తాండ భగవానునికి నమస్కరించి పుష్ప ధూపాదులచే సమ్యగారాధన చేయవలెను. పిమ్మట నింటికివచ్చి పంచయజ్ఞములుచేసి సర్వజ్ఞులైన బ్రాహ్మణులను బిలిపించి వారిని బూజింప వలెను. సప్తమీ దివసమునఁ బ్రాతఃకాలమున మేల్కాంచి స్నానముచేసి కింకిణీజాలముతోఁ గూడిన రథము నొకదానిని సిద్ధము చేయించ వలెను. రథమును గుఱ్ఱములను సూతుని వీనినన్నిటిని బంగారుతో గాని చేతఁగాని వారు వెండితోనైనను జేయించవలెను. ఆ రథమును వస్త్రముతోఁ గట్టిన మంటపమం దుంచవలెను. ఆరథమున బంగరుతోఁ జేసిన సూర్యవిగ్రహము నునిచి మంత్రోక్తముగాఁ బూజలొనర్ప వలెను. నానావిధ ఫలములు భక్ష్యభోజ్యములు వీనితో దేవునికి నైవేద్య మొసంగ వలెను. ఈ ప్రకారముగాఁ బూజించి రాత్రికాలమందు జాగారము చేయవలెను. ఈ ప్రకారము రాత్రియంతయుఁ గనుఱెప్ప వాల్పక భక్తియుక్తుఁడై పూజచేసి ప్రాతఃకాలమున స్నాన మాచరించి బ్రాహ్మణులను ధనధాన్యాన్న వస్త్ర భూషణములచేఁ దృప్తిపఱప వలెను. రథమును గూడ గురవులగు బ్రాహ్మణులకిచ్చి వేయవలయును.

ఈ ప్రకారము రథసప్తమీ వ్రతమాచరించిన సర్వరోగ విముక్తి కలుగుటయే కాక పుత్రపౌత్రాభి వృద్ధి కలిగి సూర్య లోకమును బొంది యచ్చట నొక కల్పకాలము వసియించి పిమ్మట భూలోకమున నవతరించి సర్వ సర్వంసహా చక్రవర్తియై మానవుడు సౌఖ్యమనుభవింపగలడు.

## విమర్శ

ఇది సూర్య సంబంధమైనది. ప్రాచీన కాలమున—వేదకాలమునుండి బహుకాలము వఱకు—ఆర్యులలో ప్రకృత్యారాధన చాల ప్రాముఖ్యత వహించి యుండెను. ప్రకృతిలో నెల్లను సూర్య మండలము ప్రధానమైనది. అందుచేత సూర్య గ్రహారాధనము చాల ప్రాముఖ్యత వహించి యుండెను. అనేక ప్రాంతములలో సూర్యాలయము లుండెను కాని శైవ వైష్ణవ సాంప్రదాయములు ముదిరిన కొలది సూర్యారాధనము మాసిపోవుచు వచ్చెను. ఈ రథసప్తమీ వ్రతము ప్రాచీన సూర్యారాధనము యొక్క నిదర్శనము.

ఈ సూర్యుని రథమేకచక్ర యుతము. అందు సూర్యుడు కూర్చునను ఆ నేకచక్రమే మనకగుపడు సూర్యబింబమని భావింప వలెను. సూర్యుడనుదిన మారథమందాకాశమున సంచరించునని చెప్పుదురు. యథార్థముగా సూర్యుడు పూర్వపశ్చిమ మార్గమున సంచరింపడు. భూమియే సూర్యు

ి చుట్టివచ్చుటచేత మనకీ భ్రమకలుగు చున్నది. సూర్యుని థము నీడ్చు గుఱ్ఱము లేడని చెప్పుదురు. ఈ సప్తసంఖ్య కా? ఏడుదినములు కలవారమును సూచించునేమొ. ఏడ సంఖ్య కలదివసమందే యీవ్రత మాచరించుట కేర్పాటు చేయుటకూడ గమనింపదగి యున్నది. సూర్యుని బూజించు శ్లోకములో "సప్తలోక ప్రదీపన"యని యుండుటయు గమ నింప దగినది.



# నవరాత్రులు



నవరాత్రులను దేవీ నవరాత్రులని కూడ వ్యవహరింతురు. ఏలయన నీనవరాత్రులలో దేవీపూజలు గావింపఁబడును. ఈపూజలు ఆశ్వయుజ శుక్లపక్ష పాడ్యమినుండి నవమివరకు జరుగుచుండును. నవరాత్రులు అనగా దొమ్మిది రాత్రులు. పార్వతీ దేవియొక్క యవతారములు పదియవతారములనియు నొక్కొక్కయవతారమందు దేవిరాక్షసాదులను జంపి ప్రపంచమును రక్షించెననియుఁ జెప్పెదురు. మార్కండేయ పురాణమందు దేవీ మాహాత్మ్య ఘట్టమునందీ విషయముల కథనములు కలవు.

మధుకైటభులను రాక్షసులు విష్ణువుయొక్క చెవిలోని మురికినుండి యుద్భవించిరట. వీరు ప్రపంచమునకుఁ గంటకులుకాగా వారితో విష్ణువు ౫౦౦౦ యేండ్లుయుద్ధము చేసియు నోడింపఁజాలక యలసిపోయెనట! అప్పుడు మధుకైటభులు మహా మాయయొక్క మాయకులోనై దర్పోద్ధతులై కన్నుగానక విష్ణువుతమతో నింతకాలము పోరినందులకు వరమును గుమని విష్ణువునే కోరిరఁట. విష్ణువువారి చావును గోరనఁట. ఇట్లు వంచితులై వారుచచ్చిరట!!

మాయాదేవి వల్లనిది, పదితలలు పదికాళ్లు కలదిగానుండుటచే నామెను మహాకాళియనబిలుతురు.

మాయాదేవి రెండవ యవతారములో మహిషా
సురుని జంపెను. ఈమహిషాసురుడు ఇంద్రునిజయింపగా దేవ
తలెల్ల యీశ్వరుని ప్రార్థింప నాతని కోపాగ్నినుండి యీయ
వతారము వచ్చెనట. ఈమహిషాసురమర్దని సింహవాహ
నారూఢయై మహిషాసురుని జంపెను.

మూడవ యవతారమందు శుంభనిశుంభులు సహాయిం
చిరి. పార్వతీదేవి గంగాస్నానము చేయఁబోవుతరి యా
మె శరీరమునుండి యేక సుందరి యవతారమెత్తెను. శుంభు
డామెను జూచి మోహించి తన్ను పెండ్లియాడుమని రాయ
బారము పంపెను. కాని విఫలీకృతుడయ్యెను. అప్పుడీ సోదరులు
చండ, ముండయను వీరుల వెంట సైన్యమునిచ్చి యామెపై
యుద్ధమున కంపిరి. వీరిద్దఱ నాయమ చంపి వారి తలలు దేవి
కడకు గొనిపోవ దేవి సంతోషించి యాచండ, ముండల
వధయందున నామెకు చాముండయని బిరుదమిచ్చెను. పిమ్మ
ట శుంభనిశుంభులు రక్తబీజుఁడను వానితో సహా యుద్ధము
నకు వచ్చిరి. రక్తబీజుని శరీరమునుండి యెన్ని రక్తబిందువులు
భూమిపై బడునో యందఱు రాక్షసులుద్భవించుచుండిరి. అప్పు
డు కాళీదేవి వాని శరీరమునుండి రక్తబిందువులు పడన
ీయక వాని రక్తమును ద్రావెను. దేవి వానిని సునాయాస
ముగా జంపెను. ఇది మూడవ యవతారము.

ఇఁక నాల్గవ యవతారమందు దేవి నందుని పుత్రికగా జన్మించెను. కంసుఁడా శిశువును రాతిపై మొత్త నామెయదృశ్యమై కంసుని వధించువాఁడు క్షేమముగానున్న వాఁడని చెప్పిపోయెను.

అయిదవ యవతారమందీ దేవి యొక రాక్షసిని త దంతముతో జీల్చినందున నీమెకు రక్తదంతియను పేరున్నది.

ఆరవ యవతారమున ననేక సంవత్సరములనుండి లోకమందు క్షామము సంభవించి ప్రజలు మలమల మాడుచుండ దేవి వారిని సంరక్షించినందున యీమెను శాకాంబరియని పిలుతురు.

ఏడవ యవతారమందు దుర్గుడను రాక్షసినిచంపినందున నీమెను దుర్గయని పిలుతురు. ఎనిమిదవ యవతారమందు మాతంగి గాను తొమ్మిదవ యవతారమందు భ్రమరి గాను నీదేవి యవతార మెత్తెను.

నవరాత్రులలో సాధారణముగా దేవీభక్తు లుపవాసవ్రతములు సలుపు చుందురు. కొందరు దేవికి జంతుబలుల నిచ్చెదరు. మఱికొందరు కన్యక నొకదానిని దెచ్చి పూజింతురు.

భవిష్యత్పురాణమున నీరాత్రులకు "మహానవమి" యని యున్నది. ఆదీ దివసములు పార్వతీదేవి యవతారముగ ముండీ దేవికి జాల ప్రియములని వర్ణించియున్నారు. పార్వతికి తొమ్మిది యవతారముల కథలు పైన పేర్కొన బడినవి

గానిందులేవు. ఇందొక్క విశేష మేమన నీదినములలోశస్త్రా స్త్రములను బూజింపవలెననియు, గజహయాది వర్గముతోను, భటులతోను, దేవిని పల్లకిలోనుంచి యూరేగింపు కడపటి నాడు చేయవలయుననియు నిందు వర్ణింపఁబడి యున్నది.

ఈనవరాత్రులు శాక్తులకు శైవులకు ప్రధానమగు నుత్సవ కాలములు.



# అక్షయతృతీయ.



ఈ పండుగ ప్రతి వైశాఖ శుక్ల తృతీయ నాడు వచ్చును. భవిష్యోత్తర భాగమందిట్లున్నది. ఈ అక్షయ తృతీయ కృతయుగారంభ దివసముగా నున్నది. ఈ దినమందెవ్వరు దానములిచ్చెదరో వారు సంపదలతో నుండెదరు. పూర్వమొక కోమటి ధర్మనాముడు చాల దరిద్రుడు. వాని భార్య వలదన్నను వినక తనకున్న దానిలో మరల యితరులకు దానము చేయుచుండెడివాడు. కొంతకాలమునకు వీడు చనిపోయి మరల క్షత్రియుడై జన్మించెను. అప్పుడును నిత్యాన్నదానము, జప హోమములను జేయుచు దనకున్న దంతయు వ్యయము చేయదొడంగెను. కాని యాతని ద్రవ్యము తరుగుటకు మారుగ ,, అక్షయము ,, గానుండెను. కావున నీ పండుగనాడు చేసిన దానము వలన అక్షయ సంపదలు కలుగుటచే నీ పండుగను అక్షయ తృతీయయని పిలచిరి.

ఈ దినమునాడు బ్రాహ్మణులకు ఛత్రము చెప్పులు దానము చేసిన పితృవులు తృప్తిచెందుదురు. ఇది భవిష్యత్పురాణకథ. ఈ తృతీయనాడె పరశురాముడు జన్మించెనందురు.

“అస్యామేవ తృతీయాయాం పరశురామో జాతః। పరశురామ జయంతీత్యుచ్యతే;

తృతీయనాడె పరశు రాముడు జన్మించుటచే దీనిని పరశు రామ జయంతియనియు చెప్పుదురు.

బ్రహ్మపురాణ మిట్లనుచున్నది

శ్లో॥ వైశాఖేతృతీయాయాం శుక్లాయాంతుజనార్దనః
బ్రహ్మలోకాత్త్రిపథగాత్ పృథివ్యామవతారయత్
ఏవముత్పాదయ మాస రామమధ్యందినే సతి
ప్రోక్తాపరశురామస్య జయంతీతిచ సూరిభిః

ఈవైశాఖ శుక్ల తృతీయయందు మధ్యాహ్నకాలమందు బ్రహ్మలోకమునుండి సాక్షాత్పరమేశ్వరుడే యవతారమెత్తెను. శాస్త్ర పండితులు దీనిని పరశురామ జయంతియని చెప్పుదురు. ఈతిథిప్రభావమును గూర్చిభవిష్యత్పురాణ మిట్లున్నది.

శ్లో॥ అస్యాంతిథౌ క్షయముపైతి హుతంనదత్తం। తేనాక్షయా
చ మునిభిః కథితాతృతీయా। ఉద్దిశ్యయత్సురపితౄన్
క్రియతేమనుష్యైః। తచ్చాక్షయం భవతి భారతసర్వ
మేవ॥

ఈతిథినాడు దేవతలను గురించి పితృలను గురించియు జేసిన పూజ అక్షయముగా నుండును.



# గణేశచతుర్థి.



గణపతి, వినాయక, విఘ్నేశ్వర, గణేశమున్నగు పేర్లతో నొప్పు నీ దేవునిపూజ ప్రతి సంవత్సరము భాద్రపద శుద్ధ చతుర్థినాఁడు జరుపఁబడును. ఈ విఘ్నేశ్వరుఁడు పౌరాణిక కాలమందుఁ జాల ప్రాముఖ్యతకు వచ్చెను. హిందువుల ప్రతిశుభకార్యమునకు ముందు విఘ్నేశ్వరుని పూజ జరుపుటయాచారమైనది. ఈ విఘ్నేశ్వరునికి నింతటి ప్రాముఖ్యతకలుగుట యేకారణముననో యూహింప శక్యముగాదు.

పౌరాణికము:— ఈ విఘ్నేశ్వరుని యుత్పత్తి విషయమై యీ ప్రకారముగాఁ జెప్పెదరు. శివుఁ డొకనాఁడు వేటాడుటకై వెడలెను. పార్వతి యింట స్నానము చేయుటకై సిద్ధమగుచు ద్వారము దగ్గఱ కావలియుంచుటకై యొక మంటివిగ్రహమును జేసి దానికి జీవము కల్పించి స్నానము గదిలోనికి ఎవ్వరిని రానియ్యకుమని యాజీవపు బొమ్మకు జెప్పి తాను స్నానము జేయఁబోయెను. ఇంతలో శివుఁడు వేటనుండి తిరిగివచ్చి లోపలఁబో బ్రయత్నింపఁగ నీ విఘ్నేశ్వరుఁడు నివారించెను. శివునికి కోపము వచ్చి తలనఱికి లోపలికేగెను. పార్వతి యీసమాచారమును విని తన సృష్టించిన కుమారుని మరల పునర్జీవుని జేయుమని పట్టుపట్టెను. శివుఁడు తాను

క తలను మరల మొండెమున కతికింప నెంచి చూడగా తల కనఁబడక పోయెను. అప్పుడు సమీపమునసుండినయే నుగుతలను కోసియా మొండెమున కతికించి జీవమువచ్చునట్లు జేసెను. ఈయేనుగు తలగలదేవుని విఘ్నేశ్వరుడని వ్యవహరింతురు. ఇట్లు వికారముఁగా నొనరించిన కారణము చేతనే దానికి ప్రత్యామ్నాయముగా నీవిఘ్నేశ్వరుని కగ్రపూజ జరుగునట్లేర్పాటు చేసియుందురు. కొంతకాలమునకీ దేవుఁడు విద్యలకుఁగూడ నధిపతియయ్యెను.

నామములు:—భాద్రపద శుద్ధ చతుర్థినాడు విఘ్నేశ్వరుని విగ్రహమొకటి మట్టితోఁజేసి పూజింతురు. ఈవినాయకునికి వాహనము ఎలుక. కావుననే యితనిని మూషకవాహనయనియందురు. ఇతనికొకేదంతము. కావుననే యేకదంతాయని సంబోధింతురు. ఇతనికడుపు పెద్దది. తిండికాడు. కావుననే లంబోదరాయందురు. చెవులు చేటల వంటివి. కావుననే శూర్పకర్ణాయని వ్యవహరింతురు. సర్వసిద్ధులనుగలిగించు వాడని యితని సర్వసిద్ధిప్రదాయకుఁడని వ్యవహరింతురు. ఈప్రకారముగా దేవునికి సహస్ర నామములున్నవని యందురు.

పూజావిధి:— ప్రతిగృహమందును శుద్ధచతుర్థినాఁడు వినాయకుని ప్రాతఃకాలమందు మంత్రపూర్వకముగాఁ బూజింతురు. వినాయకుని నానావిధములగు పత్రపుష్ప ఫలములతో బూజిం

తురు. భాద్రపద మాసమునకు కేయోఫలానేకములు పండ్లు యన్నియు సమర్పింతురు. కొన్ని యిందుదహరించుచు న్నాను.

శ్లో॥ కరవీరైర్జాతికుసుమై శ్చంపకై ర్బకులై శ్శుభైః శతపత్రై శ్చకల్హారై ర్చయేద్గణ నాయకం॥

మాలతీ పత్రము. భృంగరాజపత్రము బిల్వపత్రము, బదరి శమీపత్రము అపామార్గపత్రము బృహతీపత్రము, కరవీరము అర్కము విష్ణుక్రాంత, దానిమ్మయాకులు. పంధు దేవదారు అశ్వత్థము, మొగలిపువ్వులు మున్నగు పత్రములు పండ్లు పుష్పములు వీనిచే నీవిఘ్నేశ్వరుని పూజింతురు.

వినాయకునకి కుడుములు యిష్టము కావునసే,

శ్లో॥ నానాఖాద్యాన్వితందివ్యం తుష్ట్యర్థం తే నివేదితం
ఏకవింశతిసంఖ్యాకాన్ మోదకాన్ఘృతపాచితాన్
నైవేద్యరసఫలం దద్యాం నమస్తేవిఘ్ననాశినే॥

౨౧ కుడుములు నేతితో చేసి నట్టివి లెక్క పెట్టి వీటి నైవేద్యముగా నిడవలయునంట. వినాయకుని దగ్గర నేతి దీపము వెలిగించియుంచుదురు. ఇది యారిపోనట్లుగా మరువాటి వటకుంచుదురు. మూడుదివసము సాయంకాల మీవినాయ కుని మట్టిప్రతిమను బావిలో లేక నదిలో వేయుదురు.

ఈ విఘ్నేశ్వరునిపై సర్వాభీష్టముల నొసంగువాడని యందఱును నీవ్రతమాచరింతురు. వ్రతచూడామణి యందీ వ్రతమునే గురించి యిట్లు వ్రాయబడినది.

నైమిశారణ్యమున శౌనకాది మునులు సర్వకార్య-
సిద్ధులు నిర్విఘ్నముగా నడచు మార్గమెద్దియని సూతుని
విచారింపగా నాతఁడిట్లని చెప్పందొడఁగెను. పూర్వము కురు
పాండవ సేనలు యుద్ధము జేయఁగడంగి నప్పుడు యుధిష్ఠిరుఁడు
శ్రీకృష్ణునితో దాను జయమందుటకు మార్గమెద్దియని విచా-
రించెను. అందులకు శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెను. "నీవు గణాధ్య-
క్షుఁడగు గణపతిని బూజింపుము. నీ రాజ్యము నీకు లభింపగ-
లదు."

యుధిష్ఠిరుఁడు—ఆపూజయెట్లు.

కృష్ణ— భాద్రపద శుక్ల చతుర్థి మధ్యాహ్నమందు-
లేక శ్రావణమాస మందుగాని మార్గశీర్ష మాసమందుగాని
వినాయకుని మంత్రయుక్తముగాఁ బూజించి యతనికి నైవే-
ద్యము సమర్పింపవలయును. ఆ దినము బ్రాహ్మణులకెంత
దక్షిణ యిచ్చిన యంత పదియంతలు మరల యిచ్చినదానికి
సమకూరును.

చంద్ర దర్శన దోషము:—

ఈ చతుర్థినాడు చంద్రునిజూచిన వారికొక సంవత్స-
రపర్యంతము లేని పోని యపవాదములు కలుగుచుండునని
పురాణములు చెప్పుచున్నవి. ఈ దోష పరిహారార్థమై-
యీ క్రింది మంత్రము నుచ్చరించ వలయునట.

"సింహః ప్రసేన మవధీ త్సింహో జాంబవతా హతః । సుకు-
మారక మారోదీ స్తవ హ్యేష స్యమంతకః ॥"

ఈ మంత్రమును జదువుటయే కాక స్యమంతకోపాఖ్యానమును గూడ వినవలయును. చంద్ర దర్శన దోషము నకుఁ గారణమిట్లు చెప్పుదురు. విఘ్నేశ్వరుఁడు దన్నుబాజించిన బ్రహ్మాదివరము లొసఁగి మూషకముపై స్వారిచేయుచు చంద్రలోకమును జేరుతఱి తట్టుక పడెను అది చూచి తన సౌందర్యమునకు గర్వించిన చంద్రుడు పక్కున నవ్వ వినాయకునికిఁ బట్టరాని కోపమువచ్చి "ఓరి చంద్రా నీముఖమును జూచిన వారెవరును మిథ్యాపవాదములకు లోనగుదురు గాక" యని శపించెను. చంద్రుడు భయభ్రాంతుడై సముద్రమున దాగెను. లోక మంధకార బంధురమయ్యెను. దేవతలు తల్లడిల్లిరి. అప్పుడు త్రిమూర్త్యాదు లందఱును జేరి చంద్రునికి వినాయకుని పూజించు విధానమునేర్పి వినాయకుని ప్రసన్నునిగా జేసిరి. వినాయకు డప్పుడు శాపము కేవలము భాద్రపద శుద్ధ చతుర్థి దినము నాటికి మాత్రమే వినియోగ మగునని సెలవిచ్చెను. ఆనాడు పొరపాటులో చూచిన వారికి నపహితము విముక్తిమెట్లని ప్రార్థింపగా నాదినము వినాయకుని బూజించి బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చి స్యమంతకోపాఖ్యానము జదువు వారి కేయపవాదములునుండవని చెప్పెనట.

స్యమంతకోపాఖ్యానము.—

ఈ కథ భాగవతమందును స్కాంద పురాణమందును నున్నది. దీనినే యిచ్చట సంగ్రహముగా సూచింతును

శ్రీకృష్ణుడు ద్వారకలో రాజ్యము చేయుచుండగా వందొక యాదవు డుగ్రసేనుడను వాడుండెను ఆతనికి సత్రాజిత్తు, ప్రసేనుడనునిరువురు కుమారులుండిరి. అందుసత్రాజిత్తు సూర్యసంబద్ధ లోచనుడై సూర్యభగవాను నారాధింప నాదేవుడతనికి ప్రత్యక్షుడై వరమును గోరుమనెను.

సత్రాజిత్తు శ్యమంతకమణి నిమ్మని గోరెను. సూర్యదేవిథముగ నామణినిచ్చుచు నిట్లు చెప్పెను. "ఈ మణియు సాధారణమైనది. ప్రతి దినము ను నిది తన తూకమంత మొనిదంతల బంగారము నిచ్చుచుండును. ఎవ్వడు నిర్మలుడో వ్వాడు సన్మార్గుడో వాడే దీని ధరింప గలడు. పాతకియైన వాడు దీనిని ముట్టెనేని వెంటనే నశించును." సత్రాజిత్తామణిని ధరించుకొని ద్వారకకు రాగా పౌరులందఱు దాని కాంతి జూచి సూర్యుడే సమీపించనేమోయని భ్రమించిరి. సత్రాజిత్తు శ్రీకృష్ణుని దర్శనార్థమై యరుగగా శ్రీకృష్ణుడా మణిని జాల ప్రశంసించెను. అంతట శ్రీకృష్ణుడెన్నడైన దానిని తన వద్దినుండి యపహరించుననిసత్రాజిత్తు భయపడి తన తమ్ముడగు ప్రసేనునికి దాని నిచ్చెను. ప్రసేనుడును శ్రీకృష్ణుడును నొకనాడు వేటకరిగిరి. అనంతరము శ్రీకృష్ణుడు మాత్రము తిరిగి వచ్చెను. ప్రసేనుడు రాలేదు. శ్రీకృష్ణుడు నా తమ్ముని సంహరించి మణినపహరించెనని సత్రాజిత్తు నిందచేయ దొడగెను. జనులు గుసగుసలాడజొచ్చిరి. శ్రీకృష్ణుడు చాల నొచ్చుకొని అడవిలో ప్రసేనుని వెదక

ఈ మంత్రమును జదువుటయే కాక స్యమంతకోపాఖ్యానమును గూడ వినవలయును. చంద్ర దర్శన దోషము నకీ కారణమిట్లు చెప్పుదురు. విఘ్నేశ్వరుడు దన్ను బూజించిన బ్రహ్మాదివరము లోనగి మూషకముపై స్వారిచేయుచు చంద్రలోకమును జేరులేటి తట్టుక పడెను అది చూచి తన సౌందర్యమునకు గర్వించిన చంద్రుడు పక్కున నవ్వ వినాయకునికి బట్టరాని కోపమువచ్చి "ఓరి చంద్రా నీముఖమును జూచిన వారందరును మిథ్యాపవాదములకు లోనగుదురు గాక" యని శపించెను. చంద్రుడు భయభ్రాంతుడై సముద్రమున దాగెను. లోక మంధకార బంధురమయ్యెను. దేవతలు తల్లడిల్లిరి. అప్పుడు త్రిమూర్త్యాదు లందఱును జేరి చంద్రునికి వినాయకుని పూజించు విధానమునేర్పి వినాయకుని ప్రసన్నునిగా జేసిరి. వినాయకు డప్పుడు శాపము కేవలము భాద్రపద శుద్ధ చతుర్థి దినము నాటికి మాత్రమే వినియోగ పడునని సెలవిచ్చెను. ఆనాడు పొరపాటులో చూచిన వారికి సహితము విముక్తి యెట్లని ప్రార్థింపగా నాదినము వినాయకుని బూజించి బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చి స్యమంతకోపాఖ్యానము జదువు వారి కేయపవాదములునుండవని చెప్పెనట.

స్యమంతకోపాఖ్యానము. —

ఈ కథ భాగవతమందును స్కాంద పురాణమందును నున్నది. దీనినే యిచ్చట సంగ్రహముగా సూచింతును

శ్రీకృష్ణుడు ద్వారకలో రాజ్యము చేయుచుండగా నందొక యాదవు డుగ్రసేనుడను వాడుండెను ఆతనికి సత్రాజిత్తు, ప్రసేనుడనునిరువురు కుమారులుండిరి. అందుసత్రాజిత్తు సూర్యసంబద్ధ లోచనుడై సూర్యభగవాను నారాధింపగా దేవుడతనికి ప్రత్యక్షమై వరమును గోరుమనెను.

సత్రాజిత్తు శ్యమంతకమణి నిమ్మని గోరెను. సూర్యుడేవిధముగ నామణినిచ్చుచు నిట్లు చెప్పెను. "ఈ మణియసాధారణమైనది. ప్రతి దినము నది తన తూకమంత యెనిమిదంతల బంగారము నిచ్చుచుండును. ఎవ్వడు నిర్మలుడో ఎవ్వడు సన్మార్గుడో వాడే దీని ధరింప గలడు. పాతకియైనవాడు దీనిని ముట్టెనేని వెంటనే నశించును." సత్రాజిత్తామణిని ధరించుకొని ద్వారకకు రాగా పౌరులందఱు దాని కాంతి జూచి సూర్యుడే సమీపించెనేమోయని భ్రమించిరి. సత్రాజిత్తు శ్రీకృష్ణుని దర్శనార్థమై యరుగగా శ్రీకృష్ణుడామణిని జాల ప్రశంసించెను. అంతట శ్రీకృష్ణుడెన్నడైన దానిని తన వద్దనుండి యపహరించునని సత్రాజిత్తు భయపడి తన తమ్ముడగు ప్రసేనునికి దాని నిచ్చెను. ప్రసేనుడును శ్రీకృష్ణుడును నొకనాడు వేటకరిగిరి. అనంతరము శ్రీకృష్ణుడు మాత్రము తిరిగి వచ్చెను. ప్రసేనుడు రాలేదు. శ్రీకృష్ణుడు తన తమ్ముని సంహరించి మణినపహరించెనని సత్రాజిత్తు నిందచేయ దొడగెను. జనులు గుసగుసలాడజొచ్చిరి. శ్రీకృష్ణుడు చాల నొచ్చుకొని అడవిలో ప్రసేనుని వెదక

పోయెను. ఒకచో ప్రసేనుడు చచ్చిపడినది జూచి యొ
సింహము వీనిని జంపిన జాడవలన గుర్తెఱింగి యాసింగపు
జాడల వెంటనే పోయెను. కొంత వడికి సింహశవమును గాం
చెను. ఆ సింహ మొక యెలుగు బంటుచే జంపబడి యుండెను.
ఎలుగు జాడలను బట్టి పోవంబోవ నొక మహాగుహ యెదు
రయ్యెను. ఆగుహ ౧౦౦ మైళ్ల పొడవై యుండెను. అందొ
మేడయుండెను. ఆమేడలో నొక శిశువు నిద్రించుచుండెను.
ఆశిశువు జాంబవంతుని కుమారుడు. ఆశిశువు యొ
ఉయ్యాలపై శ్యమంతకమణి కట్టబడియుండెను. ఆయుయ్యా
నొక సుందరాంగి యూచుచుండెను. ఆకన్యక జాంబవంతు
కూతురు. ఈ కూతురిట్లు పాడుచుండెను.

ప్రసేనుని సింహము చంపెను. సింహమును జాంబవం
తుడు చంపెను. కావున నీమణి నీదే. ఓ బాలక యేడ
వద్దు." శ్రీకృష్ణుడుయ్యాల సమీపింపగా బాలిక జా
మోహించి కృష్ణునితో నీమణి తీసికొని తనతండ్రి మేల్కొ
కు లోపల పొమ్మని చెప్పెను. కృష్ణుడు నవ్వి తన శంఖ
మును బూరించి జాంబవంతుని యుద్ధమునకుఁ బిలచెను. ఇద్ద
కిని యుద్ధము ౨౭ దినముల వఱకు జరిగెను. కృష్ణుని
వెంటవచ్చిన పరివారము గుహవెలుపల వారము దినము
నిరీక్షించి కృష్ణుఁడు రామినాతఁడందే మృతించెనని చెప్పి
యుంచి నగరమునకుఁబోయి యావార్త తెలిపి యౌ
పాంత్యకర్మల సహితము చేయించిరి. అప్పుడు గుహ

జాంబవంతుడు శ్రీకృష్ణునితో ఘోరముగఁబోరి తుదకోడి
పోయి యాశ్యమంతకమణితోఁ గూడ తన కూతురు జాంబ
వతిని శ్రీకృష్ణునకిచ్చి గౌరవించెను.
శ్రీకృష్ణుడు ద్వారకకు వచ్చి సభఁజేసి యందఱియెదుట
మణియొక్క వృత్తాంతమును జెప్పి సత్రాజిత్తునకు దాని నిచ్చె
ను. సత్రాజిత్తు కూడ దానన్యాయముగా కృష్ణుని నిందించి
నందులకు సిగ్గుపడి తనకూతురగు సత్యభామను శ్రీకృష్ణునికిచ్చి
పెండ్లిచేసెను.

పాపము సత్రాజిత్తు మాత్రము మణి మూలమున
మృతినొందెను. శతధన్వుడనువాడామణి నపహరించి సత్రా
జిత్తుఁ జంపెను. పిమ్మట శ్రీకృష్ణుని భీతిచే నామణిని అక్రూ
రునకు వానికిచ్చి ద్వారక నుండి పారిపోయెను. కృష్ణుడును బల
రాముడును వానిని వెన్నంటి చంపిరి కాని మణిమాత్రము
కానలేదు. మరల కృష్ణుఁడు దాని నపహరించె ననునట్టి యాప
వాదమునకు పాలయ్యెను.

అక్రూరు డామణిని దీసికొని కాశిలో దాని నుండి
వచ్చు బంగారముచే దినదినము దానములు చేయుచుండెను.
ఇట శ్రీకృష్ణుడు మణిదొరుకనందున చాలవిచారము
నొందుచుండెను. ఇట్లుండ నొకనాడు నారదుడు
శ్రీకృష్ణుని సందర్శించి వారి పరితాపమునను, గారణ
మును తెలిసికొని భాద్రపదశుద్ధ చతుర్థినాడు చంద్రుని శ్రీకృ
ష్ణుడు చూచియుండినందున నాయపవాదములు కలిగెనని

చెప్పి యాచంద్రదర్శన దోష సంబంధ కథనంతయుఁ దెలి
వినాయకుని పూజచేయుటకై బోధించెను. శ్రీకృష్ణుడట్ల
విధమాచరించి యపవాదమునుండి విముక్తుడయ్యెను. ఇది
శ్యమంతకమణి వృత్తాంతము.

ఈ విఘ్నేశ్వరుఁడు సత్యవినాయక నామము చే
గూడఁ గొందఱిచే పూజింపఁబడుచున్నాడు. దీనిని గుఱించి బ్ర
హ్మాండ పురాణములో వ్రాయఁబడి యున్నది. అందు కుచేలు
డు కడుదరిద్రుడై శ్రీకృష్ణుని జూడఁబోవ శ్రీకృష్ణుఁడతనికి
సత్యవినాయక పూజసేయుమని బోధించెననియు నటుల్లచే
ధనాధికుఁడయ్యెననియుఁ జెప్పబడియున్నది. భాగవతములో
నికుచేలుకథ నించుక మార్చి పెంచియిందు వ్రాయబడియున్న
ది. ఈకథను బూర్ణముగ చదువగోరువారు బ్రహ్మాండ పురాణ
మును జూడఁగలరు.

విశేషాంశములు.

ఈ వినాయకుని నిజమగు తత్వమేమో యూహింప
జాలము. సాధారణముగ ఇంద్రాది దేవత లొక్కొక్క ప్రకృ
తి తత్వమున కధిపతులుగ నుందురు. ఆరీతినాలోచించిన వి
నాయకుండు పురుషు లొనరించు కార్యములు నిర్విఘ్నము
గాఁ గొనసాగవలెనను తలపుతో పూజింపంబడి యుండును
గుప్తేపండితు డీ వినాయకుడు పంటల దేవుడని యూహించి
నాడు. ఏలయన పంటలను నాశనము చేయునట్టివి యెలుకలు
ఆ యెలుక యీతని వాహనము అనగా సేవస్తువును వీరులని

డింతురో దానిని వాహనముగా చేసుకొందురనియు, శ్రీకృష్ణుడు కాళీయసర్పము నోడించినందున దానిపై నాట్యమాడెననియు నీశ్వరుడు నందికేశ్వరుని జయించినందున నందిపై స్వారి చేసెననియు, నదేవిధమున నెలుకలనునాశనము చేయు వినాయకుని కెలుక వాహనమనియు నాపండితుని యభిప్రాయము. మఱియు చెవులు చేటలవంటివని వర్ణించుటచే చేటలు కూడ దూర్పు వట్టుట మున్నగు ధాన్యసంబధకార్యములలో వాడబడుచున్నందున నీయుపమానము కూడపంటల సంబధమైనదని వారు వ్రాసినారు. ఏకదంతముయొక్క యర్థము నాగలిగా భావింప వచ్చునని నారు. ఈవాదమే నిజమని భావించిన వినాయకుని పూజా విధానములో సమర్పింపబడు పత్రి పుష్ప ఫలములను గూడ నాలోచింప వలయును. అంగా ప్రకృతి యంతయు పంటలచే నుండినప్పుడీ దేవుడు కొలువఁబడుచున్నాడు. ఈవాదము సరియైనదో కాదో నిర్ణయింపఁ జాలము. కాని పాఠకుల కిదియుఁ దెలిసియుండఁ దగినదని యిందుదహరించితిని

వినాయకుని పూజ మహారాష్ట్రులలో జాలప్రథానమైయున్నది. సుమారు వారము దినముల వరకీ యుత్సవమును వారుచేయుచుందురు. లోకమాన్యతిలకుగారీ పండుగను రాజకీయములలో గలుపుటచేత నింకను ప్రాధాన్యమునకు వచ్చెను. మహారాష్ట్రదేశములో ననేకస్థలములందు గణేశమండలులేర్పడి. ప్రతిమండలియు నేదేనియొక యుత్తమ పద్ధతిపై యుత్సవములు జరుపుచుందురు.

## విమర్శ

గణేశ పూజను గుఱించి యనేక పండితులు (ప్రాచ్యులు ప్రతీచ్యులును) తమతమ తెలివినంతయు వినియోగించి యిదమిద్ధమని నిర్ణయింప ప్రయత్నించినారు. కొందఱి మతమున కొన్ని సంవత్సరముల క్రిందట దక్షిణఅమెరికాలో నొక వినాయక విగ్రహము దొరికినదనియు నది పరీక్షించి చూడ ౫౦౦౦ ఏండ్ల క్రిందటిది గానోపుననియు నందుచే ౫౦౦౦ ఏండ్లకు ముందే ఆర్యులు తమ వేదమతమును అమెరికాలో ప్రచారముచేసిరనియు వాదింతురు.

గణపతిని గుఱించి ఐతరేయ బ్రాహ్మణములో ౧, ౨౧లో చర్చ గలదు. అందితడు బ్రహ్మ, బ్రహ్మణస్పతి, లేక బృహస్పతిగా వర్ణింప బడినాడు.

మ్యూయిర్ (Muir) అను పాశ్చాత్య పండితు డిట్లనుచున్నాడు:—

“ప్రాచీన వేదాంతులు లేఖక కళను మంచి పద్ధతిపై నుపయోగించిరి. సమానార్థ శ్లోకములకు పదములన్నియు నొకచోఁ జేర్పబడెను. వీనినే గణములు అని పేర్కొనిరి. ఈ గణముల అధిపతి”ని బ్రహ్మణస్పతియని గౌరవించిరి. తర్వాత దీనినే విద్యతో సరి పోల్చిరి. ఈ విద్యనే బ్రహ్మ యనియు, వేదమనియు ననిరి.”

యాస్కుడు ఇట్టి గణములను సమకూర్చెను. ఈ పండితుని అభిప్రాయమున నీగణముల (విద్య) యధిపతియే గణేశుడు.

శివమహాపురాణములో గణేశునికి వివాహముచేసి యున్నారు. ఇతనికి బుద్ధి, సిద్ధి అను నిద్దఱు భార్యలు. వీరిరువురికి క్షేమ, లాభ — అను పుత్రులు కలిగిరట. పదముల యర్థము చూచిన వినాయకుడు విద్యాధిదేవత యనియే బోధయగుచున్నది.

గణపతిపూజ జేయునప్పుడు పౌరోహితులీ మంత్రమును జదువుదురు.

మం॥ గణానాం త్వా గణపతిం హవామహే।
కవిం కవీనా ముపమశ్రవ స్తమం।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత।
ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥ ఋగ్వేద, మం ౨, ౨౩, ౧.

పై వివరింపబడిన బ్రహ్మణస్పతినామమే గణపతినామమని దీని యభిప్రాయము, కాని యీమంత్రము మనగణేశుని సంబంధము కాదని గోవిందదాసుగారి యభిప్రాయము. అది ముందు వివరింతును.

తైత్తిరీ యోపనిషత్తులో నీ క్రింది మంత్రమున్నది.

మం॥ తత్పురుషాయవిద్మహే వక్రతుండాయధీమహి।
తన్నోదంతిః ప్రచోదయాత్ ॥

దీనిభావము:—

ఆ పురుషుని తెలిసికొనుచున్నారము. వక్రతుండుని ధ్యానించుచున్నాము. ఆ ధ్యానమందు మమ్ములను మహాదంతము కల దేవుడు ప్రేరేపించుగాక:

ఈమంత్రము సుప్రసిద్ధమగు గాయత్రీమంత్రము నమూనాపై తయారు చేయబడినది. ఇట్టి మంత్రములీ యుపనిషత్తులో విశేషముగా నున్నవి. అయితే విశేషమేమన అన్నిటికిని భాష్యము వ్రాసినట్టి శ్రీమత్ శంకర భగవత్పాదుల వారు ఈ మంత్రముల కేమియు భాష్యము వ్రాయలేదు. ఈ యుపనిషత్తుయొక్క పాఠభేదములు నానా ప్రాంతములందును కలవు. కొన్ని ప్రాంతములవారు ఈ మంత్రములు గల పాఠభేదముల నొప్పుకొనరు. దీనివలన మనకు బోధయగుట యేమన శ్రీమచ్ఛంకరాచార్యుల యనంతర మెవ్వరో శైవ భక్తులీ మంత్రముల నీ తైత్తిరీయోపనిషత్తునందు చేర్చినారు.

ఒక పండితుడు గణపతి యుత్పత్తిని గురించి యిట్లు ఇంగ్లీషుభాషలో వ్రాసియున్నాడు:—

"క్రీస్తుశకానంతరము ౨౦౦ లేక 300 వండ్ల తర్వాత బౌద్ధజన్మ కథలను తిన్నగా హైందవ పురాణముల లోనికి

మార్చుకొన మొదలుపెట్టిరి. ఛాయాదేవిని బౌద్ధులు గజముచే నభిషేకింపబడినట్లు చిత్రించుచుండిరి. ఈ గజయుక్త ఛాయాదేవినే పౌరాణికులు గజలక్ష్మిని జేసిరి. అదేప్రకారము బౌద్ధుల "జంభాల" యను దేవతను వీరు గణేశునిగా జేసిరి. జంభాలుని వాహనము ముంగిస. దీనినే చిట్టెలుకగా మార్చి గణేశుని వాహనము చేసిరి."

గోవిందదాసుగారు "హిందూమతము" (Hinduism) అను నాంగ్లగ్రంథమందు గణేశుని గురించి బహుతీవ్రముగా ఖండనపూర్వకముగా వ్రాసియున్నారు. ఎట్లు వ్రాసినను భిన్నాభిప్రాయములనుగూడ పాఠకుల యెదుట నుంచుటలో నేమియు దోషముండనేరదు. "ఆధునికులలో ప్రతిపూజకును మొదట రక్తవర్ణుడును, అతికబొజ్జకల వాడును, చతుర్భుజుడును, ఏనుగు తల వాడును, ఎలుక నెక్కిన వాడియునగు గణేశుని పూజించుట యాచారమైపోయినది. ఈ వికారపుదేవుని తత్త్వమందేదో పరమార్థమున్నదని నిరూపింప కొందఱు ప్రయత్నింతురు. కాని యాజ్ఞవల్క్యస్మృతి కాలమువఱకే యితనిని మంచి దేవతగా పరిగణింపక దుష్టదేవతగా నెంచినారు, (చూడుము స్మృతి-౧, ౨౭౦, ౨౮౯, ౨౯౩) ఇతడు వాల్మీకికి పరిచితుడే కాడు, (అనగా రామాయణకాలమున లేడు) ఇతడనేకేతర దేవతల వలెననార్య దేవతగా నుండినను కొందఱు "గణానాంత్వాగణ

పతింపావామహే" యను ఋగ్వేదమంత్రమును సీతనికే సమ
న్వయింతురు. కాని యథార్థముగా నీమంత్రము బృహస్పతి
నుద్దేశించి చెప్పబడినది. ఇట్లే ప్రకారము వేదమందలి రుద్రు
లను పౌరాణిక మహాదేవునికి (శివునికి) అంటగట్టుదురు. ఇది
తప్పు.

గోవిందదాసుగారింకను నిట్లు వ్రాసియున్నారు—

"మానవగృహ్య సూత్రముల ప్రకారము (సూత్ర-౨
౧౪) ఈ గణేశుడు ఒకే దేవునుకాడు గృహ్యసూత్రములలో
నలుగురు దేవతల పేరులున్నవి. అవేవన [౧] శలకటంకట
[౨] కూష్మాండరాజపుత్ర [3] అజస్మిత [౪] దేవయజన
ఈనలుగురును మానవుల పీడించి వారికి గష్టముల గలుగ
చేయుచుండిరట. ఈ దుష్టులను తృప్తిపఱచుటకై పైగృహ్య
సూత్రములు పూజావిధాన మిట్లు నిరూపించినవి. వీరికి పచ్చి
మాంసము, చేపలు, మద్యము నైవేద్యముగా నియ్య
వలెను.

యాజ్ఞవల్క్యుని కాలము వఱకీ నాల్గు దేవతలు ఒకే
దేవతయయ్యెను. కాని పేరులు మాత్రము ఆరయ్యెను. అవే
వన—[౧] శాల [౨] కటంకట [3] కూష్మాండ [౪] రాజ
పుత్ర [౫] మిత [౬] సమ్మిత.

ఈ పేరులను జూచిన పైనాల్గు నామములనే తలత్రోసి విచి ఆరుచేసినారని విశదమగును. మొదటినాల్గింటిలోని దేవయజన, నామము మాత్రి మెగురఁగొట్టఁబడినది.

ఇట్లు సూత్రకాలము వచ్చువఱకు ప్రాచీనములైన ౧౧ రుద్రులు, ౪ వినాయకులును క్రమముగా ఒకే మహాదేవుడుగను, గణపతిగను మారెను. ఈ గణపతి పార్వతీమహాదేవులకుఁ గొడుకయ్యెను.

"ఇతడు సర్వసత్కార్యములను నాశనము చేయువాడుగాన "విఘ్నకారకుఁ" డయ్యెను. ఇట్టి దయ్యమును విద్యాధిదేవతగా చేయుట విచిత్రము. ఇతని కేనుగుతలను, తిండిపోతుతనమును జూపించు పెద్దపొట్టను, పెట్టుటయేగాక యీవికార పరిణామముగానొక యెలుకను సవారి గుఱ్ఱముగా చేసినారు."

"ఈ గణేశ భక్తులు ఆరు తెగలవారు. కొందఱు వామ మార్గీయులు. ఈ వామమార్గుల దేవతను ఉచ్ఛిష్ట గణపతి యందురు. ఈ విగ్రహము ప్రక్కన నొక నగ్న దేవియుండును. ఈమెపై గణపతి యొక్క [Proboscis] తొండము ఆడుచుండును.

"సుప్రభేదాగమము" అను తంత్రగ్రంథమందిట్లున్నది. తెలివిగల కొడుకు (వినాయకుడు) తనతండ్రిని [శివుని] తన

విస్మృతి రూపమునకుఁ గారణ మేమని యడుగగా విష్ణు డిట్లనెను."

"నేనును నీతల్లియగు పార్వతియు హిమవంతమందు సంచరించు చుండగా మేము ఏనుగులు రమించు చుండుట జూచితిమి. అప్పుడే మాకును ఏనుగుల రూపుతోఁ గూడవలనని కోరిక గలిగెను. ఆసంభోగ ఫలితముగా నీవు జన్మించితివి."

ఇవి గోవిందదాసు గారి యభిప్రాయములు మొత్తము పై వారి యభిప్రాయమున వినాయకుడు అనార్యుల దేవతయై యుండి తర్వాత నార్యులచే బూజింపఁ బడజొచ్చెను.

నాయభిప్రాయమున మ్యూరు (Muir) పండితుని యభిప్రాయమే సమంజసముగా నున్నది. ఋగ్వేద మందు వర్ణించ బడిన బ్రహ్మణ స్పతియే గణములకు [అనగా శ్లోకములకు —లేకవిద్యకు) అధిపతి — అతఁడే గణపతి అని తర్వాతి పౌరాణికులు శైవసంబంధము కల్పించి నానా విధముల వలని యుత్పత్తి ప్రకారమును సృష్టించి విఘ్నముల కధిపతిని గాజేసి జనులను భయపెట్టి పూజించునటుల జే యుందురు.



# చాతుర్మాస్య వ్రతము



శ్రీ వధర్మమందు ద్రౌపది భీష్మునితో స్త్రీలకు సకల సంపత్కరమగు వ్రతమేది యని విచారించగా నాపితామహుడిట్లు చెప్పెనని యున్నది.

"గీ॥ అధిక మేకాదశీవ్రతం బందు శ్రావ
ణంబు మొదలుగ మాసముల్నాలుగింట
నాచరించినవారికి నఖల వాంఛి
తంబు లీడేరు నిందిరాధవుని కరుణ"

"నారాయణ దేవుండు శ్రావణ మాసంబున శుక్లపక్షంబున నేకాదశీ దినంబున యోగనిద్రగైకొని కార్తికంబున బ్రసన్నుండగు నాశేషశయనుండు మేల్కాంచిన దినంబు ద్వాదశి యనంబరగు. నందుబూజించిన వారికి సర్వపాపవిముక్తియు హరినాలోక్యంబు నబ్బు."

ఈ నాలుగు మాసములలో అనగా శ్రావణ, భాద్రపద, ఆశ్వీజ, కార్తీక మాసము లందలి ఏకాదశీ దివసములం దుపవసించి జాగరముండుట ముఖ్యము.

ఈ చాతుర్మాస్యము శైవధర్మమందు స్త్రీలకే ప్రధానమని చెప్పినను నాచరణలో సన్యాసులు పీఠాధిపతులు, బ్రాహ్మణులు మున్నగు వారు దీని నాచరింతురు. శ్రీమహావిష్ణువు ఈనాలుగు మాసములు యోగనిద్ర చెందుననుట యుక్తికి సరిపోదు. యథార్థమేమన నీ నాలుగు మాసములు వర్ష కాలమున వచ్చినవి. ఈ నాలుగు మాసములందే సస్యోత్పత్తియు, సకల పిపీలికాది కీటకముల యుత్పత్తియు విశేషముగా నుండును. జనులీ కాలములలో విశేషముగా సంచరించిన సూక్ష్మ జీవరాసులకు ప్రాణహానియని జైనుల విజృంభణకాలమున మనవారు గ్రహించి యుందురు. మఱియు రాజులకు పరదేశములపై పీఠాధిపతులకు తమశిష్యకోట్లపై అర్థార్థులకు దాతలపై దండయాత్ర చేయుటకీ నాలుగు మాసములందు దుస్తరపంకమును, పరిపూరిత నదీతటాకములును, నడ్డుపెట్టుటచే నచ్చటికిని కదలక యున్నచోటనే కాలము గడపుట యుక్తమని మన పెద్దలు భావించి యీ చాతుర్మాస్యము నేర్పాటుచేసి విష్ణువునకు యోగనిద్రను కల్పించి యుందురు.



# పరశురామ జయంతి



పరశురామ జయంతి ప్రతి వైశాఖ శుద్ధ తృతీయనాఁడు జరుపఁబడును. ఈ పరశురాముఁడు దశావతారములలో నొకఁడుగాఁ బరిగణింపఁబడుటచేత శ్రీరామాద్యవతార పురుషులవలె నీతని జయంత్యుత్సవము సహితము ఆబ్రాహ్మణ చండాలముగాఁ జరుపఁబడవలసి యుండగా నిప్పుడది కేవలము బ్రాహ్మణులకే ప్రాముఖ్యమైనదై యుండుటకుఁ గారణమేమో?

పరశురాముఁడు క్షత్రియ స్త్రీయగు రేణుకకును, బ్రాహ్మణుడగు జమదగ్నికిని బుట్టిన వాఁడగుటచే నేటియాచారమునుబట్టి సంకరజాతిలోఁ జేరవలసినవాఁడు. కాని పూర్వకాలమందుండిన శాస్త్రముల యాధారమున నేమి మర్యాదల వలననేమి బ్రాహ్మణుఁడు దక్కిన మూఁడు జాతుల స్త్రీలను బొందుట కర్హుఁడై యుండెను. కావున జామదగ్ని యొక్క యుత్పత్తి శాస్త్రీయమే.

ఈ పరశురాముని చరిత్ర చాల విచిత్రమైనది. ఇతఁడు చాల మహాకోపి. తండ్రి నుండి యాధనమును వారసత్వపు

హక్కుగా పొంది వృద్ధిచేసి కొనినట్టివాడు, జమదగ్ని భార్య యగు రేణుక ప్రతిదినము నదికేగి యచటి యిసుకతో నొ బిందను సిద్ధముచేసికొని దానితో నీరు తెచ్చి పాకాదికములు జేయుచుండెడిది. ఒకనాడు నదీతీరమున నొకరాజు విడిసియుం డెను. అతని సౌందర్యమును, వైభవమును రేణుక చూచి చూచి కొంతమనసు చెదరిన దయ్యెను. ఆ నాడెన్ని ప్రయ త్నములుచేసినను యిసుకకుండ సిద్ధము కాకపోయెను. రిక్త కేలులతో నింటికి పోయెను. జమదగ్ని తన భార్యతో నాలస్య మునకేమి కారణమనియడిగి సరియగు సమాధానము కానక తన యోగదృష్టి చేతనే యామె మనశ్చంచలతను గుర్తించి యాగ్రహోదగ్రుడై యలిగి తన కుమారుడగు పరశురా ముని నామె తలనరుకుటకై నియోగించెను. గొడ్డలియే యాయుధముగా గలిగి యాపేరు పొందిన పరశురాముడు జంకుగొంకు లేక యట్లేచేసెను. పితృవాక్య పరిపాలకుడగు కొడుకు యొక్క యాజ్ఞా పరిపాలన క్రమమునకు సంతసించి వరము వేడుకొనుమని తండ్రి కోరగా సమయస్ఫూర్తిగల యాబాలుడు తన తల్లిని పునర్జీవితనుగా జేయుటే వరప్రసా దమని జనకుడట్లే యొనరించెను.

కొంత కాలమునకు జమదగ్ని తపశ్చర్య చేసికొ చుండ కొందరు క్షత్రియులా ఋషిని క్రూరముగా జంపి వైచిరి. దానిని విని పరశురాముడు క్రోధోద్దీపితుడై భూమి

సంతయును నిరువది యొక్క మారు చుట్టిచుట్టి క్షత్రియులను వెదకి వెదకి సంహార మొనర్చెను. ఇట్లు ప్రపంచమును నిందుమించుగా నిక్షత్రియముగా నొనర్చి శాంతిబొంది క్షత్రియ నరమేధమోనాగ నొక యజ్ఞముచేసి యందు దక్షిణగా కశ్యపుడను బ్రాహ్మణునికి యావత్ప్రపంచమును దానము చేసి తాను మహేంద్ర పర్వతమందునకు చేసికొనెను.

కొంత కాలమునకు శ్రీరాముడు సీతకొరకై శివధనుస్సును భగ్నము జేయగా పరశురాము డచటికివచ్చి రాము నెదిరించి యోడిపోయెను. ఇది మొదటి యోటమి.

తర్వాత రామాయణ కాలమందే కాక భారత కాలమందును పరశురాముడు మన కగబడు చున్నాడు. భారతమందు భీష్మాచార్యుల కితడు చాపాచార్యుడు.

గురు శిష్యుల కొకతూరి యంబ విషయమై పోరాటము జరిగెను. అందు పరశురాముడు శిష్యునిచే నోడింపబడెను. ఇది రెండవ యోటమి.

ఈపరశురాముని దగ్గఱ శస్త్రాస్త్ర విద్యల గఱచుటకై కర్ణుడు బోయితాను ద్విజుడనని బొంకి యాయన యొద్దవిద్దెను నేర్చుకొనెను. కాని యింద్రుని కైతవముచే పరశురాముడు యదార్థమును గుర్తించి కర్ణునికి శాపమిచ్చి చాపవిద్యయందు చెడిన వానిగా జేసెను. ఇది పురాతని చరిత్ర.

## విమర్శ

ఇతడు బ్రాహ్మణులకు ముఖ్యుఁడగుటకుఁ గారణమే నితండ్రి బ్రాహ్మణుం డగుట యొకటియుండ నోవు. మరియు కాకులగొట్టి గ్రద్దలకుఁ బెట్టినట్లు క్షత్రియులఁ జంపి బ్రాహ్మణులకు యావద్భూమిని దానము చేయలేదా? ఇంతియు గాక యాకాలమందు క్షత్రియులకు బ్రాహ్మణులకును జాత్యున్నతి విషయమై వాదములు జరుగుచుండెనని చరిత్రకారు లభిప్రాయము. ఒక సమయమున క్షత్రియులు మొదటితరగతి నిబొంది బ్రాహ్మణులను రెండవదర్జా కుదించియుండిరి. దీనిసంబంధమగు నిదర్శనములు జాతకథకలందుగూడ జాలకలవు. కావున తీవ్రముగా నుత్కృష్టత్వమునకై పెనగుచుండిన వీరి వాదమును గొడ్డలితో నునాయాసముగాఁ బరశురాముఁడు తీర్చినందున బ్రాహ్మణులకు జాల స్మరణీయుఁడు కాఁడా!

ఆ కాలమందు క్షత్రియులు చాల ధర్మేతరులై ప్రపంచమును బాధించుచుండిరనియు, నట్టి యుపద్రవమును పరశురాముడు నివారించెననియు దాని నీతఁ డవతారపురుషుఁడనియుఁ జెప్పెదరు. తనతండ్రిని జంపిన క్రోధముచే రాజులనందఱను (నిరపరాధులను గూడ) వెదకి వెదకి ఖూనిచేయుట సమంజసముగాఁ దోచదు. మఱియుఁ దల్లినే నిర్ఘృణుఁడై చంపినవాఁడు క్షత్రియులోక లోకోయా కాదు. తల్లిచెవులు కోయువానికి బినతల్లిచెవులు బీరపూలు

పరశురాముడెట్లు రామాయణ—భారత కాలములందు నిండు యుగాంతరములందు జీవించెనో యాతని వయస్సు ఎంతయని నిర్ణయింపవలెనో తెలియదు. ఇతడు శ్రీరామ శ్రీకృష్ణుల కాలమందు—రెంటను నుండిన వాడను మాట విశ్వసించిన శ్రీరామ శ్రీకృష్ణుల కాలములందుఁ జాల వ్యత్యాసము లేదనియు నించుమించు వీరు సమకాలికులనియు శ్రీరాముని నిర్యాణకాలము వరకు శ్రీకృష్ణుడు యువకుడైయుండి యుండుననియు జెప్పవలసివచ్చును. అప్పటికిని పరశురామునికి సుమారు ౧౭౦ సంవత్సరముల వయఃకాలమని చెప్పవలసియుండును. అయితే పౌరాణికులు పరశురాముడు చిరంజీవియని చెప్పి యీచిక్కునుండి తప్పించుకొనుచున్నారు. పరశురాముఁ డొక్కడే కాఁడు నేటికిని జీవించువాఁడు. ఇతనితోఁబాటు నశ్వర్ధామ హనుమంతుఁడు మున్నగు వారు నేటికిని బ్రతికియున్నారఁట. శ్రీరామకృష్ణులు శతవత్సరముల కాలానంతరము మరణించిరి కాని వీరుమాత్రము చిరంజీవులై ప్రకృతివిరుద్ధ మర్యాదచే విలసిల్లుచున్నారట. ఏమికారణమో? నిజమా? కల్లయా? ఎందున్నారో! ఎవరికగపడుదురో? ఇవన్నియు మనకు నచ్చఁజెప్పువారెవరో తెలియదు..



# బుద్ధ జయంతి



దశావతారములలో బుద్ధ భగవానుఁడొకఁడు. ఇతఁడే కడపటి యవతారము. దీని తర్వాత ముందెన్నఁడో కల్క్యవతారము రానున్నదని హిందువులు విశ్వసింతురు. అన్ని యవతారముల మాట యటుండ బౌద్ధావతారము హిందువులకు సరిపడినది కాదు. ఒకవర్గ యవతారమని చెప్పుచు వేరొక వర్గ బుద్ధుని నిందింతురు. దీనికిఁ గారణమేమన బుద్ధుఁడు వేదప్రామాణ్య మొప్పుకొన లేదనియు, జాతి సంకరము చేసెననియు, నాస్తికతను బ్రబలఁజేసెననియు నిందింతురు. బుద్ధునివంటి భావములనే వెల్లడించిన శ్రీశంకర భగవత్పాదులను సహితము ప్రచ్ఛన్న బౌద్ధుడని నిందించినారు. బౌద్ధమత మెట్టిదైనను మనకా ప్రసక్తితో నవసరములేదు. అన్ని జయంతులను గురించి యీ గ్రంథమందు వ్రాసినాము. కావున నీ జయంతి విషయము సహితము కించుక వ్రాసెదము.

## బుద్ధుని జీవితము

కలియుగమందు ౨౪౭౮ వ సంవత్సరమున వైశాఖ
...మనాడు కపిలవస్తు సమీపమందలి లంబినీయను నారా
...మందు శ్రీ బుద్ధ భగవానుండు జన్మించెను.
...ని తల్లి మాయాదేవి, తండ్రి శుద్ధోదనుడు.
...క్షత్రియ వంశము. గౌతమగోత్రము. శాక్యులను శాఖ
...ను. ఇక్ష్వాకు సంతతివారగుటచే వీరు సూర్యవంశ క్షత్రి
...ము. బుద్ధుడు పుట్టిన నాడెయితని భార్యయగు యశోధర
...బోధివృక్షమును జన్మించెనని చెప్పుదురు. బాలుని మొ
...పేరు సిద్ధార్థుడు ఇతనిజాతకము చూచి యితడు చక్రవ
...యైనయగును లేదా ప్రవక్తయైన యగునని కాలవేత్తలు
...రి. బాలుడు పుట్టిన యేడవనాడే యాతనితల్లిమరణించె
...తండ్రి బాలుని ప్రీతితో పెంచివిద్యలు చెప్పించెను. ఇతని
...వ ఏట యశోధరను పెండ్లియాడెను. వీరికి రాహులా
...డను కొడుకుపుట్టెను. కొడుకు వారికి ౨౯ వ ఏటపుట్టెను. ఈ
...డు పుట్టిననాడె సిద్ధార్థుడు సంసారమును వదలెను. ఇతడె
...సన్యసించునో యేమోయను భయముచే నీతనితండ్రి
...తనిని సదా భవనమందె సర్వసౌఖ్యములతో పెంచెను.
...నాడు సిద్ధార్థుడు నగరముచూచుటకై రథమెక్కి పోయె
...అతడు వీధులందు పోవుచుండగా నాలుగు దృశ్యములు
...చెను.

౧ మొదలు ఒకముదుసలిని జూచెను. చూచి రథచోదకునితో వాని తలనరసిన కారణము విచారించగా నందరును నిట్లే ముదుస లగుదురని ప్రత్యుత్తరము బడసెను.

౨ తర్వాతనొక జాడ్యస్థుని జూచి తాను జాడ్యము బొంద వచ్చునని గ్రహించెను.

౩ అటుతర్వాత నొకశవమును జూచి అందఱును నొకనాడు చచ్చువారేయని తలపోసెను.

౪ కడపట నొకభిక్షువును జూచి యతడు సర్వసంగపరిత్యాగియై యుండుటను జూచి ప్రాపంచిక దుఃఖములనుండి విముక్తి కిదియే మంచిసాధనమని యాదినమే యర్ధరాత్రి మందు నిల్లువాకిలి తల్లి పిల్లను వదలి యేకాంతముగా నడవి కేగెను.

అచ్చట నాఱు సంవత్సరములు తపస్సుచేసి నానా యోగాభ్యాసములు చేసి తుదకివి నిరుపయోగములని గ్రహించెను. తర్వాత నొకనాడు వైశాఖ పూర్ణిమనాడు అతనికి దివ్యజ్ఞానముకలిగెను. అప్పుడే బుద్ధుడయ్యెను. నాటినుండియు సిద్ధార్థునిబుద్ధుడనియు నతని మతమును బౌద్ధమతమనియు లోకమందు ప్రఖ్యాతి కలిగెను.

ఇట్లు బుద్ధుడైన యితడు మొదలు కాశీలోని సారనాథులో మతబోధ చేసెను. అనేక బ్రాహ్మణులువెరి శిష్యులైరి

బుద్ధుఁడైన తర్వాత నితడు ౪౫ సంవత్సరములు మత వ్యాపక ముచేసెను. ఇతడు తన ౮౦వ ఏట కుశినగరయను స్థలములో రెండు సాలవృక్షముల మధ్యమరణించెను.

బుద్ధుని ముఖ్య సందేశము అహింస. ఈ తత్వము పూర్వము హిందువులందు లేదు. హిందువులు పశువుల యజ్ఞము పేరఁజంపి మాంస భక్షకులై యుండిరి. బుద్ధుఁడిది నిరాకరించెను. ఈతని తత్వమునే తర్వాతి కాలములో బ్రాహ్మణులు సంపూర్ణముగా నొప్పుకొనిరి.

బుద్ధుని రెండవ సందేశము సర్వసమత్వము. ఆర్యులలో చాతుర్వర్ణ్యములు ముదిరి నానాశాఖలుగా వ్యాపించి పరస్పర ద్వేషములు వ్యాపించియుండెను. బుద్ధుడీ కులమును ధ్వంసముచేసెను. అందఱను నొక్కకులము వారినిగాఁ జేసెను.

ఈ బౌద్ధమతము తూర్పున జవా, బోర్నియో, సుమిత్ర చీనా, జపాను దేశముల వఱకును దక్షిణమున సింహళము వఱకును పశ్చిమమున బాబిలోనియా వఱకును వ్యాపించెను. కాని యేమిచిత్రమో కానరాను తన యుత్పత్తిస్థానమగు హిందూస్థానమందు నామమాత్రావశిష్ట మయ్యెను.

జయదేవకవి తన గీతగోవిందములో శ్రీబుద్ధపరమాత్మను నిట్లు వర్ణించినాడు.

౧౫

శ్లో॥ నిన్దసియజ్ఞవిధేరహహ శ్రుతిజాతం।
సదయహృదయ దర్శితపశుఘాతం।
కేశవ! ధృతబుద్ధశరీర!
జయజగదీశ! హరే!

భావము—„హే కేశవ, హే హరే, హే జగదీశ! స్వ బుద్ధావతార మెత్తితివి. బుద్ధావతారమున నీహృదయము దయామయమైనది. నీవు వేదములందు పశుఘాతముచే యజ్ఞము చేయవలయునని చెప్పెడి శ్రుతిని ఖండించినావు. అనగా అహింసా తత్త్వమును బోధించినావు."



# హోళి



హోళీ పండుగ ఫాల్గుణ శుక్ల పౌర్ణమా దివసమున చేయబడుచున్నది. హోళీపండుగ నేటికాలమందు దించుమించుగా హిందూస్థాన మందన్ని ప్రాంతములందును గావింపబడుచున్నది. అయినను నిది యుత్తర దేశీయుల కుండినంత ప్రాముఖ్యముగా దాక్షిణాత్యులకు లేదన వచ్చును.

హిందువుల యనేక పర్వముల చరిత్రరీతినే యీ హోళీ పర్వచరిత్రయు నసమగ్రముగా నున్నది. ఈపర్వ మెప్పుడు వాడుకలోనికి వచ్చెనో యిది యేల చేయబడుచున్నదో యే గ్రంథకారుడును తృప్తికరముగా చూపించి యుండలేదు. దీని నిజమైన తత్త్వమేదో నేను విమర్శలో చర్చించి నిర్ణయించెదను. ప్రకృతము ఈ పండుగునకు సంబంధించిన కథలు, సూచించు కారణములు వివరింతును.

హోళీ పండుగ కామదేవోత్సవ మని కొందఱును హోళిక యను రాక్షసి గుఱించి శాంత్యర్థముగా చేయు ఉత్సవమని కొందఱును, డోలికోత్సవ మని మఱికొందఱును వసంతోత్సవమని వేరు జనులును జెప్పుచున్నారు. వీని వివరములను ముందు చర్చింతము:—

## హోలికా సంహారము:_

హోలికా సంహారమును గురించిన చర్చలు, ధ
సింధు, నిర్ణయసింధువు లందును, హేమాద్రి యందును,
సింహ కల్పద్రుమమందును భవిష్యత్ పురాణమందును
నొండు రెండు గ్రంథములందును గలవు. అందు జయసిం
కల్పద్రుమ గ్రంథమును, భవిష్యత్పురాణమును నిట్లు వ్రా
యున్నవి.

“శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునితో నిట్లు చెప్పెను. పూర్వ
కృతయుగమందు రఘునాథుడను సూర్యవంశ రాజు
అతడు సమస్త దుష్టులను శిక్షించి ప్రజను రంజింప
పాలించుచుండెను. కాని కొంతకాలమునకు ప్రజలంద
నితో హోలిక యను రాక్షసి తమ పిల్లలను హింసించు
దని మొరలిడిరి. అప్పుడా సభయందుండిన నారదుడిట్లనె
ఈ హోలికను ప్రతి ఫాల్గుణ పౌర్ణమి దినమున
చిన శిశువులకే బాధయు నుండదు. రఘునాథు
ముగా నాచరించుట కాజ్ఞయిచ్చెను. నాటినుండియు నీ
వము చేయబడుచున్నది.”

ధర్మసింధువు, నిర్ణయసింధువు అను గ్రంథములందు హో
యనియు, హోలికా యనియు రెండు పదము లుపయోగిం
బడినవి. ఈ గ్రంథములలో హేమాద్రినుండియు,

(ప్ర)ాణము నుండియు నీక్రింది శ్లోక ముదాహరించినారు.

శ్లో॥ అస్యాం నిశాగమే పార్థ సంరక్ష్యాశ్శిశవో గృహే॥

అనగా ఈ హోలీ పండుగనాడు రాత్రి కాలమందు (పిల్ల)లను గృహములందు భద్రముగా దాచియుంచవలెను. (కా)బట్టి హోలిక యనుదాని భయముచే పిల్లల దాచు(వా)రని విశదమగును. దేవదాసీయ వచనమని పై నిర్ణయ(సింధు) కారుఁ డిట్లుదహరించినాడు.

శ్లో॥ నిశాగమే ప్రపూజ్యేత హోలికా సర్వదా బుధైః।
దివాపూజాయే ఢుంఢాం పూజితాదుఃఖదా భవేత్॥

అనగా రాత్రికాలమందే హోలికను పూజించవలెను. (పగ)టికాలమందు పూజించినవారు దుఃఖముల పాలగుదురు. (ఈ) శ్లోకమందు హోలికను ఢుంఢయని సంబోధించి యున్నా(రు). హిందీలో ధులండీయను పదమునకు దీనికిని సామ్యము కనబడుచున్నది. ధులండీ అను పదమునకు "దుమ్ము (ఎత్తు)ట" అని నర్థమని కొందఱు చెప్పుదురు. అట్లయిన నీ (పం)డుగ వసంతోత్సవసూచకముగా నున్నది.

కామ దేవోత్సవము:—

ఇక హోలికిని కామునికి సంబంధము నుం(చి) యించుక విచారింతము. పూర్వ మొకప్పుడు

లోకమంతయు నొక రాక్షసునిచే బాధింపబడు చుండెను. వానిని జంపుటకు శివోద్భవుడే సమర్థుడని దేవతలు నిర్ణయిం చిరి. శివుని ప్రథమ భార్యయగు సతీదేవి దక్ష ప్రజాపతి యజ్ఞములో దనకును దన భర్తకును నవమానము కలిగెనని దేహమును విసర్జించెను. కాళిదాస మహాకవి యీ యంశ మునే యిట్లు కుమారసంభవములో వ్రాసియున్నాడు:—

శ్లో॥ సతీసతీ యోగవిసృష్టదేహా
తాంజన్మనే శైలవధూం ప్రపేదే॥

ఇట్లు సతీదేవి శరీరమును జాలించి పార్వతియై పుట్టెను. ఈశ్వరుడు సతీదేవి మరణానంతరము విరాగియై ఆత్మధ్యాన పరాయణుడై హిమవత్పర్వతమందు వసించెను. అప్పుడింద్రాది దేవత లాలోచించి మన్మథుని బిలి యీశ్వరునికి పార్వతిపై మోహ మంకురించునట్లు చేయ గోరిరి. మన్మథుడు తనభార్య యగు రతీదేవి తోడను సఖుడగు వసంతునితోడను హిమవంతము చేరి పార్వతీ దేవి యీశ్వరునికి సపర్యలు పితాదేశముచే చేయు చుండు సమయము చూచి శివునిపై తన పుష్ప బాణములు బ్రయోగించి యతని మనస్సును గలవర పెట్టెను. ఈశ్వరుడును తన దివ్యదృష్టిచే నీకాముని గ్రహించి కోపించి తన మూడవ కంటి మంటచే దహించెను. రతీదేవి యత్యంతముగా విలపించి భర్త

గమనము చేయ సమకట్ట నాకాశవాణి వారించి యామె మరల శుభము కలుగనున్నదని చెప్పెను. పిమ్మట పార్వతి చే నీశ్వరుఁ బ్రసన్నుఁజేసి యాతని వివాహమాడెను. మన్మ డు శరీరము లేకున్నను బూర్వమువలెనే దేవతలలో నుండెను [illegible]డు వరమొసఁగెను. కావుననే మన్మథుని యనంగుఁ డందురు. ఈ మన్మథ దహనమునే ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాఁ ముననే జనులు పండుగుగా జేయుచుందురు.

## డోలోత్సవము.

ఈ సందర్భమునవనే నింకొక యంశము సూచింపఁ దగి యున్నది. నిర్ణయ సింధువులో నిట్లున్నది.

శ్లో॥ నరో దోలాగతం దృష్ట్వా గోవిందం పురుషోత్తమం।
ఫాల్గున్యాం సంయతో భూత్వా గోవిందస్య
పురం వ్రజేత్॥

అనగా గోవిందుడు (కృష్ణుడు) దోలి (యందు) (ఉయ్యాల[illegible] [illegible] ఉన్నట్టి కాలము [illegible] ఫాల్గుణ దివస [illegible] [illegible] వైకుంఠము[illegible] [illegible] ప్రమాణాధికార్యాలలో నేటికిని [illegible] కృష్ణ విగ్రహములను నుయ్యాలలో నుంచి పూజి[illegible] [illegible]

## ఆచారము

ఈ యుత్సవము నాడు జనులు చాల హేయమగు పనులను జేయుదురు. కొన్ని ప్రాంతములలో వీధులలో ఒకరొకరిపై నొకరు బుఱ్ఱ జల్లుకొనెదరు. కావుననే యీ యుత్సవమును ధూళియని వ్యవహరించియుందురు. మఱియు నొకరినొకరు పచ్చి మాటలతోఁ దిట్టుకొందురు. రంగుల చల్లుకొందురు. కొన్ని ప్రాంతములలో నదేపనిగ వారకాంతలను గూలికి బిలిచికొని వచ్చి మంగళ వాద్యములతో నూరేగింపు చేయుచు వారిపై రంగులను జెంబులతోడను పిచికారీలతోను జల్లుచుందురు. కొన్ని ప్రాంతములలో నీ దివసమున మంది యిండ్లలో దూరి పాలు పెరుగు బత్త్యాది భోజన పదార్థములను దొంగిలించికొని పోదురు. మఱియు రాత్రి కామందు వీధులలోఁ గాముదేవుని పటమును దహింతురు. దహించుటకుఁ గట్టెలను గూడ దొంగిలింతురు. ఆంధ్ర దేశమందీ యుత్సవమును కామ దహనమనియు, కాముని పున్నమ యనియు వ్యవహరింతురు. ఉత్తర దేశమునకన్న మహారాష్ట్ర దేశమందింకను హేయమగు పనులు చేయుదురు. ఇందూరు సంస్థానమందును దక్షిణ దేశములందును నీ పండుగనాడు "గద్ధూరాం" అను గొప్ప విగ్రహము నొకటిచేసి దానికొక గొప్ప లింగము నమర్చుచుందరట. ఈ లింగమును స్త్రీ పురుషులు పూజించు

ట్టి హోమమును జేసి యచ్చటి శిష్టులెల్లరును నొక మహ
జనుడు దర్బారువారికిచ్చి నివేదించుకొన నీ యాజ్ఞ పణియాం
గమును దీసివైచి విగ్రహమును పూజించుకొనవచ్చునని యా
జ్ఞ యయ్యెను.

## వసంతోత్సవము

ఈ హోళీపండుగ వసంతోత్సవమని కొందఱందురు.
వసంతోత్సవమును గుఱించి కొన్ని గ్రంథములలో జర్చగల
దు. కానితిథిభేదముచే నిదమిత్థమని నిర్ణయించుట కష్టము.
నిర్ణయ సింధువులో నిట్లున్నది:—

శ్లో॥ ప్రవృత్తే మధుమాసేతు ప్రతిపద్యుదితేరవౌ
కృత్వాచావశ్య కార్యాణి సంతర్ప్య పితృదేవతాః
వందయేద్ధోలికా భూమిం సర్వదుఃఖోపశాంతయే॥

చైత్రశుక్ల ప్రతిపత్తునాడు హోలికాభూమిని నమస్క
రించిన సర్వదుఃఖ శాంతి యగునట!

భవిష్యత్పురాణమందు "మదన మహోత్సవము"
అనుదానిని వర్ణించియున్నారు. ఇందు నేను పై వివరిం
చిన మన్మథ దహన కథయంతయు వివరింపబడి యున్నది.
అందిశ్లోకము గానవగును.—

శ్లో॥ అస్మిన్ వసంతసమయే శుక్లపక్షే త్రయోదశీ
అస్యాం మనోభవోదేవః భవిష్యతి శరీరవాన్

అనగా చైత్రశుక్ల త్రయోదశినాడు అనంగుడనశరీరుడగునట. ఈ యుత్సవమునే చైత్రోత్సవమనియు నీ భవిష్యత్పురాణ శ్లోకమునుండి విశదము కాగలదు.

శ్లో॥ చైత్రోత్సవే సకలలోక మనోనివాసం।
కామం వసంత మలయాద్రి మరుత్సహాయం।
రత్యా సహార్చ్య పురుషః ప్రవరాచ యోషిత్
సౌభాగ్యరూప సుతసౌఖ్యయుతా సదాస్యాత్ ॥

అనగా సకలలోక మనోనివాసుడగు మన్మథుని, వసంతుని, రతీదేవిని చైత్రోత్సవమందు పూజించువారు సౌభాగ్యరూప సుత సౌఖ్యయుతులై యుందురు.

ఇట్లు చైత్రోత్సవమనియు, వసంతోత్సవమనియు మన్మథోత్సవములు చేయవలెనను భవిష్యత్పురాణ నిర్ణయ సింధు ప్రమాణములున్నను నీ యుత్సవములు చైత్రమాసాది యందని యొకరును, శుక్లత్రయోదశి యందని యొకరును నిర్ణయించుట వలన హోలికా సంబంధము కాదనవచ్చును. కాని చైత్రశుక్ల ప్రతిపత్తున చేయవలయునను శాస్త్రప్రమాణమునకు హోలికకుగొంత సంబంధము లేకపోలేదు. సాధారణముగా హిందూస్థానమందు కాలనిర్ణయము రెండు పద్ధతులపై చెల్లుచున్నది. ఉత్తర హిందూస్థానమందు పూర్ణిమాంతమాసమును, దక్షిణ

హిందూస్థానమందు అమావాస్యతో మాసముపూర్తి యగును. కాల నిర్ణయము సౌరమాన మనియు, చాంద్రమాన మనియు, బార్హస్పత్య మానమనియు మూడు తరగతులుగా నున్నది. వింధ్యోత్తర భాగమందు సౌరమానమును, వింధ్యకు దక్షిణ భాగమందు చాంద్ర మానమును ప్రచారమందున్నవి. ఉత్తర హిందూస్థానమందుఁ పౌర్ణిమాంతముగా మాస నిర్ణయ మున్నదనుటకు క్రింది ప్రమాణము గమనింపఁ దగినది.

వ॥ చాంద్రో మాసో ద్వేధా శుక్లాదిః అమాం
తః కృష్ణాదిః పూర్ణిమాంతశ్చ । తయోశ్చ॥

శ్లో॥ కృష్ణపక్షాదికం మానం నాంగీకుర్వంతి కేచన
యేపిచ్ఛంతి న తేషామపీష్టో వింధ్యస్య దక్షిణే॥

వ॥ ఇతి వింధ్యస్య దక్షిణే కృష్ణాదినిషేధాదుత్తరే
ద్వయోరప్యనుజ్ఞాగమ్యతే । తత్రాపి శుక్లా
దిర్ముఖ్యః కృష్ణాదిర్గౌణః॥

ఇట్లు చూచిన ఉత్తర హిందూస్థానమందు ఫాల్గుణ పౌర్ణిమతో మాసాంత మగును. తర్వాత చైత్రమాస ప్రతిపత్తు ప్రారంభమగును. ఈ కారణముచే చైత్ర ప్రతిపత్తు వసంతారంభమని యెంచవలెను. అందుచే ఈ వసంతోత్సవమునకు హోలికకుఁ దిథిభేద ముండదు.

ఈ వసంతోత్సవమునకును కామదహనోత్సవమునకు దగ్గఱి సంబంధము కలదనుటలో నేమియు సందేహము లేదు. ఋతువులన్నిటిలో శ్రేష్ఠమని యెంచబడినవసంతర్తువులో కామదహనము చేయబడు చున్నది. ఈ ఋతువునందే ప్రకృతి యంతయు సుందరముగాఁ బుష్పాదులచే వికసించి శుకపికాదులకు నానందదాయకముగా నుండును. ఈ కాలమే మన్మథుని విజృంభణ సమయమని కవులందఱు వర్ణించి యున్నారు. వసంతుఁడు మన్మథుని ప్రాణసఖుఁడు కావుననే యీ వసంతోత్సవ సమయమున జనులు కామవికారపుఁ జేష్టలను ప్రకటింతురు.

మన్మథుని సృష్టిచేసిన వాఁడెవ్వఁడో కాని యిదియన్ని సృష్టులలోఁ జాలరమణీయమైనది. ఇతఁడు మన్మథుఁడట మనస్సుల మథించువాఁడు కాన, ఇతఁడనంగుఁడట మనస్సులో నే కామోద్భవమగును గాన. ఇతని వాహనము చిలుక వసంతర్తువులో దీని రంకెక్కువ కాన. ఇతని బాణములు పుష్పములు. ఇవి కామోద్దీపకములు కాన. ఇతని భార్యసాక్షాత్ "రతీ" దేవియే. ఇట్టి దేవరపూజకు ఫాల్గుణ పౌర్ణమీ దివసము పండువెన్నెల దినము నాత్యుష్ణ నాతిశీతకాలము. తగినట్టి సమయము.

విమర్శ

ఇంతవఱకు వ్రాసిన విషయములలో నేది సరియైనదో హోలికా నిజతత్త్వమేదియో గుర్తించుట ముఖ్యవిషయ

ము. ఇంతవఱకు హోలికను నాలుగు విధముల వర్ణింతురని చూపినాడను. అనగా నీ పండుగ హోలికా రాక్షసీ తృప్త్యర్థమనియు కామదహనోత్సవ మనియు దోలికోత్సవమనియు పలువురు పలువిధముల తెలుపుచున్నారు. కావున నిందేది నిజమో యేది యసమంజసమో విచారింతము.

రాక్షసి కథ:— రఘుమహారాజు కాలమందొక రాక్షసి రాజ్యమందలి బాలికలను చంపుటచేత నామెను శాంతి పఱచుటకై యీ పండుగను రఘుమహారాజు చేయనాజ్ఞాపించెననుటకు భవిష్యత్పురాణ నిర్ణయసింధువంటి గ్రంథములందు ప్రమాణము లున్నను నవి యవిశ్వాసనీయములు. రాక్షసి బాలురను హింసించుటకు హేతువేమి రఘుమహారాజు నంతటి వానికి దానిని సంహారించుట కేల సామర్థ్యము చాల లేదో దురూహ్యము. ఒక వేళ రాక్షసిని సంహారింప లేక పోయినను నిట్టి హేయ పద్ధతులచే దానిని శాంతింపఁజేయుటయు నసమంజసముగా నున్నది. ఈ హోలికారాక్షసిని తృప్తి పఱచుటకై దొంగతనము చేయవలయునట. చండాలుర యింటినుండి దానినంటు పెట్టుటకై యగ్నిని తేవలయును పచ్చిబూతులతో తిట్లు తిట్టవలయునట ఈ క్రింది ప్రమాణము లీవిషయమున గమనింప దగినవి.

పురుషార్థ చింతామణి యను గ్రంథములో నీక్రింది విధముగ నుదహరించియున్నారు.

శ్లో॥ దశమ్యాః శోభనాస్త్రాసు కామ్య స్తేయం విధీయతే।
అవస్త్యైర్వాథ వృద్ధైర్వా యువాభిర్వా దినాత్యయే
ప్రాప్తాయాం పూర్ణిమాయాంతు కుర్యాత్ తాం కాష్ఠదీపనం
చండాలసూతికా గేహాచ్ఛిశు హారిణ వహ్నినా।
భద్రాముఖం పరిత్యజ్య హోలాయాదీపనం శుభం।

* * * * *

గ్రామమాధ్యహిశ్చమధ్యే వాతూర్య నాదసమన్వితం।
ఇట్లు హోలికా దహనము చేయునప్పుడు దీపన మంత్రములీ క్రిందివిధముగా నున్నవి.

శ్లో॥ అర్చయిత్వాతతై రక్తైః కుంకుమేన స్సునస్కృతైః
గీతైర్వాద్యై స్తథాన్యైశ్చ స్తోత్రైః సానీయ తేజనైః
తమగ్నిం త్రిః పరిక్రమ్య శబ్దైర్లింగ భగాంకితైః॥
తేనశబ్దేనసా పాపా స్మరాతృప్తిమాప్నుయాత్।

ఇందు లింగభగాంకిత శబ్దముల (పచ్చిబూతుల) నుచ్చరింపుట కనుజ్ఞయియ్యబడినది. ఇట్లు మానవులు నీచకార్యము లుచేయుట రఘుమహారాజునకు సమ్మతమై యున్ననూ నా యభిప్రాయమున నీతప్పుడు శాస్త్రములన్నియు మధ్యన కల్పింపబడినవే!

## డోలికోత్సవము

ఇదియుం గొవల భ్రమాజనితమో వేమో యనినా కనుమానము కలుగుచున్నది. హోలికను డోలిక యని భ్రమించి యా

యుధాత్వర్థములు. ఈసూత్రముపై ఏమి అర్థమో నిఘంటుకా రులు వ్రాయక ,,వసంతోత్సవభేదే ఉపచారాత్" అని వ్రాసినారు. ఇట్లు వసంతోత్సవ భేదమని అర్థము చేసి నిఘంటు కారులు జైమినిని నిట్లుదహరించినారు. ,,హోలికాచ ప్రాచ్యాభిమానిరక్షః క్షీయతే హోలాకాచ వసంతోత్సవ విశేషః హోలీతి ప్రసిద్ధః। ఏమాదీనేషుకాధికం దాక్షిణాత్యైః ఆదీనేషుకం స్వస్వకులాగతం కరంజార్కాది స్థావర దేవతా పూజాదికం తద్దేశ ప్రసిద్ధం। ఉద్వాపమభయజ్ఞాదకముదీచ్యైః క్రియతే॥

శబ్దకల్పద్రుమ కోశమందు హోలిక,,యను పదమున కిట్లర్థము చేయఁ బడినది.

,,తృణాగ్ని భ్రష్టార్ధపక్వశమీధాన్యం హోలకః। హోలాఇతి హిందీభాషా॥

అనగా అగ్నిలో సగము కాలిన గడ్డితో కూడిన గింజలు (కాపిళ్లు) అని అభిప్రాయము చెప్పుచు నిది హిందీపదము అని తప్పించుకొనినారు. మఱియు వైద్య గ్రంథములందున నిదే యర్థ మిచ్చియున్నారు:

శ్లో॥ అర్ధపక్వశమీధాన్యైస్తృణభ్రష్టైశ్చహోలకః।
హోలకోల్పానిలోమేదః కఫదోషశ్రమాపహః॥

అనగా అగ్నిలో సగము పక్వమైన ధాన్యము హోళికయ
నబడును. ఇది యుదరమందు స్వల్పముగా నగ్నిదీపనము
కలిగించును. కఫదోషములఁ బోగొట్టును.

ఈపై రెండు ప్రమాణములచేఁ బూర్వము మనదేశ
మందు క్రొత్తగాఁ బండిన ధాన్యమును గడ్డితో తెచ్చి
గ్రామస్థులందఱును నొకచోఁ జేరి దానిని గాల్చి
సగము పక్వమైన తర్వాత భుజించుచుఁ బండుగు చేయుచుండి
రని యూహింపవచ్చును. వడ్లును, గోధుమలును జొన్నలు
ఈ ఫాల్గుణ పౌర్ణిమవఱకుఁ బూర్తిగా పండును. కావున నీ
వసంతకాలము నీహోలిక ధాన్యమును వేపుకొని భుజించు
చుండిరే కాని హోలికా యను రాక్షసిని గాల్పలేదని
నమ్మవచ్చును.

జైమినీ న్యాయమాలలో హోలాకాధికరణమని
ప్రత్యేకాధికరణ మొకటి కలదు. అందు ౧౫ నుండి ౨౩
వఱకు గల సూత్రములలో హోలికా చర్చ యిట్లున్నది.

"హోలాకా దేర్వ్యవస్థా స్యాత్ సాధారణ్య ముతా
గ్రిమః। దేశభేదేన దృష్టత్వాత్ సామ్యంమాః సమత్వతః।
హోలాకాదయః ప్రాచ్యైరేవ క్రియంతే। వసంతోత్స
వో హోలాకా। ఆహీన్నా నైబుకాదయో దాక్షిణాత్యైః।
ఉద్వృషభ యజ్ఞాదయ ఉదీచ్యైః శ్చేష్ఠ మాసస్య పౌ
ర్ణిమాస్యాం బలీవర్దాన భ్యర్చ్య ధావయంతి సోయము
ద్వృషభ యజ్ఞః। ఏవం హోరీతాదిస్మృతిః। కాచిత్ప్రాచి

ద్దేశ విశేషే దృశ్యతే। తస్మాద్వ్యవస్థితం ప్రామాణ్య మితిచేత్। మైవం। తస్మాల్లత్వేనాను మితస్య వేదస్య సర్వ సాధారణత్వేన తేషామపి సర్వసాధారణత్వాత్। అత్రైవ గురుమతమాహ.....।

మొత్తముపై జైమిని యభిప్రాయ మేమన దేశాచారముగా నీ హోలికోత్సవ మున్నది గాన నిది ప్రమాణముగా గ్రహింపదగినది. తైత్తిరీ యోపనిషద్భాష్యము వ్రాయుచు రంగరామానుజుల వారు «యాన్యస్మాకం సుచరితాని తానిసేవితాని — నో ఇతరాణి” అను దానికిట్లుదాహరణము చెప్పినారు. «శిష్టాచారేష్వపి శ్రుతిస్మృతి విరోధశూన్యత యాయాని సుచరితాని తాన్యేవ హోలాకాని గ్రామ్యాణి, వలో శ్భాది మూల చరితానీత్యర్థః” అనగా శ్రుతి స్మృతి విరుద్ధము లైనను శిష్టాచారము లైన హోలాకాద్యుత్సవముల వంటివి చేయవచ్చును. ఇట్లు కొందఱు హోలికాశబ్దమును గుఱించి సంశయించి యున్నారు.

అయినను నీహోలికోత్సవము వాత్స్యాయనుని కాలమునకే ప్రసిద్ధికొంది వసంతోత్సవముగా భావింపబడినదని వాత్స్యాయనుడే తెలిపియున్నాడు. కామ సూత్రములం దిట్లు వ్రాయబడి యున్నది.

“యక్షరాత్రిః కౌముదీజాగరః.............
మదనోత్సవః, దమనభంజికా, హోలాకా, అశో

పౌర్ణిమాంసికా... తాం హోళ్ళమాహిరాన్యః దేశ్యాః ప్రసి
ద్ధస్సర్వత్ర వినిక్షిప్యమాచరే మూరితి సంభూయమనుష్యా"

పై రాము సూత్రములకు యశోధరుడు తన జయమం
గళవ్యాఖ్య వ్రాయుచు హోళాక కిట్లు అర్థము వ్రాసినాడు.

"హోలాకా ఫాల్గుణపూర్ణిమాయాం శృంగకాది ముక్త
న కింశుకాదికు సుమరాగాంభసా పరస్పరోత్క్షణం మిథః పట
వాసప్రక్షేపశ్చ" అనగా ఫాల్గునపూర్ణిమనాడు పిచికారీలతో
(చిమ్మనగొట్టములతో ) మోదుగు పూలతో సిద్ధముచేసి
నరంగులతో జల్లులాడుట బుక్కచల్లుటయు ముఖ్యవినోదము
లు. వాత్స్యాయనుడు క్రీస్తుపునకు పూర్వము ౧౫౦ సంవత్సర
ముల నాటి వాడనియు, యశోధరుడు క్రీ. శ. ౧౦ వ శతాబ్ద
వాడనియుఁ బండితులు నిర్ణయించినారు.

క్రీ. శ. ఏడవ శతాబ్దాదిలోనుండిన శ్రీహర్షుడు తన ర
త్నావళీ నాటకములో వసంతోత్సవమును విపులముగా వర్ణిం
చినాడు. విస్తరమగునని యాభాగమిం దుదహరింపలేదు.

మహారాష్ట్రులలో హోలికాగ్నిలో పోళీలు (భక్ష్యములు)
వేయునాచారము కలదు. కన్నడ మహారాష్ట్ర భాషలలో
కొన్నిపదములను "ప" కారమునకు మారుగా "హ" కారము
నుచ్ఛరింతురు. కావున పోళి యను పదమును వారు హోళియని
యుచ్చరించి పై పద్ధతిగా నుత్సవము చేయుచుండురని యూహ
మానింపవచ్చును.

పైవివరించిన యంశముువలన నీహోలిక వసంతోత్స వమనియు, వసంతకాలమందు నానాప్రాంతములందు నానా విధములుగా నుత్సవముల జేయుచుందురనియు గ్రహింపఁ గలము. కొన్ని ప్రాంతములలో నెద్దుల నలంకరించి వినోద ములు చేయుచుందురనియు, కొన్ని చోట్ల హోలీలను నాహుతి చేయుదురనియు, కొన్ని తావుల నీ సంవత్సరపులో దొ రకు పంటలను మంటచేసి కాల్చి భుజింతురనియు, కొన్ని ప్రాంతములందు శృంగారా నిర్మాక్తమగు రంగులతో వినోద ములు చేయుదురనియు—ఇట్లు—దేశాచారములచే భిన్న మర్యాదలు కలదైనను మొత్తముపైనిది వసంతోత్సవమే యనియు నిశ్చయమయ్యెడి.

ఉత్సవ ప్రాచీనత:—

వాత్స్యాయనుని కాలము వఱకే యీపండుగు చాల ప్రాముఖ్యత వహించియుండెనని సూచించియుంటిని. ఇంతే న్నను ప్రాచీనమైదియని చెప్పవచ్చును. ఇది కేవలము హిం దూస్థానమందేగాక ప్రాచీనమందు నించుమించు ప్రపంచమం దన్ని దేశములలోను నాచరింపఁ బడుచుండెను. రోములో (ఇటలీ దేశములో) ప్రాచీనమందు లూపర్కే-లియా (Lupercalia) అనువసంతోత్సవము చేయఁబడు చుండెను. అందుయువకులు వీధులలో నగ్నులై పరుగెత్తుచుండిరి. మతి యు వారికడ్డముగా మగనాండ్రు సంతానప్రాప్తి కలుగునను న

మ్మక త్తో నిలిచి వారిచేతనుండు త్రోలు గొరడాల దెబ్బలంగొనుచుండిరి. రోము జనులు మన్మథుని, బ్యాకస్. (Bachus) అనుచుండిరి.

జర్మనీలో బూర్వకాలమున నిట్టిదురాచారమే యుండెను. అచ్చటియువకులు నగ్నులై వీథులందు దిరుగుచు స్త్రీలను బూతులతో దిట్టుచుండిరట. గ్రీసుపోర్చుగల్లు మున్నగు దేశములలో నిట్టివసంతోత్సవములే యుండెనని పాశ్చాత్య గ్రంథకర్తలు నిరూపించి యున్నారు పోర్చుగల్లులో లెంటు పండుగనాడు (ఏప్రెలు మాసములోని పండుగ) జనులు బజారులలో నెవ్వరైననుసరె పోవువారిపై రంగును జల్లుచుండిరట.

పశ్చాత్య దేశములో నీ పండుగనాడే సంవత్సరాదియట. మఱియు ఇంగ్లాండులో నీకాలమందే వసంతోత్సవము చేయుచుండిరట. దానినే ఏప్రిల్ ఫూల్ ఉత్సవ మనిరట (April Foolsday) హోళీపండుగను ఫాల్గుణియనియు వ్యవహరింతురు. ఈ ఫాల్గుణీ శబ్దమువంటి ధ్వనికల "పల్లికా" యనునుత్సవము ఈజిప్టులో జేయబడుచుండెను. దీనినే గ్రీసుదేశములో "ఫ్లోరేలియా" యనివ్యవహరించిరి. ఈపదమునకు "పుష్పోత్సవము" అనిఅర్థము. మనవసంతవర్ణనకు సరిపోవును.

ఈ విధముగా ప్రాచీనమందార్య శాఖలలోఁ జేరిన జాతు లన్నింటిలో నీవసంతోత్సవ ముండుటయు, నన్ని తావులలో నీతిబాహ్యపుఁ జర్యలను వచ్చి శృంగార చేష్టలను ...

జేయుటయు ప్రసిద్ధము. కావున హోలికోత్సవము బహు ప్రాచీనమైనది. హిందువులార్యావర్తమునకు రాకపూర్వము తక్కిన యార్యశాఖలలో గలసియుండిన కాలమునుండియు నీయుత్సవ మాచారమందుండినది. సర్వవిధముల నిది వసంతోత్సవమేయనుటలో నేమియు సందేహము లేదు.



# నాగపంచమి



ప్రతి సంవత్సరము శ్రావణశుద్ధ పంచమీ దివసమున నాగపంచమీ పూజలు జరుగును. తెనుఁగులో నీపండుగను నాగుల పండుగ యని యందురు. ఈపండుగ కేవలము సర్పముల పూజామాత్రమై యేర్పడినట్టిది. ఈ పండుగ విషయమై ప్రతచూడామణియం దిట్లున్నది.

## పౌరాణికము

నాగపంచమీ వ్రతవిషయమై హేమాద్రి ప్రధాన ఖండమం దిట్లున్నది. ఈశ్వరుడు పార్వతితో నిట్లనెను. సర్పములను ప్రతిగృహము యొక్క ద్వారముపై గోమయముతో వ్రాసి శ్రావణశుక్ల పంచమీ దివసమున పూజించవలెను. చతుర్థినా డుపవాసవ్రత మాచరించి పంచమినాడు బంగారుదిగాని, వెండిడిగాని కఱ్ఱదికాని తుదకు మట్టిదిగాని నాక పంచముఖముల సర్పమును చేయించి దానిని నానావిధములగు ఫల పుష్పములతోడను గంధాది ధూపములచేతను పూజించి బ్రాహ్మణులను ఘృత పాయస మోదకములచేతఁ సంతృప్తిపఱచవలెను. పిమ్మట బ్రాహ్మణులకు సువర్ణాది దానములను జేయవలెను. ఆనాఁడు దివా రాత్రములందు దేవ్యాను భూమిని త్రవ్వఁగూడదు: ఇట్లు స్కాంద పురాణమందుఁ జెప్పఁబడినది.

ఎవరైనను పాములచే గఱవబడిన వారి బంధువులు నాగపంచమీ వ్రతమును విధితో జేసిన నాబాధలు తొలగిపోవునని స్కంద పురాణమందే చెప్పబడినది.

గాధలు:—

నాగపంచమి పండుగను గుఱించి హిందూస్థానమందు క్రింది గాధలు కలవని గుప్తే పండితుడు తన యింగ్లీషు గ్రంధమందు వ్రాసియున్నాడు.

౧. అనగాననగా నొక బ్రాహ్మణుడుండెను. అతనికి యేడుగురు కోడండ్రు. కట్టకడపటి కోడలికి తల్లి దండ్రులు లేరు. తక్కినవారందఱు తమతమ పుట్టునిండ్లకు బోగా నీ పెమాత్రము మామగారి యింటనే యుండి తనకు ఆదిశేషుడు తప్ప వేరే తండ్రిలేడని విచారముతో జెప్పుకొనుచుండెను. ఆదిశేషుడీ వార్తను విని జాలినొంది యొకనాడు వృద్ధ బ్రాహ్మణ వేషధారియై యీమె మామనొద్దకు వచ్చి తానీబాలిక పినతండ్రిననియు, తన కూతును పుట్టినింటికి బిలిచికొనిపోదుననియు నడిగెను. కోడలు కూడ మామ యింటి నివాసమునకు విసిగి తాని బ్రాహ్మణుని వెంట బోవుటకొప్పుకొనెను. ఇద్దఱును బయాణమైరి. కొంతదవ్వేగిన పిమ్మట మాయా బ్రాహ్మణుడు తన నిజరూపము దాల్చి నా తన ఫణముపై యాబిడను స్వారిచేయ నాదేశించి నాగలోకమునకుం గొనిపోయి తన యాలుబిడ్డలతో నుండ నియమించెను. పిల్లల కందఱకును నీమె నేమాత్రమును హింసింప

గూడదని శాసించెను. ఇట్లుండఁ గొంతకాలమునకు ఆదిశేషుని భార్య ప్రసవించెను. ఇంటినిండ బాలపిల్లలు పాటాడుచుండెను. ఒకనాఁడీ కోడలు బరువగు కంచు దీపమును చేతఁబట్టుకొని భయముచే దానిని జాఱవిడువ పిల్లల తోఁకలపైఁ బడి యాతోఁకలు విఱిగిపోయెను. కొంతకాలమగు తఱి యాకోడలు మరల తన మామగారి యింటికివచ్చెను. ఇట్లుండ శ్రావణశుక్ల పంచమీ దివసము వచ్చెను. ఆనాఁడీ బాలిక పాముల రూపముల నొకచోఁ జిత్రించి దేవునిఁ గూర్చి తన పాము తమ్ములను రక్షించుటకై ప్రార్థించుచుండెను. తోఁకలు తెగినపాములానాఁడే విచిత్రవిధముగ తమ తల్లితో తామా విస్మృతులైన కారణమడిగి తెలిసికొని యీ దుష్ట బాలికను చంపుదుమని పట్టుబట్టి పూని మాయింటికి వచ్చి పొంచి యుండిరి. అప్పుడే యాబాలిక యా తోఁకదెగిన పాముల రక్షించుటకై దేవుని బ్రార్థించిన దానిఁజూచి కరుణాంతరంగితహృదయములతో నామె నైవేద్యముగా నుంచిన పాలుపండ్లను మెక్కి దీవించి తమ నెలవుల కేగెను. నాఁటినుండి ప్రపంచమందీ నాగులపూజ జరుగుచువచ్చెను.

ఇంకొక కథ

ఒక కాఁపు పొలము దున్నుచుండెను. ఒకనాఁడు తన నాగేటిమొన యొక రంధ్రములోఁ బడి యెద్దులచేఁ బైకి దున్ను పెకలింపఁబడగా నారంధ్రమందుండు పాముపిల్లలన్నియుఁ జచ్చెను. తల్లివచ్చి యీ ఘోరమును భరింపలేక

గాఁపువాని యింటికివచ్చి యందఱను గఱచి చంపెను. ఇంతి టితోఁ దృప్తినొందక కాఁపువాని బిడ్డ మగనియింట సంసారము చేయుదానిని గూడఁ జంపనెంచి యచటికిఁ బోయెను. అనాఁడా కాఁపుఁ గోడలు ఆదిశేషుని పూజ సేయుచుండెను. ఈపాము పూజ యగువఱకు తాను సహించ వలసి వచ్చెను. అంతలో నాకలిగొనినదగుట యాబిడ యారగింపుగా నుంచిన పండ్లుతిని పాలనుద్రాగి శాంతి బొందెను. పిమ్మట పూజచే దృప్తినొంది యాకాఁపుబిడ్డకు నగలనిచ్చి దానాపె తల్లిసంద్రుల నన్నదమ్ముల జంపిన వృత్తాంతము దెలిపి వరము గోరుకొనుమని యడిగెను. కాఁపుది వారల నందఱను పునర్జీవులనుగా జేయుమని గోరెను. అటులే నాగుపాముల బ్రతికింపఁబడిరి. నాటినుండి నేటివఱకు కాపులు నాగపంచమి నాడు భూమి దున్నకొనుటను మానినారట!

ఆచారము:—

ఇవి నాగులపండుగను గూర్చిన కథలు. నాగపంచమి నాడు జనులు శిరస్స్నానముచేసి ప్రాతఃకాలముననే సర్పముల ప్రతిమలకు పాలు, కొబ్బెర, అన్నము, ఆరగింపు చేయుదురు. మఱికొందఱు పుట్టలదగ్గఱ పోయి పుట్టలలోఁ బాలు పోసి పుట్టచుట్టును ప్రదక్షిణముచేసి వచ్చెదరు. ప్రతి గ్రామమందును రాతితోఁ జేయఁబడిన పాముల విగ్రహము లుండును. నాగపంచమి నాడీ విగ్రహములకు పూజలు చేయఁబడును.

## విమర్శ:—

నాగపంచమీ విషయమై స్కాంద పురాణమందు భవిష్యత్ పురాణమందును జర్చలు గలవు. వీనిని చూడనిదియార్యులపండుగగానుండినట్లుతోచను. ఇదివిశే షముగా ద్రావిడులయొక్కయు వనార్యులయొక్కయు పండుగగా గనబడుచున్నది. సర్పములు మనుష్యులను హింసించు జంతువులలో జేరినట్టివి. సింహ శార్దూలాదులు అరణ్యములలోనే యుండుటచే నగరవాసులకు వాని భయము తక్కువ. కాని యీసర్పములు నగరములందు గ్రామములందు చేలలోను యిండ్లలోను నివసించి మనుష్యులను కరచి చంపుటచే వీనిభీతి జనులకు విశేషమయ్యెను. పాము కాటునకు మందు సాధారణముగా నేటివరకును మంచిది కనిపెట్టబడలేదు. అట్టిచో దీని భీతి యింకను విశేషము కల సహజము. మన పురాణకాలమున నీశ్వరుడు, విష్ణువు, వినాయకుడు మున్నగు దేవులకు సర్పములు భూషణములై యున్నవి. శివుడు భుజంగ భూషణుడు, విష్ణువు శేషశాయి, కృష్ణుడు కాళియమర్దనుడు. ఈ ప్రకారముగా పాములకు ప్రాముఖ్యత నీయబడినది. దేవతలకు ప్రియమైనవి గాన పాముల కాకేతల యుండిన లోటేమొయని అయిదుతలలు మొదలుగా గలవిగా వర్ణింపబడినవి. వ్రత చూడామణి మొదలగు సరీతిగా నీపండుగ నాగపష్ఠి వ్రతముగా నున్నది. ఇట్లు సర్పములను బూజించిన సర్పములబాధ తొలగునని

సమిష్ఠి యీప్రకార మొకదిన మేర్పాటుచేసి యాదినము సర్ప ములఁ బూజించుటకై ప్రత్యేకించి యుంచురు. ఇంతకన్న దీనికి వేరొకకారణము గోచరించదు. పాము చాల తెలివిగల జంతువనియు, పగఁబట్టిన పగ సాధించి తీరుననియు భారతభూమి యంతటను వేనవేలు గాథలు చెప్పుచుం దురు. భారతదేశమం దుండినన్ని పాములు బహుశః యేయితర దేశమందును లేకుండును. మనదేశమున నేటికి వేనవేల జనులు సర్పముల కాట్లచే మరణించుచున్నారు. కావున నీ పై సందర్భములను బర్యాలోచించి వేరు మందు గానక లోకులు వానిని బూజించ మొదలిడి యుందురు.

### విశేషాంశములు:—

భవిష్యత్పురాణమందు నాగ పంచమిని గుఱించి యిట్లు వ్రాయబడినది. ఉచ్చైఃశ్రవసను గుఱ్ఱము సముద్ర మథనమం దుద్భవించెను. అది యంతటను తెల్లనిది. దానినిజూచి కద్రువను సర్పము వినతతో నిట్లనెను, "అల్లి టను గుఱ్ఱము తెలుపే కాని వెండ్రుకలేల నల్లగ నున్నవి." వినత యిట్లనెను. "నాకంతయుఁ దెలుపే కనఁబడుచుండ నీకు నలుపెట్లు కనఁబడెను." అంత వారిద్దరును పందెము వేసిరి. కద్రువు నలుపుచూపిన వినత దానికి దాసి యగునట్లును చూపకుండిన కద్రువె దాసియగునట్లును పందెము కుదిరెను. కద్రువింటికివచ్చి తనమాటనిక్కముగావఁ దలఁచి తన పిల్లలఁ బిలిచి నల్లని వెండ్రుకలు కలిగిన యుశ్శైరూపము దాల్చి

...స్సు. పిల్లలు ధర్మవిరుద్ధమని దాని కొడంబడక పోయిరి. ...ప్పుడు తల్లి వారికి జనమేజయుని సర్పయాగములో నంద ...నశించునట్లు శాపము పెట్టెను. వారు చింత చేయు ...ండ బ్రహ్మ కరుణించి వారిని ఆస్తీకుడనువాడు ముందు ...క్షించగలడని వరమిచ్చెను. ఈవరమును బ్రహ్మదేవుడు ...ంచమీ దివసమున ననుగ్రహించెను. కావున నాదివసము ...ములకు శ్రేష్ఠమైన దినము. ఆదినమునాడు పాముల ...ప్పూజింతురో వారి వంశమందు సర్పదష్ట భయము ...డు. అయిదు పాములను బంగారువిగాని వెండివిగాని ...ట్టివిగాని తుదకు మట్టివిగాని జేసి గోక్షీరముచేతను పాయ ...సముచేతను బూజించి తర్వాత బ్రాహ్మణులను బూజించివా ...కి రుచిరాన్నముల భుజింప బెట్టవలయును. నాగపూజ చేసిన ...భయములేదనుటకీ క్రిందిశ్లోకములను పైభవిష్యత్పురాణము ...నుండియె యుదాహరించుచున్నాను

శ్లో॥ వాసుకిస్తక్షకశ్చైవ కాళియో మణిభద్రకః। ఐరావ
తో ధృతరాష్ట్రః కర్కోటక ధనంజయౌ॥ ఏతే ప్రయచ్ఛంత్య
భయం ప్రాణినాం ప్రాణజీవితాః పంచమ్యాం స్నపయం
తీహ నాగాన్ క్షీరేణ యే నరాః। తేషాంకులే ప్రయచ్ఛం
తి తేభయం ప్రాణదక్షిణాం। శప్తానాగా యదామాత్రాద
హ్యమానా దివానిశం। నిర్వాపయంతి స్నపనైర్నాగానాం క్షీ
రమిశ్రితైః, యేస్నపయంతి వైనాగాన్ భక్త్యా శ్రద్ధాసమ
న్వితాః। తేషాంకులే సర్పభయం నభవేదితి నిశ్చయః॥

పై శ్లోకముల సారాంశ మేమన:-

వాసుకి తక్షకి మున్నగు పేరులు గల సర్పరాజములు ప్రాణికోటికి భయ మిచ్చునట్టివి. ఏజనులు పంచమీతిథియం పాములను (విగ్రహములను) గోక్షీరముచే స్నానముచే యు తురో వారికి సర్పభయములేదు. పాములు తమతల్లిచే శప్ పబడినవి గాన నవిరాత్రింబవళ్లును శాపాగ్నిచే దహింపబ డుచుండును కావున వానికి క్షీరస్నానము శాంతి కలిగించు అట్లు శాంతిబొందిన వగుటవలన భక్తులను కృతజ్ఞతాసూచ ముగా హింసింపనేరవు. తల్లిశాపమును గుఱించిన కారణము ముందే చూపింప బడినది.

ఈభవిష్యత్పురాణ విషయములను జూచిన సర్పము భయముచే నీప్రకారము పూజించుట యారంభమయ్యె ని నేఁడివఱకే విమర్శించిన యంశము ప్రబల మగుచున్నది. ఈపురాణ మందలి సర్పములు కొన్ని మనకితర పురాణము లందుఁబరిచితములై యున్నవి. జనమేజయుని సర్పయాగము న కొన్ని సర్పములు గనబడుచున్నవి. మఱియు కాళీయు డుశ్రీకృష్ణునిచే నొంపఁబడెను. నలుని కుపకారము చేసి వాఁడు కర్కోటకుడు.

ఈనాగ పంచమి యనార్యుల పండుగ యనుట కొక యనుమానము కలుగుచున్నది. ద్రావిడదేశమందు నా మ లప్పట్టలకు కొబ్బర పెంకాయల నైవేద్యము నిచ్చుచు నారికేళము నుండి కేరళనామము దక్షిణదేశము నకుగలిగ

ఈకారణముచేత నిది ఘనార్యుల వంశముగ యనవచ్చును.

పాశ్చాత్య పండితులు,, నాగుల,, ను గురించి కొన్ని చారిత్రిక సిద్ధాంతములు చర్చించి యున్నారు. అందు ముఖ్యముగా ఫ్గ్రా జర్ పండితుడు "నాగపూజ" అను ఇంగ్లీషుగ్రంథమందు వ్రాసిన సిద్ధాంతములలో ముఖ్యాంశములను నిందుదహరించు చున్నాను.

"In the mountainous country bordering upon Kashmir, especially in the tract lying between Chenab & Ravi rivers a remnant of the Nagas of the Mahabharata still survives. Here the serpent gods are worshipped now as they were then not as dangerous reptiles nor as mere symbols but as the deified rulers of an ancient people whose tribal or racial emblem was the Naga or the hooded serpent and whose chief diety was the sun. These people do not call themselves Nagas. The name of the tribe is Taksha. Taxilas ally of Alexander was a Takshaka. The Naga Temples are not dedicated to the serpents but to the Naga Rajas, the ancient rulers of the race. Sesh Nag, Basuki Takht, Karkota, Prithu, & c...... are all worshipped in human form."

దీనిభావమేమన; కాశ్మీర దేశమందలి రావి, చీనాబు నదుల మధ్య నుండు పర్వత ప్రదేశములందు నేటికిని మహాభారతమందు దహరింప బడిన "నాగ" జాతివారున్నారు.

ఇచ్చట శేష, వాసుకి, వాసుదేవ, తక్షక యున్న సు పేరులుగ
ల దేవతలు పూజింప బడుచున్నవి. కాని ఈ దేవతలు పా
ములు గావు వీరిని మనుష్య రూపమున నుంచి పూజించు
చున్నారు. ఈ జాతియొక్క జాతీయ చిహ్నములు మాత్రమే
సర్పములై యుండును. ఇచ్చటి దేవాలయములు ఈ జాతి
లోని పూర్వరాజులను పూజించుస్థలములు. ఈ రాజులవిగ్ర
హములపై మూడు, అయిదు, ఏడు, తలలుగల పాముల
ఫణములను చిత్రించినారు"

పైయంశములను జూడ మన నాగపంచమికిని పై నా
గజాతికిని గొంతసంబంధ మేర్పడుచున్నది. అర్జునుడు కాశ్మీ
రప్రాంతమందలివాడే. కావుననే ఉలూచిని అనగా కాశ్మీర
దేశమందలి నాగజాతిరాజు కూతును పెండ్లాడెను. మఱియు
సుప్రసిద్ధమగు నాగానందములోని కథయు నీ జాతిసంబంధ
మైనది గానున్నది: వాసుకికిని గరుడునికి ద్వేషముండెను. అ
నగా వీరిరువురు వేర్వేరుజాతుల రాజులు. వాసుకి
(నాగజాతిరాజుకు) జీమూతవాహనుండను మంత్రియుండెను
ఇతడుయుద్ధమందు చంపబడెను. వాసుకి దాగుకొనెను. తర్వా
కొంత కాలమునకు వాసుకి తనప్రజలను జీమూతవాహనుని త
నతోబాటిగ పూజింపనాజ్ఞాపించెను. ఈకథవలన నాగజాతి
వారను వారుకొందరు ప్రాచీన హిందూస్థానమందుండిరనియు
వారనార్యులుగా నుండి రనియు వారికిని నార్యులకును యుద్ధ
ములు జరుగుచుండెననియు నూహింపవచ్చును.

నాగులచరిత్రను గురించి టాడ్‌గారుతమ రాజస్థాన కథావళిలో నిట్లు వ్రాసి యున్నారు. "సిరియా దేశములో సూర్యారాధన మునకై యుంచిన ధ్వజస్తంభముపై పాముల చిత్రించినారు. అదేవిధమున హిందూదేవాలయముల లో "నేకలింగస్వామి,, విగ్రహము చుట్టును పాముచుట్టి యున్నది. ఇదేరీతినే (ఇటలీ దేశము లోని) పాంపేనగర మందలి ప్రాచీన దేవాలయమగు ఇసిస్ దేవాలయములో నొక లింగము చుట్టు పామున్నది." (ఇ సిస్ మన ఈశాన్ పదముతో సరిపో లుచున్నది.)

"ప్రాచీన హిందూస్థానములో "ఇందు" వంశమువారు నాగధ్వజులై యుండిరి. వీరు సూర్యపూజకులు. యాదవులు గరుడధ్వజులై యుండిరి ఈసూర్యా రాధకులగు నాగ ధ్వజులకును, గరుడధ్వజులగు యాదవులకును, బహుకాల ద్వేష ముండెను. దీనినే భారతమందు గరుడ,సర్పముల ద్వేషకథల నగా [ఆదిపర్వమందు] వర్ణించియున్నారు. నాగధ్వజులే నా గజాతి వారనబడిరి. వీరు పాండవుల శత్రువులు. ప్రాచీన కాలమందు బహుదేశములలో సర్పములకు, ప్రాముఖ్యత గలిగియుండెను. ఈజిప్టులో హార్మిస్ దేవునికిని, గ్రీసులో మర్క్యూరీ దేవునికి సర్పము ముఖ్య భూషణము.

—Vol. I. Page 419, 420.

"Few subjects have more occupied the notice of the learned world than the mysteries of Ophite worship, which are to be traced

wherever there existed a remnant of civilization or indeed of Humanity. Among the savages of the savannahs of America and the magi of Fars, with whom it was the type of evil—their Ahrimanes. The Nagas are the serpent-genii of the Rajputs, precisely as the Diodorus describes the snake mother of the Scythae, in whose cuntry originated this serpent worship engrafted on the tenets of Zardusht, of the Puranas of the priesthood of Egypt and on the fables of early Greece.................The traditions of the Jains or Budhists originated in the land of the Takshas"

—James Tod's "Annals & antiquities of Rajasthan Vol I. Page 455.

దీనిభావమేమన «నాగరికత వ్యాపించిన దేశములందంతటను సర్ప (నాగ) పూజకలుగుచున్నది. అమెరికా సావన్కులలో ఫర్ దేశపు « మాజీ'' జాతిలో నిదికలదు. సర్పములు «అహ్రిమాను'' లుగా భావింపబడుచున్నవి. అనగా «మానవుల'' «అరి'' [శత్రువులు] అనియర్థము. సిథీజాతిలోను సర్పపూజకలదు, జరత్రుష్టమతమందును, ఈజిప్టులోను, గ్రీసులోను నీయాచారముండెను. జైన బౌద్ధమతములు నాగజాతిలోనే మొదలు ప్రారంభమయ్యెను''

మొత్తముపై టాడ్ చరిత్రకారుని యభిప్రాయములో నాగపూజ బహుప్రాచీనము. బహుదేశములందుండినది. ఆ శాస్త్రవేత్తములలో నాగులు అనసర్పములు కాదు. సర్పములు జాతి

మచిహ్నములు కలజాతి యొకటియుండెను. వీరికిని కూద్రవుల కును(గరుడ చిహ్నములు కల వారికిని) నిరంతరము ద్వేషముం డెను. ఈకథనే భారత మందాదిపర్వములో గరుడుని అమృత హరణమందును, జనమేజయుని సర్పయాగమందును వర్ణిం చియున్నారు.

ఫర్గుజన్ పండితుని యభిప్రాయములో ననాగజాతివారే మొట్టమొదట బౌద్ధమతమును స్వీకరించిరి. నాగజాతివారు క్రీ॥ పూ॥ ౬౯౧ లో మగధ రాజ్యము నాక్రి మించికొనిరి. బుద్ధ భగవానులు క్రీ॥ పూ॥ ౬౨౩ లో జన్మిం చిరి. కావున నీమగధ రాజులగు నాగులే మొదట బౌద్ధులైరి. దస్యులను జాతివారును మొట్టమొదట బౌద్ధులైరనియు, వారు కాశ్మీర, తక్షశిల, గాంధార దేశముం దుండిన ననార్య జాతులనియు, పై పండితుని యభిప్రాయము.

ఇట్లే నాగులు మొదలు బౌద్ధులైన కారణమున వారు బౌద్ధులైన తర్వాత కూడ తమ పూర్వపు బూజా స్మరణము మానలేదు. బుద్ధగయలోని శిల్పములలో కొన్ని విగ్రహములు కలవు. ఈ విగ్రహములు క్రీ॥ పూ॥ ౨౫౦ సం। నాడు నిర్మిం పబడినవి. బార్హాత్ స్తూపములు క్రీ॥ పూ॥ ౨౦౦ సం॥ నిర్మింప బడినవని ఫర్గూజన్ గారి అభిప్రాయము. ఇచ్చటనాగ రాజుల విగ్రహములు కలవు. ఇచ్చటి యొక్క స్తంభము పై నుండు శాసనములలో నీపదములున్నవి.

"ఎలపత్రుడు అనునాగరాజు బుద్ధునిపూజించుచున్నాడు"

అమరావతీ స్తూపములు క్రీ॥ శ॥ 300 ప్రాంతములందలివి. అందొక డాగోబాపై బుద్ధుడుకూర్చును స్థలమున బుద్ధునికి మారుగా నొక ౫ తలల సర్ప విగ్రహ మున్నది. ఈ కారణములచే నాగులు అనువారొక మనుష్య జాతివారనియు, వారు సర్పచిహ్నము లగను సర్పధ్వజులుగను సర్పములందు గౌరవము గలవారుగ నుండిరనియు, వారినుండి భారతాదులందు ప్రసిద్ధులైన నాగరాజులుత్పత్తి యైరనియు, నీపౌరాణికనాగరాజులు నిజముగా సర్పములుకావనియు, నగములందు [పర్వతము లందు — అనగా హిమవత్పర్వతము లందు] వీరు నివసించుచుండుటచే నాగులనబడిరనియు, వీర నార్యజాతులుగానుండిరనియు, వీరిని నార్యు లత్యంతముగా హింసించిరనియు, దీనికి నిదర్శనము జనమేజయుని యజ్ఞమనియు, తర్వాత క్రమముగా వీరార్యులతో సంబంధములు చేసినియు, దీనికి నిదర్శనము అర్జునాదుల వివాహములనియు, తర్వాత బుద్ధుని కాలములో వీరు బౌద్ధులైరనియు, అట్లైనను వీరు తమ జాతీయ చిహ్నములగు సర్పములను వదలక బౌద్ధాలయములందు వీనినుంచి పూజించిరనియు, వారి యాచారమే తర్వాత హిందువులును స్వీకరించిరనియు, పైఫర్గ్యూజు గారి సిద్ధాంతములనుండి మన మూహింపవచ్చును. ఏది ఎట్లున్నను నీపండుగ హిందువులలో చాల ప్రాముఖ్యమైనదనుటలో నేమియు సందేహములేదు.

శ్రీనాథకవి తనశివరాత్రి మాహాత్మ్యమం దిట్లువర్ణించినాడు.

తే.గీ. చలి ప్రవేశించు నాగులచవితినాడు।
మెఱయు వేసం రథసప్తమీ దివసమున।
వచ్చు నీరు ప్రవేశించు జొన్నమీఁదికి।
మార్గశిర పౌష మాసాల మధ్యవేళ॥

ఈ పద్యములో "నాగుల చవితి" యను పదమును గమనించుడు. ఆంధ్రదేశములో నేటికి నీమాటయే నాగపంచమీ పదమునకన్న హెచ్చుగా వాడుకలో నున్నది. ఈ పండుగ రెండుదినములు జేయుదురు. అందుచే నాగులచవితి, నాగపంచమి అను మాటలు ప్రచారమందున్నవి.



# ఏకాదశి



హిందువులలో ఏకాదశీ దినమన్ని దినములలో శ్రేష్ఠముగా పరిగణింపబడుచున్నది. ఏకాదశీ దినమున నుపవాసముండవలయును. అనగా దశమి రాత్రి భుజింపగూడదు. ఏకాదశీ దినమున సుఖమైన కడుగ కూడదు. ఏమాత్రమును భుజింపగూడదు. ద్వాదశి నాడు పొద్దున భోజనము చేయవలయును. ఈప్రకారము నియమముండగా నేటికాలమున నేకాదశీ వ్రతము కలవారు దశమి రాత్రి యథావిధి భుజించి ఏకాదశినాడు రెండుపూటలు ఫలాహార మనియు నుపహార మనియు పేరుపెట్టి కడుపునిండ భుజింతురు.

అన్ని యేకాదశులలో అషాఢ యేకాదశి చాలముఖ్యమైనది. దానినే ప్రథమైకాదశి యని యందురు. చాతుర్మాస్యమప్పటినుండి ప్రారంభమగును. అషాఢ శుద్ధ ఏకాదశి మొదలుకొని కార్తిక శుక్లఏకాదశి వరకు చాతుర్మాస్య మనబడును. ఈనాలుగు నెలలందు వచ్చు యేకాదశీ దినము లన్నియు పవిత్రమని భావింపబడుచున్నవి. అషాఢ శుక్ల ఏకాదశి నాడుచేయు వ్రతమును గోపద్మ వ్రతమందురు. దీనికథ యిట్లు చెప్పుదురు.

పూర్వ మొక మారు యమ సభయందు దేవయత్న శాస్త్రాలు సభలో గూర్చుని యుండ యమునితో నా సభ్యులు తమ దు దుఃఖములకై చర్మము నిష్పాపమని గోరిరి. అప్పుడు యముడు తన భటులకు జాతుర్మాస్య వ్రతమును సర్వశాంతి వ్రతమును జేయని మానవ స్త్రీల చర్మములు తె మ్మని యాజ్ఞాపించెను. ఈ సందర్భమును నారదుని వలన శ్రీకృష్ణుడు విని తన నగరమందు స్త్రీలందరును గోపద్మ వ్రతమును జేయవలయునని యాజ్ఞాపించెను. పూర్వము మాతుడు ఈ వ్రతమును జేయువిధానమును ఋషులతో జెప్పియుండెనట. దానిని శ్రీకృష్ణుడు తన చెల్లెలగు సుభద్రతో నిట్లు చెప్పెను.

ముఖ్యముగా ఆషాఢశుక్ల ఏకాదశినాడు ప్రారంభించి కార్తిక ద్వాదశ్యంతము వరకు నీవ్రతమును జేయవలయును. గోష్ఠమందు గోమయముతో బలి శుభ్రముగా నలికి గంధ పుష్పాదులతో వల కరించి బ్రాహ్మణులకు దానములియ్యవలెను. కదళీస్తంభములతో మంటపమును నిర్మించి సువర్ణకల్పితమైన లక్ష్మీ నారాయణ విగ్రహము నుంచి పూజింపవలెను. ఆదినము విందుచేసికొని భుజింపవలెను."

సుభద్ర కూడనిదే ప్రకారము వ్రతమాచరించెను. వ్రతము ముగిసిన వెంటనే యమదూతలు సుభద్ర చర్మమునకై వచ్చిరి. సుభద్ర తాను వ్రతమాచరించితినని వారితో జెప్పుచుండగనే విష్ణుదూతలు వచ్చి యమదూతలను మొత్తగా దస్సి పలాయితులనుగా జేయువారు బోయి తమ మహావ

వాహనునితోఁ జెప్పుకొన నాతఁడంతయు గ్రహించి యింక నిప్పటికిని పరిహారాగల వ్రతమొందు సాగనో యిప్పటిక దసభటులు పోఁగూడదని శాసించెను.

మార్గశీర్షమాసమందలి యేకాదశి కూడఁ జాలముఖ్యమైనదని చెప్పుదురు. కృతయుగమందు మురనామక దానవుడొకఁడుండెను. వాఁడు మహారౌద్రుఁడును సర్వలోక భయంకరుండును నై ఇంద్రాది దేవతలను శివబ్రహ్మాది మహాదేవులను నిర్జించి వారికి నిలువ నీడలేకుండునట్లుగాఁ జేసెను. అందఱును విష్ణువుతోఁ బోయి మొఱపెట్టుకొనిరి. విష్ణువు వారి స్తోత్రములకుఁ బ్రసన్నుఁడై యీదానవుఁ డెవఁడు. వానిబలమెంత. వాఁడు మిమ్ముల బెట్టు శ్రమపెట్టెది. అని విచారించెను. ఇంద్రుఁడిట్లనెను. పూర్వము బ్రహ్మవంశోద్భవుఁడైన తాళజంఘుఁడను రాక్షసుఁడొకఁ డుండెను. వాని కుమారుఁడే యీమురాసురుఁడు. వాఁడు చంద్రవతీ నామనగరమున కేలిక. వాఁడిప్పుడు సర్వప్రపంచములను జయించి మమ్ముల దిక్కులేని వారినిగాఁ జేసెను.

ఈపలుకులవిని విష్ణుఁడు మహోగ్రుఁడై వానిని ద్వారలోఁ బంపి దేవతలను సహాయము చేకూర్తునని చెప్పి యందఱును దమతమ నెలవులకుఁ బోవ సెలవొసంగెను. విష్ణువు మురనిపట్టముందుండిన రాక్షసులను జంపి మురాసురునితో వేయిసంవత్సరములు బాహుయుద్ధముచేసియు వానినోడింపఁజాలక పోయెను. ఇట్లు పరాజితుండై విష్ణువు పారిపోయి సింహావతి యను గుహ

డుఁదాగి యచ్చటికి దానవుఁడువచ్చినట్టన వానినిదప్పక హరింతునని నిశ్చయించెను. ఇట్లు సంకల్పముకలిగిన వెంట ముకశవ్యక యాయిన శరీరమునుండి యుద్భవించి వచ్చిన తనితో యుద్ధముచేసి వానిని సంహరించెను. ఈమెయేయే కాదశీదేవి. ఈయేకాదశి చేసినమహోపకారమునకు విష్ణువు సంచి యీమెనువరములఁ గోరుమని చెప్పెను. ఏకాదశి ట్లుపలికెను—

తాము నాకు మూడు వరము లనుగ్రహించవలెను. దటిది నేనుసర్వకాలములందు విష్ణుప్రియురాలనుగా నుం డునును. రెండవది నేను సర్వతిథులలోఁ బ్రధానమగు తిథి బూజింపఁబడవలయును. మూడవది లోకమందెవ్వ రెవ్వ నాతిథియందు మహాభక్తి యుక్తులై యుపవసింతురో వారం మముక్తిఁ బొందవలయును. విష్ణువదే ప్రకారమువరము లొ సఁగుటచేతఁ బ్రపంచమందేకాదశీవ్రతము మొదలయ్యెను.

పూర్వముకుచేలుఁడు సహితము సద్దరిద్రుఁడై యే కాదశీవ్రత మాచరించినందున ధనికుఁడయ్యెనని యు జెప్పఁ బడుచున్నది.

ఈయేకాదశీ ప్రాముఖ్యమును గూర్చి సుప్రసిద్ధమగు కథయొకటికలదు. అదెట్లన పూర్వము రుక్మాంగదుఁడను రాజ్యపాలించుచుండెను. అతని రాజ్యమందు సర్వజనులు ఏకాదశి యందు భోజనభోగాదులను వదలిభక్తిచే దేవునిబూజింపవల యని యాతఁడాజ్ఞాపించి యుండెను. రాజాజ్ఞాబద్ధులై జనులం

మన్ననచేయుదనని మెచ్చరించెను. ఇదియేయదనని రంభ యాతని కుమారుని వధింపుమని కోరెను. జంకుగొంకులేక రుక్మాంగదుఁడు తనకుమారునిచంప నుద్యుక్తుడై శిరము ను ఛేదింప తనఖడ్గము నెత్తెను. అప్పుడువిష్ణువు ప్రత్యక్షమై రుక్మాంగదునిభక్తికి మెచ్చికొని యాతనికి మోక్షమొసంగెను.

ఏకాదశి ప్రతి మాసమందు రెండుమారులు శుక్లపక్షమందును కృష్ణపక్షమందును వచ్చును. ఇట్లు మొత్తముపై సంవత్సరమునకు ౨౪ ఏకాదశులు వచ్చును. ప్రతిఏకాదశియునేదోయొక మాహాత్మ్యముకలదిగా పౌరాణికులు వర్ణించియున్నారు. ఈవిషయములను సంగ్రహముగా నిందు నేకాదశీ మాహాత్మ్యమునుండి యుదహరించుచున్నాను.

౧ చైత్రశుక్ల పక్షము — కామదైకాదశి; —
లలిత గంధర్వుడను వాడు సంగీతము సరిగా పాడనందున రాక్షసుండుగా శిక్షింపబడెను. వానిభార్య లలిత యావ్రతమును జేసి భర్తృశాప విముక్తిగావించెను.

౨ చైత్రకృష్ణ పక్షము — వరూధి న్యేకాదశి; —
ఈఏకాదశి నెవ్వరు చేయుదురో వారికి ౧౦౦౦ గోవుల దానము చేసిన ఫలము లభించును.

3 వైశాఖ శుక్లపక్షము — మోహిన్యేకాదశి
ధృష్టబుద్ధియను కోమటి తనధనమంతయు దుర్మార్గములందు వ్యయపఱచెను. అందుచేగృహబహిష్కృతు

డయ్యెను. అడవియందు దిరుగుచు నొక మునిచే నాదేశి తుడై యీవ్రతమును జేసి ధనమును బొందెను.

౪ వైశాఖ కృష్ణ పక్షము — అపరైకాదశి:

ఈనాటి యుపవాసమువలన స్నాన దాన ఫలములు చేకూరును.

౫. జ్యేష్ఠశుక్ల పక్షము — నిర్జలైకాదశి:

భీముడు తిండిపోతు. ఏకాదశినాడుపవాస దీక్షను జాలనివాడు. అందుచే వ్యాసుడితనితోనీ యొక్కయేకాదశి నాడు నిర్జల నిరాహార దీక్షతో నెట్టునుండుమని చెప్పెను. అతని జన్మలోనిదొక్క యేకాదశిని చేసి అందుచే ౨౪ ఏకాదశులు చేసిన ఫలమును బొందెను.

౬. జ్యేష్ఠకృష్ణ పక్షము :— యోగిన్యేకాదశి :—

కుబేరుని తోటమాలి ప్రతిదినము శివార్చనకు పూలు తెచ్చితన యేలిక కిచ్చుచుండెడివాడు. ఒకనాడు వాడు భార్యా లోలుడై తన సేవయందు ప్రమత్తుడయ్యెను. కుబేరుడు వానిని కుష్టుగాశపించెను. ఈ ఏకాదశి యందలి యుపవాసముచే వాడు రోగ ముక్తుడయ్యెను.

౭ ఆషాఢశుక్లపక్షము:— శయనైకాదశి:—

ఈనాడు చాతుర్మాస్యము ప్రారంభ మగును. విష్ణువు క్షీరాబ్ధిశయనుడగును.

౮ ఆషాఢకృష్ణపక్షము.--- కామికైకాదశి:--.
అభీష్టసిద్ధికలుగును

౯. శ్రావణశుక్లపక్షము: - పుత్రదైకాదశి:_-
మహిజిత్తనువానికి సంతానము లేక యీయేకాదశి
చేసికొని కనుగొనెను

౧౦ శ్రావణకృష్ణపక్షము:- అజైకాదశి:--
హరిశ్చంద్రుడు రాజ్యదారాపుత్రులను పోనాడుకొని
యీవ్రతమును జేసి మరలయన్నిటిని బొందెను.

౧౧. భాద్రపదశుక్లపక్షము: —— పరివర్త్యేకాదశి:-
విష్ణువు నిద్రజెంది రెండుమాసములైనది. ప్రక్కత్రిప్పి
నాడు. ఎడమనుండి కుడికిబొరలినాడు. కాన యీయే
కాదశిపేరు పరివర్త్యేకాదశి.

౧౨. భాద్రపదకృష్ణపక్షము;- ఇందిరైకాదశి:_:
ఇంద్రసేనుడను వాడుయమలోకమందు బాధపడుచుం
డెను. అతనికొడుకీయేకాదశిచేసి తండ్రిని స్వర్గమున
కంపెను.

౧౩. ఆశ్వీజశుక్లపక్షైకాదశి:_
ఇదిస్వర్గప్రాప్తి నిచ్చును

౧౪. ఆశ్వీజకృష్ణపక్షము— రమైకాదశి:_
శోభనుడనురాజుకు ఈఏకాదశిచే స్వర్గప్రాప్తికలిగెను.

౧౫ కార్తికశుక్లపక్షము:— ప్రబోధిన్యేకాదశి:-

ఈదినముచాతుర్మాస్యాంతము విష్ణువు ప్రబోధము
(మెలకువ) పొందును కావున నీపేరు.

౧౬. కార్తీకకృష్ణపక్షము;— ఉత్పత్త్యేకాదశి:-
మురమర్దన మీనాడుజరిగెననియు, ఏకాదశీదేవియా
నాడేజనించెననియు, నింతకుపూర్వము వ్రాసినకథకు
సంబంధించినది.

౧౭. మార్గశీర్షశుక్లపక్షము:— మోక్షదైకాదశి:-
వైఖానసుడనురాజు తనతండ్రి నరకమందున్నట్లెరిం
గాంచి యీవ్రతముచేసి తనతండ్రిని స్వర్గమునకంపెను.

౧౮. మార్గశీర్షకృష్ణపక్షము:— సఫలైకాదశి:-
మాహిష్మంతుని కొడుకు లుంపకుడనువాడు దేశభ్ర
ష్టుడై యొక యేకాదశినాడు ఏమియు దొరకక రా
త్రంతయు నుపవాసముండినందున నీయజ్ఞాత కార్యము
నకు సహితము సత్ఫలముబొందెను.

౧౯. పుష్యశుద్ధపక్షము:— పుత్రదైకాదశి:-
సుకేతుడను రాజీనాటి యుపవాసముచే గొడుకును
గాంచెను.

౨౦. పుష్యకృష్ణపక్షము:— షట్తిలైకాదశి:-
ఈనాడు ఆఱు విధములుగా నూలను నుపయోగింప
వలెను. (౧) స్నానముచేయు నీటిలో వేయవలెను.
(౨) తిలపిష్టము శరీరమునకు రుద్దుకొనవలెను. (౩)

ఆకు నూలగింజల తినవలెను. (౪) పానోదకములో నూలను వేయవలెను. (౫) బ్రాహ్మణులకు తిల దానము చేయవలెను. (౬) దేవతలకు సమర్పించవలెను.

౨౧. మాఘ శుక్లపక్షము:— జయైకాదశి:-
ఇంద్రసభలో పుష్పవంతుడనువాడు తన భార్యను జూచికొనుచు నాట్యములో నెత్తుతప్పగా ఇంద్రుడీ దంపతుల రాక్షసులనుగా శపించి వీరీ దివసమున నేమి యుదినుటకు లభింపనందున నుపవాసముండిన కారణమున శాపవిముక్తులైరి.

౨౨. మాఘ కృష్ణపక్షము:- విజయైకాశి:-
రాముడు లంకపై సేతువు నిర్మించిన దీదినమేయట.

౨౩. ఫాల్గుణ శుక్లపక్షము:. ఆమలకైకాదశి:-
చిత్రరథుడు పరశురాము నిదినము బూజించెను.

౨౪. ఫాల్గుణకృష్ణ పక్షము- పాపమోచన్యేకాదశి:-
మంజు ఘోషయను నప్సర మేధావియను ముని తపోభంగ మొనర్చిశపింప బడెను. ఈ ఏకాదశి వలన న్నాపవిముక్తి బొందెను.

విమర్శ

ప్రతిమతమునందును నుపవాస పద్ధతికలదు. మహమ్మదీయులందొక నెల పర్యంతము పగలంతయు నుపవాసముండుటయు రాత్రి భుజించుటయు గలదు. వైద్యులు సహితము

ఉపవాస మప్పుడప్పుడుండుట యారోగ్యప్రదమే యనియం
దురు.

ఈకారణముచేతఁ గాఁబోలు హిందువు లేకాదశి నాఁ డుపవసింపవలసినదిగా నేర్పాటు చేసియుందురు. ఈ పద్ధతివలన నిహమును బరమును జేకూరునట్లొనర్చినారు. ప్రతి ఏకాదశియందు నుపవాసవ్రతము నా జనసామాన్య మాచరించుటలేదు. బ్రాహ్మణులలో విశేషముగా నుపవాసము చేయుదురు. కాని తక్కిన జాతులు ఆషాఢశుద్ధఏకాదశినాఁడు మాత్రము పవసించి ద్వాదశినాఁడు పండుగచేసి తృప్తిపడుదురు.

ఉపవాసములవలన నారోగ్యముండునని చెప్పుటకు మారుగా నేకాదశియనుదేవి విష్ణుశరీరమునుండి యుద్భవించెననియు, విష్ణువుచే సృష్టింపఁబడిన వాఁడొకఁడు విష్ణువునే యోడింప విష్ణువు పారిపోయెననియు, విష్ణువుచేగా నివనివిష్ణుశరీరోద్భవయగు నొక పడుచుచే నయ్యెననియుఁ జెప్పుట యసంగతముగానున్నది. కల్పకుల కడ్డమేదియు నుండనేరదు. ఏకాదశి వ్రతమును గురించి వేమనయోగి యభిప్రాయము చూడుడు:—

ఆ॥ దశమి యేకాదశి యటంచు వ్రతముబూని
మెతుకు దినకున్న దుర్గుణమేలమాను।
పుట్టపైగొట్ట నురగంబు పట్టుబోదు।
విమలగుణ రాజ యోగీంద్ర వేమనార్య॥



# శీతలా సప్తమి



శీతలాదేవిని బెంగాలు దేశమందు తప్ప యితర ప్రాంతములందు పూజింపరు. పేరు మాత్రము భిన్నమైనను నితర ప్రాంతములలో నిట్టి దేవతనే వివిధనామములతో బూజింతురు. ఈశీతల స్ఫోటకవ్యాధికి అధిదేవత. ఈ దేవతనే మన తెనుగులో ఎలమ్మయందురు. "అమ్మ" పోయుటయనియు స్ఫోటకమునకు ముఖ్యమగు పేరు. ఈ అమ్మ ఎల్లమ్మ. మన దేశములో పామర జనులు ప్రతియేట ప్రతి గ్రామమందు ఎల్లన్నమను చేయుదురు. ఆంధ్ర దేశమందు ప్రాంతమందును నీ ఎల్లమ్మ చాల ప్రసిద్ధిపొందిన దేవత. ఓరుగంటి ఎల్లమ్మ యనియు, పానుగంటి ఎల్లమ్మ యనియు నేటి కిని జనులు వాకొను చుందురు. శల్లభరాయుడు తన క్రీడాభిరామములో నీ ఎల్లమ్మనే ఏకవీరాదేవినిగా వర్ణించి యున్నాడు. అలంపురీ మాహాత్మ్యములో రేణుకాదేవియేఎల్లమ్మ యయ్యెనని

శ్లో॥ "ఎల్లమ్మ ఇతినామ్నా సాదేవీపరికీర్త్యతే"

అని వర్ణించి యున్నారు. ।

"అమ్మ" పోసిన వారికి ఎల్లమ్మ నైవేద్యము నిచ్చిన జాడ్యము పోవునని జనులు విశ్వసింతురు.

రాజపుత్ర స్థానములో మనువుబిడ్డ "ఎల్ల" యనియు, నామె బుధుని వివాహమాడెననియు, నీ ఎల్లయే భూదేవతయనియు, టాడ్‌తన రాజస్థానకథావళిలో వ్రాసియున్నాడు. ఈ "ఎల్ల"యే రాజపుత్రులు ఆంధ్రదేశమునకు వచ్చినపుడు వారి వెంటవచ్చి యిచ్చట "ఎల్ల"మ్మ అయ్యెనో యేమో!

ఈ ఎల్లమ్మనే బెంగాలు దేశమంతట శీతలాదేవి యను పేరుతో బూజింతురు. ఈదేవి వాహనము గాడిద.

"యాదృశీశీతలా దేవీ తాదృశఃఖరవాహనః"

అని మన దేశమందు సామెతయు గలదు. ఏమి చిత్రమో యీదేవత వాహనమును జనులు ముట్టకొనరు. ప్రమాదమునే ముట్టుకొనిన స్నానముచేయుదురు.

ఈ శీతలాదేవిని ప్రతి సంవత్సరము చైత్ర బ॥ ౭ దివసమునం బూజింతురు. ఈ దేవికి వేపచెట్టు చాల ప్రియము కావున జాడ్యస్థులకు వేపపుల్లలతో గూడిన నీటిని బ్రాయుదురు. నిజముగు తత్త్వమేమన వేపచెట్టులో ననేక సుగుణములున్నవి. స్ఫోటకమునకు ముఖ్యముగా నీవేప పుల్లలలో గాచిన నీటిని నౌషధముగా నిచ్చిన జాడ్యము కుదురునని ఆయుర్వేద గ్రంధములు నిరూపించు చున్నవి. కావున శీతల

కన్న వేపచెట్టు గుణము నిచ్చునది. అదేవిధముగా గార్దభము యొక్క ప్రాముఖ్యమేమన జాడ్యస్థులకు దాని లనిత్తురు. కావున నీజంతువు కూడ వేపచెట్టువలెనే పనికి చ్చునట్టిది.

మొత్తముపై నీశీతలా వ్రతము బెంగాలునకు సం బంధించినది—"టీకాలు" తీయు నీకాలములో నీదేవీ మాహా త్మ్యము కొంతతగ్గి యుండవచ్చును.



# వసంత పంచమి



ఇది మాఘ శుద్ధ పంచమినాడు జరుగును. ఈ దినమున సరస్వతీ పూజ జరుగును. ఇది ఆంధ్ర దేశములో ప్రచారమందు లేదు.

మహారాష్ట్రులలోను బెంగాలు జనులలోను నిది చాల ప్రాముఖ్యముగా నున్నది. సరస్వతి మన పౌరాణిక గాథ యందు విద్యాధిదేవత బ్రహ్మకు బిడ్డయు భార్యయునై య న్నదట! సంగీత సాహిత్యముల కధిష్ఠాన దేవత! మఱియు వీణాపాణి. హంసవాహనము కలది.

ఈ పండుగనాడు సరస్వతిని విద్య లభించుటకై విద్యాభిలాషులందఱు పూజింతురు. తాటియాకుల గంటము గ్రంథములు మున్నగు విద్యాసాధనము లన్నిటి సీదే యెదుట బెట్టి గంధపుష్పాదులతోఁ బూజింతురు. విద్యాధి దేవతను కల్పించుట యార్యుల మర్యాదయే కాక గ్రీసుదేశ దేశవాసులై యుండిన ప్రాచీనులందును గలదని చరిత్రలు తెలుపుచున్నవి. కవులు తమ తమ గ్రంథములను ప్రారం భించునప్పుడు సరస్వతీ దేవిని ప్రార్థించి యున్నారు.

దాసువంటి మహాకవులను సరస్వతీదేవి యొక్క యవతార ములని జనులు గాథలు చెప్పుకొందురు. ఇట్లు సరస్వతీదేవి విద్యకు అధిదేవతయై మాఘ మాసమందుఁ బూజింపఁబడు చున్నది. ఈ పై విషయములను గుప్తేగారు వ్రాసియున్నారు. కాని హిందీ గ్రంథకారులగు భవానీ ప్రసాదుగారీ పండుగ వసంతర్తు సంబంధమైనదని వ్రాసియున్నారు. ఈ యిరువురు పండితులు తమ తమ సిద్ధాంతములకుఁ దృప్తికరమగు కారణ ములు గనఁబఱుపలేదు. ఏదియెట్లున్నను నీపండుగ నుత్తర హిందూస్థానమందు విశేషముగ జరుగుచున్నది.



# మహాశివరాత్రి



ప్రతి సంవత్సరము మాఘకృష్ణ చతుర్దశీ దివసమున నీపండుగఁ జేయఁబడును. ఈ శివరాత్రి శైవులకుఁ జాల ముఖ్యమైనది. శివరాత్రినాఁడు భక్తులందఱు పగలంతయు నుపవాసముండి రాత్రియంతయు మేల్కొని యుందురు. దీనినే జాగరమని యందురు. మఱునాడు ప్రాతఃకాలముననే రుచిరాన్నముల నారగించెదరు.

ఈ శివరాత్రియందుఁ బైనఁజెప్పిన రీతిగా నాచరించి శివపూజలు చేయువారి పాపము లన్నియు నాశనమై వారికి ముక్తి దొఱకునని చెప్పెదరు. అట్లాచరించని వారు ఘోర నరకముల ననుభవింతురు. ఈ శివరాత్రిని గుఱించి లింగపురాణమం దిట్లున్నది.

ఒకనాడు కైలాస శిఖరముపై పార్వతీ పరమేశ్వరులాసీనులై యుండఁ బార్వతీదేవి భర్తతో నిట్లు ప్రశ్నించెను. "లోకమందు సర్వ వ్రతములలో నుత్తమ వ్రతమేది? ఆ భుక్తి ముక్తి ప్రదాయక మగు వ్రతమును గుఱించి నాకు బోధింపవే యనెను". అంత శివుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "దేవీ! పరమ రహస్యమగు నీవ్రతమును గుఱించి వినుము. అన

మహాశివరాత్రి వ్రతమందురు. మాఘకృష్ణ చతుర్దశీదివసమున దాని నాచరింప వలెను. తెలిసికాని తెలియకకాని వ్రతమి యాచరించువాఁడు మోక్షమును బొందును. ఎన్ని పాపములఁ జేసినవాఁడైనను నీవ్రతము ను జేయుమనుజుఁడు యమలోకము నుండి తప్పించుకొని శివలోకము నొందును. దీనికినిదర్శనము గాఁబూర్వము జరిగిన వృత్తాంతము నొకదానిని వినుము. పూర్వ మొకప్పుడు జీవఘాతకుఁడై జంతు మాంసముచే కుటుంబ పరిపాలకుఁడై ననొక నిషాదుఁడుండెను. వాఁడు నల్లనిశరీరియు పదాధనుర్ధారియు నై యుండు వాఁడు. వాఁడొక శివరాత్రినాఁ డొక కోమటి కప్పుఁబడి శివాలయములో బంధింపబడెను. రాత్రి యంతయు వాఁడుభక్తుల శివ శివా రావ పూర్వక స్తోత్రముల ను విని యుపవసింప వలసినవాఁడయ్యెను. ప్రాతః కాలమున కొందఱుభక్తులు వాని ఋణమును గోమటికిఁజెల్లించి వానిని విముక్తునిగానొనరించిరి. ఇట్లు ముక్తుఁడై యాబోయ మృగ యార్థమై యరణ్యమున కరిగెను. అరణ్యమం దొంటరిగాఁ బోవుచుఁదాను రాత్రికాని వేసారినట్టి శివశి శబ్దములను హే లనా పూర్వకముగా నుచ్చరించి కొనఁ దొడఁగెను. దినమంత యు నరణ్యమున మృగముల వెదకి వెదకి తుదకొక్కటి యుఁ గానఁడయ్యెను. సాయంకాల మగుడు వాఁడొక తటాకమును సమీపించి రాత్రిని చరించు సింహశార్దూలాదుల నుండితప్పించు నుట కై యొకబిల్వవృక్షము నెక్కెను. ఆవృక్షముక్రింద నొక గుప్తలింగ ముండినది వాఁడెఱుఁగఁడు. వాఁడుచెట్టు

కున్నప్పుడడ్డము వచ్చు కొమ్మలవిరిచి క్రిందఁ బారవేయు చుండెను. బిల్వపత్రములు లింగమునకుఁదలఁపని పూజగాఁప రిణమించుచుండెను. రాత్రియంతయుఁ జెట్టుపైనుండి పడుదు నేమోయను భీతిచే వాఁడు నిద్రించలేదు. ఉబుసుపోనట్టి వే ళలవేళనగా శివశివయని నదరుచుండెను. ఇట్లు మొదటి మూడు యామములుగడచు వఱకు వానిపాపములలో నా ల్గవభాగము నశించిపోయెను. ఇంతలో నొకలేడిజలపానార్థమా చెరువుదగ్గఱకు వచ్చెను. బోయదానిఁజూచి యాఁకొన్నవాఁడ గుట సంతసించి దానినిఁజంప వింటిపై బాణము సంధించెను. మృగముసహితము హఠాత్తుగా నాబోయనుజూచి మనుష్యవా క్కుతోనిట్లు సంబోధించెను.

ఓయీ నన్నేలచంపెదవు!

బోయ:- నేనునాతల్లియుఁ గుటుంబమును నొకదినమునుండియా హారములేక యుపవాస మున్నారము. అయితే నేనెన్నియో జంతువులఁ జంపితిగాని నీవలె మాటలాడనేర్చిన జంతువును జూడలేదు. ఈవిపరీతమునకు గారణము ముందు జెప్పుము.

లేడి:- వ్యాధోత్తమా! నాయుదంతమును వినుము. నేను రంభను. హిరణ్యాక్షుడను దానవుని ప్రేమించి వానితోవినోదము లందేచిక్కి శివునికొలువుమఱచితిని. ఈశ్వరుఁడునిజకోపా క్రోధారుణితనేత్రుఁడై నన్నును నాదానవుని పండ్రెండు సంవ త్సరములు మృగీమృగములుగా నరణ్యమందు సంచరించ

పిమ్మట యొక్క వ్యాధుని స్పర్శనముచే ముక్తి పొందునటుల శాపింపఁబడితిని. ఓయీ వ్యాధా నేను పూర్ణగర్భవతిని. నాపై మాంసమేమియు లేదు. ఇంతలో నింకొక లేడి రాఁగలదు. దాని మాంసము నీదినము. లేక నన్నే చంపఁగోరిన నేను నావసతికిఁబోయి ప్రసవించి యిచ్చటికి వచ్చెదను.

బోయ.- నీవు ప్రాణాపాయము నుండి తప్పించుకొనుటకిట్టి యుపాయమును వెదకినట్లున్నది.

అప్పుడా జింక యనేక శపథములు చేసి వ్యాధుని యనుమతిఁబొంది నిజగృహమున కేగెను.

అంతమధ్యరాత్రియయ్యెను. వ్యాధునికి నిదుర లేదు. శివశివయను మాటమాత్రము మరువలేదు. ఇట్లనాలోచిత వ్రతముచేయు వాని పాతకములు సగమువఱకు ధూతములయ్యెను. అంతమధ్యరాత్ర్యనంతర మింకొక పెంటిజింక యాకొలను జేరెను. దానిపై వ్యాధుడు తన బాణము నేయ సంసిద్ధుఁడయ్యెను. ఆజింకయు వీనినిజూచి యిట్లనెను. "నేను నాభర్తను వెదకుచు నిటువచ్చితిని. నీవేమయిన జూచితివా" లుబ్ధుడు స్తబ్ధుడై దీని భాషణము జూచి నీకన్న పూర్వ మొక జింక వచ్చియుండెను. అదేమైన నన్ను బంపెనా అట్లయిన నీవు చచ్చుటకు సంసిద్ధురాలవై యుండుము. అనియనెను. జింక యిట్లనెను. నేను లేఁబ్రాయము దానను. నేను విరహవ్యథచే నార్తి నొందుచున్నాను నన్ను జంపి నీవేమి లాభము పొందుదువు. ఇంతలో నీ దుర్మార్గమున నొకబలిసిన జింక రాగలదు.

దానిమాంసమునీకు దృప్తిగలిగించును. అటుకాదేనిసేను మ రలతప్పక వత్తును"

బోయుడానిని శపథముచేయు మనెను. జింకయటులేచేసి యింటికిఁ బోయెను. కొంతసేపటికొక కృష్ణమృగమా చక్కవ చ్చెను. బోయపూర్వమువలెనే దానినిజంపనుద్యుక్తుఁడయ్యెను. కృష్ణమృగమా బోయునఁజూచి వాఁడుతనపెంటిని గూడఁజంపి యుండునని యూహించి యిట్లువిలపింపఁదొడఁగెను.

(దాంపత్యలాభమునుగుఱించి చెప్పిన యీభావములు చాలసుందరముగా నుండుటచే మూలమునిచ్చట నుదహరిం తును.)

శ్లో॥ తయావిరహితస్యాస్య నూనంమృత్యుర్భవిష్యతి।
మహాకాలకృతంపాపం యద్భార్యాదుఃఖమాగతం॥
భార్యయానసమంసౌఖ్యం గృహేపిచవనేపిచ।
తయావినానధర్మోస్తి నార్థకామోవిశేషతః॥
వృతమూలేపిదయితా యత్రతిష్ఠతితద్గృహం।
ప్రాసాదోపితయాహీనః కాంతారాదతిరిచ్యతే॥
ధర్మకామార్థకార్యేషు భార్యాపుంసస్సహాయినీ।
విదేశేచగతస్యాపి సైవవిశ్వాసకారిణీ॥
నాస్తిభార్యాసమోబంధు ర్నాస్తిభార్యాసమాగతిః।
నాస్తిభార్యాసమంలోకే వరస్యార్తస్యభేషజం।
యస్యభార్యాగృహేనాస్తి సాపిచేత్ప్రియవాదినీ।

అరణ్యం తేనగంతవ్యం యథారణ్యంతథాగృహం ॥
భార్యావియోగమనునది మహాపాపఫలము. భార్యావిరహము చావుదెచ్చును. గృహమందుండినను నరణ్యమందుండినను భార్యగలవాని సౌఖ్యమే సౌఖ్యము. ఆమెలేనిది ధర్మము లేదు. కామములేదు. అర్థములేదు. చెట్టుక్రిందసంసారము చేసినను భార్యగలవాని కదే గృహము. కాని భార్యలేనివాడు ప్రాసాదములందుండినను వానికవియరణ్యతుల్యములే! పురుషుడు భార్యాసహాయుడై సకలపురుషార్థములను సాధించును. విదేశములందు భార్యయే విశ్వాసకారిణి. భార్యతో సాటియగు బంధువులులేరు. ఆర్తుడైన నరునికి భార్యవంటి యుత్తమ భేషజమింకొకటిలేదు. ప్రియవాదిని యగు భార్యయెవనికిలేదో వాడువనమునకేగవలసినదే! ఏలయన వాడిట నుండినను నదియరణ్యతుల్యమే.

ఇట్లు దుఃఖించి వ్యాధునితో "ఓయీ నీవు రెండు వెంటి జింకలఁ జూచితివా? వానినేమైన జంపితివా?" యని ప్రశ్నించెను.

వ్యాధుడవి లనితో మరల వత్తుమని మాట యిచ్చిపోయినట్లు చెప్పెను. అంత కృష్ణమృగ మిట్లనెను "నేను గృహమునకుఁ బోయి వానితో విహరించి మరల నీదగ్గఱకు వచ్చెదను. నిమ్మట చంపవచ్చును. అని నచ్చఁబలికి సెలవు తీసికొనిపోయెను. మృగము గృహమునకు బోవుచుండగా వెంటి జింక శిశువును గనియుండెను. ఇంకొక దానితోఁ గ్రీడించి

పిమ్మట తన కుటుంబమును జూచి దుఃఖముతోఁ దాను వ్యాఘునికి శరీరము సమర్పింపఁ బోవుచున్నానని దెలిపెను. పెంటి జింకలు భర్త వియోగమును భరింపజాలక భర్తతోఁ బాటిలో నమే చెమదికూడదని తామును భర్తను వెంబడించి చత్తుమని పట్టుపట్టెను. తుదకు నామూడు జింకలును తెల్లవారువఱకు బోయదగ్గఱకు వచ్చి తమను జంపుమని కోరెను. వ్యాధుని హృదయములో నొక గొప్ప మార్పు కలిగెను. జింకలయొక్క సత్యనిష్ఠను జూచి యాశ్చర్యమంది వానిని జంపుట కిష్టపడనక తన విల్లును తునకలుగా జేసి బాణముల బాఱవైచి నాటినుండి యికముందు జీవహింస చేయనని వానిఫలగొని శపథముచేసెను.

అంతనాకాశమునుండి పుష్పవర్షము కురిసెను. దివ్యయానమువచ్చి జింకలను లుబ్ధుని సశరీరముగా దీసికొనిశివలోకమున కేగెను. కృష్ణమృగము నేటికిని నాకాశమందొక గొప్పనక్షత్రమై వెలయుచున్నది దానినే మృగశీర్షయని యందురు. దానివెనుకనుండు నక్షత్రమునే లుబ్ధక [బోయ] నక్షత్రమందురు. ఇట్లు తెలియకయే శివరాత్రినాఁడు జాగరణముచేసి యుపవసించినవారికి శాశ్వత పదవులు దొరికినప్పుడు తెలిసి భక్తిపూర్వకముగా శివుని భజించువారికి ముక్తి గలుగుననుటలో నేమియు సందేహము లేదని శివుడు శివరాత్రి మాహాత్మ్యమును గురించి పార్వతీదేవితోఁ జెప్పెను.

## విమర్శ

ఈశివరాత్రి శైవులకే ప్రధానమైనది. శ్రీరామనవమి, లేక కృష్ణాష్టమివలె నీశ్వరుడవతార పురుషుడుగాఁ బరిగణింపఁబడినవాఁడు కాఁడు. కావున నిది శివజయంతిగా భావింప వలను పడదు. ఇక సర్వేశ్వరునకు దినములన్నిఁటిలో నొకదినమ్ము ప్రియముగా నుండనేరదు. ఇది కేవలము శైవులచేఁ గల్పింపఁబడినదిగాఁ దోచుచున్నది. ఈశివరాత్రి మాహాత్మ్యమును గుఱించి చెప్పు పురాణములు కూడ లింగపురాణ, స్కాంద పురాణములు అనగా శైవసంబంధ పురాణములు.

వైష్ణవులు అనంతచతుర్దశి నెట్లు పవిత్రముగా భావింతురో యట్లే దానికిఁ బ్రత్యామ్నాయముగాఁ దమకేలయొక చతుర్దశి పవిత్రముగా నేర్పాటు చేయఁబడకూడదని శైవులీవిధమాచరించియుందురు.

దక్షిణమున నాంధ్రదేశమున నీశివరాత్రిచాల ప్రాముఖ్యముగాఁ జూడఁబడుచున్నది. పూర్వమెట్లు జరుగుచుండెనో కాని యిప్పుడు అనేకనగరములందు పేరునకు శివరాత్రియేకాని జనులు దుష్టాభ్యాసములతోఁ గాలము గడపుచుందురు. రాత్రియంతయు జాగరము చేయుట దేవుని భజించు నిమిత్తమైయేర్పాటుచేసియుండ యాప్రధాన విషయమును మాటు పెట్టి రాత్రి యంతయు నెటులో యొకరీతి మేల్కొనియుండుటయే ప్రధానమని యెంచి యనేకులు జూదము పేకాట,

లు, గవ్వల యాటలు సీఁకను నేమేమో యాటలు ద్రవ్యము పెట్టి యాడు చుందురు.

ఈశివరాత్రి గుఱించి గుప్తే పండితుఁడొక నూతన సిద్ధాంతము ను లేవదీసినాఁడు. ఇంతకుఁబూర్వము వ్రాయఁబడిఁ లుబ్ధక మృగముల కథను జూడ నీకథ కేవలము మృగశీర్షానక్షత్రము యొక్క సంబంధమైనదిగాఁ దోచుచున్నదని వారు వ్రాసియు న్నారు. సిద్ధాంతులు లుబ్ధక నక్షత్రమును యోగతారయని పిలుతురనియు నీమృగశీర్షా రాసిచంద్రుని మైదవ గృహమని యుఁ జెప్పుదురట. రత్నమాలయను గ్రింధములో మృగశీ ర్షను జింకతలగా వర్ణించినారట. ఛాల్డియా దేశము బహుపురా తదేశము. వేదకాలమందు ఛాల్డియా దేశమునకు మనభార తదేశమునకు వ్యాపారము విశేషముగా. జరుగు చుండెను. అట్టిఛాల్డియా దేశపు జ్యోతిశ్శాస్త్రమందు నక్షత్రికూటమం దీతొమ్మిదవ నక్షత్రమండలిని ధనుస్సులని యందురట. ఈధ నుస్సు మన కథలోని ధనుర్జీవియగు లుబ్ధకునిలో సరిపో లును. ఛాల్డియా శాస్త్రమందు ధనుస్సు తర్వాత నక్షత్రి మును (మేషము) మేకయందురు. ఈమేక బహుశమన జింక కు మారుగానుండియుండును.

అయితే యీనక్షత్రములకును శివరాత్రికినేమి సంబం ధమని యాలోచించిన శివరాత్రి నాటిరాత్రి చాలదీర్ఘమైన దియు దట్టమగుచీకటితో నిండినదియు నగుటచే నారాత్రినక్ష

త్రములను బరీక్షించుట కనువగునని యూదిన మేర్పాటుచేసి యుందురేమో చెప్పజాలను అని యీగుప్తేపండితుఁడు వ్రాసియున్నాడు.

ఈవిమర్శన యందు యుక్తి హెచ్చుగా నున్నను యుక్తముగా దోపదు. మనవారు నక్షత్రముల కొఱకు జనుల నందఱను మేల్కొనుమని చెప్పియుండరు. శివరాత్రి మాహాత్మ్యమునకై యొకకథను గల్పించి యాకథనుండి యొకనీతిని బోధించుటకై యానక్షత్రములను భక్తికినిదర్శనముగా జూపి యుందురు. ఇది మన పౌరాణికులకుఁ గ్రొత్తదికాదు. బాల భక్తాగ్రేసరుండగు ధ్రువుండు ధ్రువ నక్షత్రమై నిలిచి నాఁడు. సప్తర్షులు నక్షత్రమండలియై నిలచినారు. పతివ్రతాగ్ర గణ్యయగు నరుంధతియు నిజనాథుని ఛాయక యాకాశమందు భర్తచెంత నిలిచి నూతనవధూవరుల కందఱకును దర్శనీయమైయున్నది. కావున మనకవులకుఁ గూడ శివభక్తులైన లుబ్ధకమృగములు నక్షత్రము లైనవని బోధించి యున్నారు.

విశేషాంశము:—

భవిష్యత్పురాణమందు నీపండుగను, "శివచతుర్దశి"యను పేరున వర్ణించినారు. అందులైంగ్యమగు మృగ లుబ్ధకకథలేదు. మరియు లింగపురాణమందు మాఘకృష్ణచతుర్దశీదినమును మహాశివరాత్రిగాఁ జెప్పబడియుండనిందు మార్గశీర్ష శుక్ల త్రయోదశి ముఖ్యదినముగాఁ జేర్కొనఁ బడియున్నది. ఇది యేశివరాత్రియో తెలియదు. కాని జనులందఱు లింగపురాణ

రీత్యాయాచరించుటచేత నదియే ప్రమాణముగాఁ గొనవలసి యున్నది. ఇచ్చట భేదమున్నయంశమును జూపించుటకై పై పురాణవచనము నుదాహరించితిని. ఇఁతియు గాక శివపురాణ మందిట్లు వ్రాసియున్నారు.

శ్లో ॥ కృష్ణపక్షే భవేద్యావన్మాఘమాసే చతుర్దశీ
శివరాత్రిరితి ప్రోక్తా మహాపాతకనాశనీ
యద్యర్ధరాత్రి పర్యంతం భవేచ్ఛివచతుర్దశీ
సూర్యోదయం సమారభ్య సైవోపోష్యా సదాబుధైః॥
అర్ధరాత్రేయదానస్మాన్మాఘమాసే చతుర్దశీ
త్రయోదశ్యాయుతాకార్యా సన్తైర్శివపరాయణైః॥

ఇందున మాఘకృష్ణ చతుర్దశినాఁడే జాగరణ యుక్తముగా వ్రతమాచరించుట యాదేశితము. ఇదేపురాణమందు ప్రతిమాసమందును కృష్ణచతుర్దశీ దినమున శివరాత్రిగాభావించిచేయవలెనని వ్రాయఁబడియున్నది.

మృగలుబ్దకుల గురించి యించుక విశేషము చెప్పవలసి యున్నది. అలంపురీ మాహాత్మ్యమను గ్రంధములో పూర్వమొకప్పుడు అలంపురీ దేవాలయమును నాశనముచేసిన «విలసత్» అనురాజు చాల దురాత్ముఁడై మృగయా వినోదియైయుండ నొకనాఁడు వాని సేవకుఁడొక మృగమును తన స్వామి కాహారార్థమై చంపఁబోవ నామృగము ఘనుతోక్తులతో వానిని వాని యేలికను నిందించినట్లును వాఁడధివిని

...శ్చర్యమగ్నమానసుఁడై విలసత్తుతో నివేదించుకొనగా ...విలసత్తు అజింకను। ప్రార్థించి శరణమడుగగా నావ్యాఘ్రము ...నెనెట ‹‹నీవు దేవాలయమును నాశనము చేసినందున మహా ...తకి వైతివి. మరల పాపవిముక్తి పొందఁదలచిన దేవాలయ మును గట్టించి శాంభవి విగ్రహమునుదాని నెదుట నావిగ్రహ మును జెక్కించుము. భక్తులందఱు చూచుచుండ బహుకాల మునకు నీపాపము శమించి నీవుత్తమ లోకములను బొందు దువు›› విలసత్తు అట్లేచేసెను. ఇది పురాణము. దీనికి నిదర్శ నముగా నేటికిని అలంపురీ దేవాలయములో నొక వ్యాధుని యొక్కయు జింకయొక్కయు విగ్రహములు స్తంభములపై ...బడియున్నవి కానవగును.

శివునికి లింగాకారముండు విషయములో ప్రాచ్యప్రతీచ్యు ...ని పరిశోధకులు కొందఱొక నూతన తత్త్వమును లేవదీసి ...రు. లింగము పురుషచిహ్నమని వారియభిప్రాయము. ...పురాతన కాలమందొక నాడు ప్రపంచమందంతటను ...పురుష చిహ్నముల పూజలుండెనని వారి సిద్ధాంతము. ...ప్టులోను, బాబిలోనియాలోను, అసిరియాలోను, కొంతకొంత ...ము, గ్రీసు దేశములందును నీయాచారముండెనని వాదిం ...రు. అదేతత్త్వము మన యార్యావర్తమున లింగపూజ ...బడెనని యందురు. ఆనందకుమారస్వామి (Introduction to Indian art) అను గ్రంథములో నిట్లు వ్రాసియు ...రు. ఒక కాలమందు హిందూస్థానములో పురుషచిహ్న

పూజ జరుగుచుండెను. (Phallus worship). దీనినే ఋగ్వేదమందు „శిశ్న దేవ„ పూజయని వర్ణించిరి. ఈ „లింగము„ తర్వాతికాలమునుండి నేటివఱకును శివునియొక్క „యవ్యక్తచిహ్నము„గా నేర్పడియున్నది. గోపీనాథరావు గారు గుడిమల్లము అనుస్థలములో కనిపెట్టిన లింగముపై నొక యనార్యవిగ్రహమున్నది. ఇది యింతవఱకు దొఱికిన హిందూదేవతా విగ్రహములలో ప్రాచీనమైనది. బహుశః ఇది క్రీస్తునకు పూర్వము రెండవ శతాబ్దము లోనిది కావచ్చును. దీని కింగ్లీషుమూలమునిందు పొందుపఱచుచున్నాను.

We have already spoken of the Vedic reference to Linga worshippers and we may well suppose that phallic, particularly the erect pil-lars were made use of as cult objects at an early date. The Lingam was now adopted into the orthodox faith and has remained to this day the general avyakta symbal of Siva. The Stone Lingam discovered by the late Gopinath Rao of the Gudimullam .................... is the earliest known (1'st or 2'nd B. C.) image of a Hindu diety." ... ... ... ...

వివేకానందస్వామి గారి సిద్ధాంతము నొప్పుకొనరు. గస్టవ్ అపర్టి (Gustav oppret) అనుజర్మనుపండితుండు సాలగ్రామములు స్త్రీలింగచిహ్నములనియు శివలింగములు పురుషలింగచిహ్నములనియు వాదింపగా దానికిల్లు వివేకానం

స్వామిగారు ప్రత్యుత్తరమిచ్చిరి.

"ఈసిద్ధాంతములు నిరాధారములు. శివలింగపూజనుగూర్చి అథర్వవేదమందలియూపస్తంభమును స్తోత్రముజేయుమంత్రమునుండి ప్రారంభమైనది. ఈమంత్రములో నీయూపస్తంభమును "స్కంభ" మని వర్ణించినారు. ఈస్కంభము ఆద్యంతరహితమై పరబ్రహ్మకుబ్రత్యామ్నాయమైనట్లు వర్ణింపబడినది. తరువాతికాలములో యజ్ఞమందలి అగ్ని, ధూమము, బూడిద, సోమలత, యజ్ఞార్థము కట్టెలమోయునెద్దును, శివుని ప్రకాశమానమగు శరీరముగా, నీలకంఠముగా, జటాజాలముగా, శివవాహనముగా మార్పబడెను. అదేవిధముగానీయూపస్తంభము శివునకిబదులుగా బూజింపబడెను. లింగపురాణమందిదే మంత్రమును కథారూపముగ వివరించియున్నారు. సాలగ్రామములు స్త్రీలింగచిహ్నములను కథకేవలము కల్పితము. అవిబౌద్ధుల "ధాతుగర్భముల,, బోలినవగుటచే బౌద్ధులుమొదట వానిని బూజించుచుండిరి. తర్వాతవైష్ణవులు వానిని స్వీకరించిరి"

పైయంశములయొక్క మూలములోని కొంతభాగమిందుదహరించుచున్నాను.

"The Swami said that the worship of the Siva Lingam originated from the famous hymn in the Atharva Veda Samhita sung in praise of the Yupastambha, the sacrificial post. In that hymn, a description is found of the begin-

ningless and endless Stambha or Skambha, and it is shown that the said Skambha is put in place of Eternal Brahman. As afterwards, the Yajna fire, its smoke ashes and flames, the Soma plant, and the Ox that used to carry on its back, the wood for the Vedic sacrifice—— gave place to the Vedic conceptions of the brightness of Siva's body, his twany matted hair his blue throat, and the riding on the bull of Siva, and so on——just so, the Yupa-Skambha gave place in time to the Siva-Lingam and was deified to the high Devahood of Sri Sankara. In the Linga Purana, the same hymn is expand-ed in the shape of stories, meant to establish the glory of the great stambha and the superior-ity of Mahadeva."

——————Swami Vivekananda's works
1923 edition vol. IV. pages 357&358

త్రిమూర్తి సిద్ధాంతము : వేదకాలమందు లేదనియు క్రమేణ యేర్పడెననియు పండితుల యభిప్రాయము. క్రీ॥ పూర్వ ౨ వ శతాబ్దమునందుండిన పతంజలి తన భాష్యములో శివస్కంద విశాఖుల విగ్రహములు తన కాలములో వీధులందమ్మంబడుచుండెనని యుదహరించుటచే శైవసిద్ధాంతము అప్పటికే ప్రబలియుండెనని విశదమగుచున్నది. :

పాణినీయ సిద్ధాంతకౌముదిలో ౫॥౩॥౯౯ సూత్రములో నిట్లున్నది.

సూ॥జీవికార్థే చాపణ్యే॥
దీనిపై భాష్యమిట్లున్నది.

జీవికార్థ యదవిక్రీయమాణం తస్మిన్ వాచ్యే కన్ లు
ప్యేత్। వాసుదేవః॥ శివః॥ స్కందః॥ దేవలకానాం
జీవికార్థాసు దేవప్రతికృతిష్విదం॥ అపణ్యేకిం॥ హస్తి
కాన్విక్రీణీతే॥.

ఇందు సూచితమేమన అమ్మదగనట్టి దేవతా విగ్రహములు
ఆకాలమందు "దేవలకులు" అమ్ముచుండిరి. అట్టివిగ్రహము
లలో ముఖ్యమైనవివాసుదేవుని యొక్కయు,శివునియొక్కయు
స్కందునియొక్కయు విగ్రహములు ముఖ్యమైనవి. దీనివలన
శివస్కందులు ౨౫౦౦ యేండ్లకుపూర్వమే జనసామాన్యమం
దు ఎన్నికకెక్కిన దేవతలని స్పష్టము.
శైవమతమాదియందు కులభేదములను పాటింపక గొప్పసం
ఘసంస్కారమును జేసెను. కాని తర్వాతి కాలములలో నీశైవ
మతసహితము వైష్ణవమతమువలె శూద్రాదిభేదములఁబాటింపఁ
జొచ్చెను.

పార్థివ లింగ పూజావిధానమును వర్ణించుచునొక ప్ర
మాణగ్రంథమిట్లు శాసించినది.

విస్తరేణ పూజాకరణా సామర్థ్యేస్త్రీ శూద్రాణాం
తు శ్రౌతస్మార్త వైదికమంత్రేష్వనధికారాత్. పురాణేను సారి
పార్థివపూజావిధిః॥.........స్త్రీభిః శూద్రైశ్చ ప్రణవరహితః
శివాయనమ ఇత్యేవమంత్రః పఠితవ్యః నమోంతేనశివేనైవస్త్రీ

ణాం పూజావిధియతే విరక్తానాంతు శూద్రాణామేవహి పూజా ప్రకీర్తితా। ఇతిసూతసంహితి వచనాత్॥ ..................
అనగా — స్త్రీశూద్రులకు వైదికమంత్రపూర్వక పూజావిధి కూడదు. పురాణానుసారముగనే లింగపూజ చేయవలెను. స్త్రీశూద్రులు ఓంకారశబ్ద విరహితమైన "నమశ్శివాయ" యనుమంత్రము నుచ్చరింపవలెను.

శివకేశవ విగ్రహములను స్త్రీ శూద్రులు స్పృశించిన నరకమును బొందుదురనుట కీశ్లోకమే నిదర్శనము.

శ్లో॥ శూద్రోవానుపనీతో వాస్త్రియోవాపతితోపివా।
కేశవంవాశివంవాపిస్పృష్ట్వానరకమశ్నుతే॥
శూద్రులచేత బూజింపబడిన లింగము దూష్యమను

ట కీశ్లోకము గమనింపదగినది.

శ్లో॥ యంశూద్రేణార్చితంలింగం విష్ణుంవాప్రణమేన్నరః
నతస్యనిష్కృతిర్దృష్ట్వా ప్రాయశ్చిత్తాయుతైరపి॥
బసవేశ్వరుని యనంతర కాలమునుండియే యెవరిమూ

లమునననో యేమో శైవవైష్ణవులకు బద్ధవైరత్వ మేర్పడి యనేక గ్రంథములలో నుభయులును పరస్పరదూషణమును జేసికొని హిందూమతమునకు గళంకము నాపాదించి యున్నారు.

తైత్తరీయోపనిషత్తు చాలప్రాచీనమైనది. అందిట్లేమంత్రము లనేకములుకలవు.

మం॥ తత్పురుషాయ విద్మహే।
మహాదేవాయ ధీమహి।
తన్నో రుద్రః ప్రచోదయాత్।

ఈమంత్రము గణేశుని గుఱించిన మంత్రమువంటిదే. ఈవిషయమున అచ్చటి విమర్శనను జూడదగును.

హిందూస్థానమందు శైవమతవ్యాపకము బహుప్రాచీనమునుండి వృద్ధిపొందినట్టిది. కాశీవిశ్వనాథుడు శైవసాంప్రదాయ ప్రాచీనతను ప్రాముఖ్యతను నిరూపించుచున్నాడు. దక్షిణ హిందూస్థానమందునిది ఆంధ్రకర్ణాటకులలో భిక్షలుని కాలమునుండి బసవేశ్వర, పండితారాధ్యాదులచేత ప్రచారము చేయబడెను.

ఏదియెట్లున్నను శివరాత్రి శైవులయిన వారిలో శూద్రులకును బ్రాహ్మణులకును సర్వ వర్ణములవారికిని చాల ప్రధానమైయున్నదనుటలో నేమియు సందేహములేదు.



# హరితాళిక



ఈ వ్రతము భాద్రపద శుక్ల తృతీయనాడు చేయబడును. భవిష్యోత్తర పురాణమందీ కథ కలదు. పార్వతీదేవి కన్యకగానుండినప్పుడు శివునిదప్ప నితరుని పెండ్లాడనని నిశ్చయించుకొని యుండెను. కాని కొంత కాలమైన తర్వాత నారదుని ప్రేరణముచే హిమవంతుడామెను విష్ణువునకియ్యనున్నాడని యామెవిని యొక చెలికత్తెను వెంబడించుకొని యరణ్యమునకు పారిపోయెను. అచ్చట యిసుకతో మహాలింగమూర్తులను జేసి వానిని పూజించుచుండెను. ఈశ్వరుడామె ప్రార్థనల నంగీకరించి యామెను పెండ్లాడుటకు నంగీకరించెను. తల్లి [ఆలి] చెలికత్తెచే హరింపబడి పారిపోయినందున నీవ్రతమును హరితాళికా వ్రతమని యందురు.

కన్యకలు అనుకూల భర్తలను బడయుటయు, వివాహితులు వితంతువులు గాకుండుటయు నీవ్రతోద్దేశములు. ఈ వ్రతమును జేయు స్త్రీలు రాత్రియంతయు జాగరణచేసి పగలంతయు నుపవసించెదరు. పార్వతీ పరమేశ్వరులకు పూజ సేయుదురు.

# దూర్వాష్టమి



భాద్రపదశుద్ధాష్టమినే దూర్వాష్టమి యం దురు. ఈదినము దూర్వాపూజను జేయవలెను. ఈ పూజను రోహిణీ యుతమైన శుక్లాష్టమినాడే చేయవలెను గాని జ్యేష్ఠా నక్షత్రములోఁగూడిన యష్టమియందుఁ గూడదు. వ్రతఫలమేమన స్త్రీ యీవ్రతమును జేయునో యామె మూడు జన్మములలో వైధవ్యమును బొందదు. ఈ వ్రతమునాడు శంకరుని వినాయకుని బూజింపవలెనని భవిష్యత్పురాణము చెప్పుచున్నది.

## చంపాషష్ఠి

శ్లో॥ విశాఖా భానువారేణ వైధృత్యా చసమన్వితా।
నభస్య శుక్లషష్ఠీయా సాచంపేతిని గద్యతే

విశాఖా నక్షత్రమ్ము, భానువారమ్ము, వైధృతియోగము, నీమూడును భాద్రపద శుద్ధషష్ఠియందు సంభవించిన చంపాషష్ఠి యనఁబడును. ఈ యోగకాలమందు చేసిన స్నానదానాదికములు అక్షయములై యుండును.

# స్కందషష్ఠి



స్కందుని కార్తికేయుఁడనియు, దక్షిణమున సుబ్రహ్మణ్యుఁడనియు, దానినే యాంధ్రమున సుబ్బరాయుఁడనియు వ్యవహరింతురు. కావున నీ స్కందషష్ఠినే సుబ్బరాయ షష్ఠియనియు నందురు. ఇది విశేషముగా ద్రావిడులలో ప్రాముఖ్యముగ నున్నది. స్కందుఁడు లేక కుమారస్వామి ఈశ్వరుని కుమారుఁడు, ఇతని పండుగను కార్తికశుక్ల షష్ఠినాడు చేయుదురు.



# గౌరీతృతీయ

గౌరీదేవియే పార్వతి. ఈమె శివుని భార్య. హిమవంతుని కూతురు. ఈ వ్రతము స్త్రీలకు ముఖ్యము. ఈ వ్రతమును చైత్రశుద్ధతృతీయనుండి వైశాఖ శుద్ధ తృతీయ వఱకు చేయుదురు. స్కాందమం దిట్లున్నది.

శ్లో॥ చైత్రశుద్ధ తృతీయాయాం।
గౌరీం తాం వ్రతపూజయేత్ ।
యావన్మాసం భవేన్నిత్యం ।
నారీపతిమతీసదా॥

ఈ వ్రతఫలమువలన కన్యకలు వైధవ్యప్రాప్తి పొందరు. ఇందులకు ప్రమాణము జ్యోతిర్నిబంధమందిట్లున్నది.

శ్లో॥ అవైధవ్యకరం స్త్రీణాం
వ్రతపాత్రిప్రవర్ధని॥



# దశహర



దశహర యనగా పది (పాపములను) పోగొట్టునది. ఈపూజ గంగానది నుద్దేశించి చేయఁబడును. దీనినే గంగోత్సవమనియు నందురు. ఇది జ్యేష్ఠ శుక్ల పాడ్యమినుండి దశమి వఱకు జేయుదురు.

గంగానదిని గంగాదేవిగా భావించుట హిందువులకందఱకును సమ్మతము. గంగావతరణము భూలోకమునఁగలిగిన విషయమును పురాణములిట్లు చెప్పుచున్నవి. సగరచక్రవర్తి అనేక యజ్ఞములు చేయుటచే నింద్రునికి దనపదవిపోవునేమోయను భయము వాటిల్లెను. అందుచేనింద్రుడు సగరుని యజ్ఞాశ్వమును దొంగిలి కపిలుడను ఋషితపస్సుచేయుచోట నిలిపెను. సగరునికి ౬౦౦౦౦ కొడుకులు. వారుగుఱ్ఱమునకై వెదకుచు కపిలుడుండు చోటికివచ్చి యతఁడే ఘోటకతస్కరుడని తలంచి యతనిని హింసించిరి. కపిలుడు తనతపోగ్నిచే వారి నిదహించెను. తర్వాత శాంతించి వారిపై గంగోదకము ప్రవహించినవారు సజీవులగుదురని యనుగ్రహించెను. ఈసగరునికి భగీరథుడను మనుమఁడుండెను. అతఁడు తపస్సు చేసి గంగను ప్రసన్ననుగా జేసికొనెను. కానిగంగ భూమిపై పడినప్రమాదము. కావున నీశ్వరుని గురించితపస్సుచేయ నీశ్వరుడు గంగను తనజడలలో నిరికింతునని యొప్పుకొనెను. కావుననే

గంగ ఈశ్వరుని భార్యయై యతని నెత్తికెక్కినది. ఆతావునుండియే యామెయీ భూమిపైకి దిన్నగా పారెను. ఇట్లు గంగచే సగర సంతతి పుణ్యగతినొందెను.

గంగాదేవిని గురించి యింకొక కథ భారతమందున్నది. ఆమె శంతనునికి భార్యయై భీష్ముని గనెను.

గంగోదకము చాల పవిత్రమని హిందువుల విశ్వాసము. గంగాతీరమున నుండు ప్రదేశము లనేకములు తీర్థస్థలములైనవి. ఇవన్నింటిలో ముఖ్యమైనది కాశీక్షేత్రము.

## అశోకషష్ఠి

ఇది చైత్ర శు॥ ౬ దివసమున చేయబడును. ఇది ఉత్తర హిందూస్థానమందే ప్రాధాన్యము వహించినది. స్త్రీలు తమ సంతతికి క్షేమము కలుగుటకై అశోక వృక్షము యొక్క ఆరు పూమొగ్గలను నీటిలో కలిపి త్రాగెదరు. దీనిని గురించిన కథ నిట్లు గుప్తేపండితుడు వ్రాసినాడు:—

ఒకముని యొకనాడొక బాలికను జూచి యామెను పెంచి పెద్దదైన తర్వాత నొకరాజుకిచ్చి పెండ్లిచేసి యామెను పిల్చుకొని పోవుచు కొన్ని యశోకవు విత్తులనిచ్చి మార్గమందు వానిని జల్లుచు పొమ్మనెను. కొంతకాలమునకామె సంతతి యంతయు నశింపగా నామె యశోకము వృక్షముల జాడపట్టుకొని తమముని దగ్గరకుపోయి యాతనివలన మంత్రోదకము

నుగాని తనసంతతిని బ్రదికించుకొనెను.

ఈ కారణముచే స్త్రీలు నేటికిని తమసంతతియొక్క క్షేమార్థమైయీయశోక షష్ఠిని చేయుదురు.



# వారవ్రతకథలు

## ఆదివారవ్రతము

ఆదివారమును ఆదిత్యవారమని యందురు. ఆదిత్యుఁడన సూర్యుఁడు. కావున నీవారమున సూర్యునుద్దేశించి పూజలు సేయవలయును. కైలాస శిఖరమందుఁ బార్వతి యీశ్వరు నిట్లొకనాఁడు ప్రశ్నించెను. "రజోదర్శనకాలమందుఁ దెలిసియో తెలియకయో చేసిన పాపములనుండి స్త్రీపురుషులు ముక్తులగు టెట్లు?" ఈశ్వరుఁడిట్లనెను. "ఓ పార్వతీ! నీవు చాల హితమైనమాట నడిగితివి. ఇది సర్వలోకోపకారమైన విషయము. మనమిద్దఱము "మహామైథున సంకల్ప"మందు చిరకాల ముంటిమి. అప్పుడు నీవే వ్రతమును జేసియుంటివో యావ్రతమునే విష్ణువుకూడఁ దులసీసహితముగాఁ జేసెను. సప్తర్షి భార్యలుకూడ నిదే వ్రతమును జేసిరి. ఈవ్రతము పేరు ఆదివారవ్రతమందురు. లోకములో స్త్రీలు అత్యంత కామోపేతలు. పురుషులు మూఢులు, దురాత్ములు. కావున మహాపాతకులు. వీరు తమ పాపములనుండి ముక్తిఁగోరిన నిరోశ సార్కవారవ్రతమును జేయవలయును. పూర్వము భూలోకమందొక బ్రాహ్మణుఁడిది చేసి ముక్తిఁ బొందెను. ఎట్లన కృతయుగమందు గోదావరీతీరమందు తుందిలుఁడను బ్రాహ్మణుఁడు పూర్వజన్మ పాపఫలితముగా గుష్ఠవ్యాధిగ్రస్తుఁడైయుండెను. ఏమి చేసినను వ్యాధి

కుదురక పోయెను. ఇట్లుండ నాతని గ్రామమునకు దూరముగా నొక యగ్రహారముండెను; అచ్చట యర్కశర్మయను బ్రాహ్మణుడును నతని సహధర్మచారిణియగు సుశీలయను నామెయు నుండిరి. ఈయర్కశర్మ యర్కవారవ్రతమును జేయుచుండెను. ఈవ్రతానంతరము హవిశ్శేషమును బ్రాహ్మణులకు భుజింపనిచ్చెను. అదిభుజించిన బ్రాహ్మణులలో మనకుష్ఠవ్యాధిగ్రస్తుడునుండెను. ఇతఁడు భుజించినవెంటనే కుష్ఠియంతయుమాయమై శరీరము బంగారువన్నె కలదై ప్రకాశింపఁజొచ్చెను.

కావున నిట్టివ్రతము నేమానవులు జేయుదురో వారు ముట్టయిన స్త్రీలముట్టిన దోషమునుండియు, నిట్టివారితో రమించి రోగములు సంపాదించుకొనిన పీడలనుండియు విముక్తులగుదురు. ఈవ్రతమును జేయువారు రవివారమం దుపవసించి మూడుసంవత్సరముల వఱకు సూర్యారాధన చేయవలెను.

విమర్శ||

ఇతర వారవ్రతములవలె నిదియుఁగల్పితమే! అర్కశర్మ యనగాసూర్య శర్మయని యర్థము. సూర్యవ్రతము చేయు కథకై యీ అర్కశర్మ సృష్టియైనాఁడు. మఱియు త్రేతాయుగములో గోదావరీ నదియుండెనఁట! ఇంతియకాక పార్వతియే యీవ్రతముచేసియున్న మఱచిపోయి మరల నీశ్వరుని విచారించినదఁట. ఈజగత్పతులు "మహామైథున సంకల్ప" మందుండిరఁట. తత్పాప పరిహారార్థమై యీశ్వరునిచే సృష్టింపఁబడిన సూర్య

మండల యారాధన యాసృష్టికర్తయే చేసెనట! తాళ్లపా
కవారి కవిత్వము కొంతమాహాత్మ్యము కొంత యున్నట్లున్నవీ
కల్పకుల చమత్కారములు.



# సోమవార వ్రతము

సప్త వారములు కొన్నికొన్ని స్థానములందు పవిత్ర
ముగా నెంచఁబడుచున్నవి. అందు సోమవారమును గుఱించి
యిట్లు చెప్పుదురు. సోమవారవ్రత మాహాత్మ్యమును గుఱించి
భీష్ముని ధర్మరాజు ప్రశ్నింపగా నతఁడిట్లు చెప్పెను. కాంచీపు
రమున దేవస్వామియను బ్రాహ్మణుఁ డుండెను. అతనికి గుణవతి
యనుకూతురును నేడ్గురుకొడుకులును గలిగిరి. ఒకనాఁడొక స
న్యాసివారియింటికివచ్చి యాయింటిబిడ్డ పెండ్లినాఁడే విధవయగు
ననిభావిగతిసూచించిదానినిదప్పించుటకై యతఁడిట్లుచెప్పెను.
సింహళద్వీపమున నొకచాకలిది సోమయనుపేరుగలది యున్న
ది. దానినిమీయింటికిఁ బిలిచికొని వచ్చిన మీగండము తప్పు
ను. ఈపనికై యాబ్రాహ్మణుని కడపటి కొడుకును కూతురును
బయాణమైరి. దారిలోనొక చెట్టుక్రింద నివసించిరి. ఆచెట్టుపై
నొకగృధము ండెను. దానిపిల్లల కది యాహారము తెచ్చి యీ
యాతిథ్యముగొంద నతిథులుండఁ ధామము తినుట భావ్యముగాదనెను.
గృధము వారియిష్టము నెరవేర్తునని చెప్పివారిని మఱునాఁడు

సింహాళములో విడిచెను. వారుచాకలిదాని యింటికిఁబోయి ప్రతిదినము చీకటియుండగే యిల్లూడ్చి శుభ్రము చేయుచుండిరి. ఒకనాఁడు చాకలి యీసంగతి గమనించి వారినిఁ గారణము డిగెను. వారామెను దమగృహమునకు రమ్మని వేడిరి. అటులే యాయమవచ్చెను. కూతునకు నొకబ్రాహ్మణవరుని దెచ్చి వివాహము చేయుచుండగనే వాఁడు మరణించెను. అప్పుడు సోమ తనవ్రతఫలమును వారికిచ్చి యాబాలుని బ్రదికించెను. ఇట్లుచేయగా సోమయింటిలో నందఱు మరణించిరి. కాని మరలనామె సోమవ్రతము నుజేసి తనబంధుల బ్రదికించికొనెను. ఈపూజచేయు నప్పు డశ్వత్థవృక్షమును సోమ వారమునాడు పూజింపవలెను. ఇట్లుధర్మరాజు ఉత్తరచే పూజచేయించి యామెగర్భమందుండు శిశువును బ్రదికించెనట.



## మంగళ వార వ్రతము

ఈవ్రతమునే మంగళగారివ్రత మందురు. ఇదిక్రొత్తగావివాహితులైన దంపతులు మొదటియైదు సంవత్సరములు ప్రతి శ్రావణమాసమందు ప్రతిమంగళవారముచేయుదురు. ఈవ్రతమువలన స్త్రీలువైధవ్య మొందరట. దీనిని బోధించుటకై శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరుని ప్రార్థనపై యిట్లుకథను జెప్పెను.

పూర్వకాలమందు కుండినమనుపురమున నొకకోమటి యుండెను. అతనికిఁగొడుకులు లేరు. ఆతనియింటి ముంగటవ్రి

నమొక భిక్షుకుడు పోవుచుండెను. కాని వీరిభిక్ష యతడు
స్వీకరింపకుండెను. ఒకనాడు భర్త యాదేశమున భార్యభిక్షు
కునిజోలెలో హఠాత్తుగా కొంతభిక్షయిడెను. దానికిభిక్షుకుడు
కుపితుడయ్యెను. చాలవఱకు బ్రార్థింపఁగా నతఁడిట్లనెను.
మీరనపత్యులు. మీవలనఁ భిక్షతీసుకొనగూడదు. మీరు పు
త్రవంతులుకాఁ దలఁచిన సమీపారణ్యమందు భవానీదేవి
యున్నది. ఆమెనుపాసింపుడు, అదేప్రకారము భార్యాభర్త
లు దేవినుపాసించి యామె కరుణఁబడసిరి. దేవివారికొకకొడు
కుగలుగుననియు వాఁడు ౧౬ ఏండ్లకేచచ్చుననియు వరమిచ్చె
ను. ఆకొడుకునుగూడ బడయుటకొక యుపాయము చెప్పెను.
సమీపమందు గణేశవిగ్రహమున్నది. దానిపై నెక్కి యచ్చట
నున్న మామిడికొమ్మలాగి దానినుండి యొకపండును ద్రుంచ
వలయును. భార్య యదేవిధ మాచరించెను. ఒకకొడుకుపుట్టె
ను. వాఁడునానాఁటికిఁ పెఱిగి పెద్దవాఁడయ్యెను. కాని తల్లిదండ్రు
లువాని యల్పాయుష్యమును దలఁచివగచి పుత్రునికిఁగాశి
లో మరణమైన సద్గతియైన యుండుననని వానిఁగొని కాశీకేగిరి.
మార్గమందొక వింత వారికిఁగానవచ్చెను; కొందఱు పడుచులు
ఆటలాడుచు దిట్టుకొనుచుండిరి. అందొకపడుచు సుశీలయను
దానొకను రండా యనితిట్టెను. దానికి సుశీల యిట్లనెను.
మాయింట నేటివఱకందఱును పుణ్యస్త్రీలే, దేవుఁడు మేలుచేసి
న నేను నట్లె కాఁగలదానను. ఈమాటలు కోమటులువిని దా
నినిఱింబడించి దానితల్లిదండ్రుల నొప్పించి భూరిధన మొసఁగి

తమ్మిల్లవానికాబిడను పెండ్లిచేసిరి. వధూవరులతోఁ దల్లిదండ్రులు తమనగరమునకుఁ దరలిరి. ఈసుశీల మంగళగౌరీ వ్రతమునెల్లప్పటికిని జేయుచుండెను. మార్గమందు వచ్చుచుండ శ్రావణ మాసమగుటచే నాబిడ మంగళవారము నాఁడు తప్పక తనదేవిని బూజింప వలెనని అత్తమామలతోఁ జెప్పెను. వారు వచ్చునది యరణ్యము. దేవాలయము లేదు. అప్పుడుమల మట్టితో నొకచిన్న బొమ్మరిల్లు చేసియందు తనమంగళగౌరిని బ్రతిష్ఠించి భక్తితోఁ బూజించెను అంతయామె భర్తకుఁ గాఁ ఏండ్లునిండెను. చచ్చిపడెను. కానిసుశీల యేమియుఁ జలింపక తనదేవిని బూజించి యాజలముతో భర్తశవముపై చల్లగా వాఁడులేచికూర్చుండెను. ఇట్లాసుశీలతనమంగళగౌరీప్రభావముచే భర్తను బ్రదికించుకొనఁగల్గెను. వ్రత గ్రంథములందు కథ ఇంకను విపులముగా నున్నది. సంక్షేపముగా నిందువ్రాయబడినది.

## బుధవారవ్రతము

బ్రాహ్మణుల కాపత్కాలమందు వాణిజ్యము వ్యవసాయముచేయవచ్చునని యాజ్ఞయున్నది. ఇదియాపద్ధర్మముగానే యాచరింప వలయును. తక్కిన కాలమందిది నింద్యము పాపము! సకలజీవరాసులను బ్రదికించు వ్యవసాయము(కృషి) కూడనేల ఘోరపాపమో!

ఒకకాలమందు బ్రాహ్మణులకు గొప్ప యాపదకలిగెను "సాక్షాద్వ్యాసేనయత్ప్రోక్తం విప్రజీవన కారణం" అని సాక్షాద్వ్యాసులవారే స్కాందపురాణమందు సెలవిచ్చిరట. బ్రాహ్మణులను దుష్టరాజులుపీడించిరి. వారందరు కలయంబడి కాశిలో గంగలోఁ బడిచత్తుము కాకయని తీర్మానించి గంగాతీరమున మూడుచాళ్లు ప్రాయోపవేశముచేసిరి. అప్పుడువారికి సాక్షాద్విశ్వనాథుఁడే ప్రత్యక్షమైవారియాపదలు బాపునిమిత్తమై బుధవారవ్రతమును దత్క్రమమును బోధించి అంతర్ధానమయ్యెను.

ఈకథ వ్రతచూడామణిలో నున్నది. ఇది ౧౦-౧౫ సంవత్సరముల క్రిందట గ్రంధకర్తచే కల్పింపఁ బడిన ట్లనుమానముకలుగుచున్నది. ఈకథలోనీశ్వరుఁడు బ్రాహ్మణులతో నిట్లు చెప్పెనయున్నది.

కలౌత్వబ్దసహస్రాణి యావత్పంచ గతానిచ।
విష్ణుస్త్యక్ష్యతి భూలోకం గంగాత్యక్ష్యతి భూతలం॥
అద్యవాంతాధికా ... త్వా కలౌవింశతివత్సరాః।
అనూచానకులంనష్టం వేదోనష్టశ్చ సత్పథః

ఈశ్లోకముల యర్థమునాకిట్లు తోచుచున్నది. ఇతరులకెట్లో.

కలియుగమందు ౫౦౦౦ యేండ్లు గతించువఱకు గంగావిష్ణువులు భూలోకమును విడుతురు. ఇప్పుడు ౫౦౨౦ యేండ్లైన వేదములుధర్మము వేదవిదులకులము అంతయునష్టమయ్యెను.

అని పైశ్లోకముల యర్థము పంచాంగములలో వ్యావహారికకలియుగగతాబ్దములని ౫౦౩౦ కిపైగా చూపుచున్నారు. పై సంఖ్యకదీనికి ౧౦-౧౨ యేండ్లు తేడా! ఏదియెట్లో! కల్పకులయభిప్రాయమేమో?



# గురువారవ్రతము

గురువులనగా దేవతలగురువు. ఇతఁడుబృహస్పతి. గురువారము బృహస్పతివారము కావున నీదివసమున బృహస్పతి పూజ చేయవలయును. మూడు సంవత్సరముల వఱకు ప్రతిగురువారమును నీపూజచేసి బ్రాహ్మణులకు దానములియ్యవలెను. దీనినిగుఱించిన కథనుసూతుల వారు శౌనకాది మహర్షులతో నిట్లుచెప్పెను.

పూర్వకాలమందు చిదంబర క్షేత్రమందు మణీంద్రుండను బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు శక్తిలోపము లేకుండ మూడు సంవత్సరములీవ్రతము చేసెను. అతండు సర్వజ్ఞుండయ్యెను. అతనిదగ్గఱ యవనుఁడను పేరుగల తురుష్కుఁడు నౌకరుగానుండెను. వాఁడుమణీంద్రుడు గురువారమునా డుపవసింపగా తానును భుజింపకుండెను. వానికిఁగూడ వాక్సిద్ధి కలిగెను. ఇట్లు చేయుటచే ద్వాపరయుగాదిలో వీరుసర్వోత్తములై శాపానుగ్రహకర్తలై జన్మించిరి. కావున నీవ్రతమువలన వాక్సిద్ధిఫలముకలుగును.

## విమర్శ

ఈకథయు బుధవారవ్రత కథవలె కల్పితకథయని విశదమగును. ప్రకృతమీకథలోని యాథార్థ్యమును విచారింతము. ద్వాపరాదిలో వీరిరువురు (అనగా బ్రాహ్మణుడు తురుష్కుడు జన్మించిరట. అంతకుముందు వీరు చిదంబరములో నుండిరట). తురుష్కుని పేరు యవనుడట. ద్వాపరాదిలో చిదంబరపట్టణముండెనా? మఱి మూడు యుగములమధ్య నీచిదంబరమెట్లుండగలిగె. అంతదూరమేల పోవలెను. కలియుగాదినుండి క్రీస్తుయుగారంభమువఱకు చిదంబర ప్రాంతమంతయు దండకారణ్యములో చేరియుండెనుగద! ఒకవేళ మనము తలంచు దక్షిణదేశపు చిదంబరము కాక యింకొక చిదంబరము మనకగపడని చిదంబరమొకటి యాద్వాపర యుగమందుండెనని చెప్పిననొక్క నిముసమొప్పుకొందముగాక! ద్వాపరయుగాదిలో తురుష్కులుండిరా? తురుష్కులనగా తురుష్క దేశస్థులనియో లేక తురకలనియో యర్థముతప్ప వేరే యర్థము లేదు కదా? పై తురుష్కసేవకుని పేరు యవనుడట! యవనుడని తురకల మనవారు నేటికిని పిలుతురు. ఏలనన ముసల్మానుల యుత్పత్తిస్థానమగు అరేబియా మనకు పశ్చిమమున నున్నది. లేక యూనాను దేశమునే మనవారు యవనదేశమనిన నదియు మనకు పశ్చిమముననే యున్నది. అయితే యీపదము గ్రీకులకుగూడ మనవారు వాడినారు. అయోనియన్. (Ionian) దీవులలో గ్రీకులుండిరి. వారినే మనవారు యవనులనిరి. ఒకవేళ వారని భావించిన

వారునుమనకుపశ్చిమముననేయున్నారు. ఈకథకు పేసకన్న తురుష్కజాతి వాచకమే ప్రధానముకాన తురుష్కులుద్వాపరయుగమందుండిరని యెవ్వరును జెప్పజాలరుకదా! కావున సర్వవిధములనీకథ విశ్వసనీయముకాదు. కల్పితము అని నిశ్చితము. ఇట్టిపద్ధతినే చిదంబర రహస్యమునం జెల్లును.



# శుక్రవార వ్రతము

ఈవ్రతమునే వరలక్ష్మీవ్రతమనియు నందురు. కైలాసశిఖరమందు పార్వతీపరమేశ్వరులొకనాడు పాచికలాడిరి. ఈయాటయందు పార్వతి యోడిపోయెను. అంతనాలుమగలకు వాదముజరిగెను. ఈవాదమును దీర్పుటకుం జిత్రనేమియను వానినిగోరిరి. చిత్రనేమియీశ్వరుండు గెలిచెననిచెప్పెను. పార్వతి కోపగించికొనిచిత్రనేమికిం గుష్ఠ రోగము గలుగునట్లు శాపించెను. చిత్రనేమిమరల యాదేవిని ప్రార్థించి శాపవిముక్తి నిగోరెను. వరలక్ష్మీ వ్రతమును శ్రావణ శుక్లపక్షమందలి శుక్రవారమునాడు చేసిననీరోగమువాయునని పార్వతి చెప్పెను. ఇతడట్లేపూజించిమేలు పొందెను. ఈలక్ష్మీవ్రతమును పార్వతికూడంజేసి షణ్ముఖునిగనెనట! మఱియు నందుడును విక్రమార్కుడును నీవ్రతమును జేసిరాజ్యములబొందిరంట. నందవిక్రమార్కులు చారిత్రికపురుషులు. ఒకరుచంద్రగుప్తునిచే నాశన

మైరి. రెండవ వారు శాలివాహనునిచే. ఇక వ్రతఫలమెట్టిదో నాబుద్ధికి గోచరింపకున్నది. ఈవ్రతమును జేయువారికి నందవిక్రి మార్కుల యవనసాదరోలు ప్రాప్తింపకుండుగాత!

## శనివారవ్రతము

పూర్వము కోసలదేశమందు దశరథమహారాజు రాజ్యముచేయుచుండగ గొప్పక్షామము సంభవించెను. అప్పుడా రాజు శనిగ్రహమును బూజించి యతని బ్రసన్నునిగా జేసికొని యతనిచే నవ్వాడు శ్రావణమాసమందలి శనివారములందు శనిని బూజించువారు శుభముల బొంది ధనధాన్యయుక్తు లగుదురని వరము బొందె. రాజును నదే ప్రకారమాచరించి లాభము పొందెను. ఇట్లు స్కాందపురాణమందు వ్రాయబడినది.

ఈశనివారములందే తిరుపతి వేంకటేశ్వరుని గూడ భక్తులు పూజించెదరు. ఈ వేంకటేశ్వరుడు కలియుగమందు ముఖ్యదేవుడనియు త్రేతాయుగమందీతడు కుమారస్వామిగానుండెననియు స్కాందపురాణమందు వర్ణింపబడినాడు. మరియు

శ్లో॥ మ్లేచ్ఛరాజసుతోద్వాహ రక్షితాస్త్ర కమండలః॥

అని యితడు స్తుతింపబడినాడు. మ్లేచ్ఛరాజు కూతును నీతడు పెండ్లియాడెనట. మ్లేచ్ఛులన సాధారణముగా తురకల కర్థముచేయుదురు! అట్లైననిదేమి విపరీతమో తెలియదు!

మ్లేచ్ఛయను పదము శాస్త్రములందు అనాగరికుల కర్థముచేసినారు. పురాణములందును నిదియేయర్థముగానియిటీవలవారు మసల్మానులు మన దేశము నాక్రమించిన తర్వాతవారికీపద మంటగట్టినారు. పతంజలి పాణినీయ సిద్ధాంతకౌముదీ భాష్యము వ్రాయుచు పస్పశాహ్నికములో వ్యాకరణమేలచదువవలయునన.

సూ॥ తస్మాద్బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై నాపభాషితవై మ్లేచ్ఛోహవా ఏషయదపశబ్దః॥ మ్లేచ్ఛామాభూమేత్యధ్యేయంవ్యాకరణం॥ తేఅసురాః॥

అనగా:—బ్రాహ్మణుడైనవాడు అపశబ్దములు మాట్లాడినమ్లేచ్ఛుడగును. మ్లేచ్ఛులు అసురులు అనగా అనాగరికులు. కాన నప్రతివాడును తాను మ్లేచ్ఛుడు కాగూడదని కోరినవ్యాకరణమును జదివి అపశబ్దములనుండి తన్నురక్షించుకొనవలెను.

పతంజలి ౨౨౦౦ యేండ్లక్రిత ముండినవాడు. ఇట్టర్థము చేసినను వేంకటేశ్వరుడే మ్లేచ్ఛకన్యను వివాహమాడెనో తెలియదు.



# భక్తేశ్వర వ్రతము



కార్తీక పౌర్ణిమనాడీ వ్రతమును జేయుదురు. ఇది శంకరుని గూర్చి చేయఁబడునట్టిది. భక్తేశ్వరుడన ఈశ్వరుఁడే. ఈవ్రతమును "క్షేమస్థైర్యవిజయాయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం। ధర్మార్థకామమోక్ష చతుర్విధఫల పురుషార్థసిద్ధ్యర్థం। పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం। వంధ్యాత్వని వృత్త్యర్థం। అఖండితలక్ష్మీ ప్రాప్త్యర్థం......" చేయుదురు.

కథ

దీనిని గురించిన కథను శివుడు పార్వతితోనిట్లు చెప్పెను. పూర్వము మధురలో నొకరాజు చంద్రపాండ్యుఁడను వాఁడుండెను. అతని భార్య కుముద్వతి. వీరికి సంతానము లేదు. వీరనేక వర్షములు శివునిగూర్చి తపమ్ముచేసిరి. శివుఁడు ప్రత్యక్షమై "మీకు చిరంజీవినియు, సౌమంగల్య విహీనయు నగు కూతురు కావలెనా లేక అల్పాయువు అతిమేధావియగు పుత్రుఁడు కావలెనా?" అని యడిగెను. "మాకు కొడుకే అవసరము" అని వీరనిరి. కొడుకు పుట్టెను. ౧౬ ఏండ్ల యీడువాఁడయ్యెను. తల్లిదండ్రులు వాఁడింక చచ్చునని చిం

తించి తుదకొక యుక్తి చేయఁ దలఁచిరి. అలకాపురి రాజగు మిత్రసహుని కొక కూతురుండెను. అతనికి భక్తేశ్వర వరప్రసాద బల్దయగు కూతురుండెను. ఆబిడ్డను నొప్పించి తమ కుమారునికి పెండ్లిచేసిరి. పెండ్లి ముగిసిన వెంటనే యముడు ప్రత్యక్షమై యా పెండ్లి కొడుకును దీసికొనిపోఁ దనని పలికెను. పెండ్లికూతురు భక్తేశ్వర లింగమును సదాపూజించునట్టిది. ఆమె మాహాత్మ్యముచే భక్తేశ్వరుఁడు ప్రత్యక్షమై యముని జావఁగొట్టెను. అప్పుడు చిత్రగుప్తాదులు శంకరుని బ్రార్థించి తమ మేలిక తప్పును క్షమింపుమని వేడి యముని బ్రతికించి కొని «బ్రతుకు జీవుఁడా" యని తమ దేశమునకుఁ బోయిరి. భక్తేశ్వరుఁడు పెండ్లికూతు భక్తికిమెచ్చి యామెభర్తకుదీర్ఘాయువిచ్చి పోయెను. ఆకారణముచేఁ బ్రపంచమందీ వ్రతము నాచరింపఁ దొడఁగిరి.



# కేదారేశ్వర వ్రతము

ఈ వ్రతముపై భక్తేశ్వర వ్రతము వంటిది. ఇదియు శివుని గూర్చినదే. ఇంత మాత్రమే భేదముకలదు. అది పూర్ణిమ నాటిది. ఇది అమావాస్యనాటిది. ఇది అశ్వీన్యమావాస్య నాడు చేయఁబడును. ఈ వ్రతము కూడఁ దత్కర్తలకు "ఆరోగ్యమాయుఃకీర్తుల" నిచ్చును. ఈవ్రతముచేతనే పూర్వము పార్వతి ఈశ్వరుని శరీరమందర్ధ భాగమును బొందు భాగ్యమును బొందెను. అదెట్లన- కథ

ఒకనాఁడు కైలాస శిఖరమందు ఈశ్వరునిసభ జరిగెను. అందు భోగము మేళము గూడ జరిగెను. రంభ బాగుగా నాట్యము చేసెను. తర్వాత భృంగిరిటియను నతఁడు భోగ ఋసానల ననుకరించుచు వికట నాట్యముచేసి యందఱను నవ్వించెను. పరమేశ్వరుఁడును ప్రసన్నుఁడయ్యెను. భృంగిరిటి పార్వతిని వదలి ఈశ్వరుని వలగొని నమస్కరించెను. పార్వతికిఁ గోపమువచ్చెను. తనను గూడ సమానముగా లోకము గౌరవింప వలెనని పట్టుబట్టి తపస్సు చేసెను. అప్పుడు గౌతముఁడను ఋషి యామెకుఁ గేదారేశ్వర వ్రతముపదేశించెను. ఈ వ్రతఫలముగా నామె యీశ్వరుని మెప్పించి యతని అర్ధాంగి యయ్యెను.

ఈ వ్రతమునే చోళభూపాలుఁడును నతని భార్యయు వ్యామోహముచే మొదలు చేయనందున రాజ్యభ్రష్టులై తరువాత తెలిసి యీవ్రతమునుజేసి సర్వసుఖములఁ బొందిరి.

# యమద్వితీయ—భ్రాతృద్వితీయ



ఇది కార్తీక శుక్ల ద్వితీయనాడు చేయవలసి నట్టిది. దీనిని గుఱించి సనత్కుమార సంహితావచనముగా నిట్లు చెప్పఁబడు చున్నది. యమునికిఁ జెల్లెలు యమునానది. పూర్వము యమునాదేవి ప్రతిదినముపోయి యమునితోఁ దన యింటికి వచ్చి భుజించి పొమ్మని ప్రార్థించు చుండెను. యముఁడిదిగో నేఁడల్లియో, యెల్లియుండియో వచ్చెదననుచు రాడయ్యెను. అతనికిఁ బనులు విశేషముగుటచే నవకాశము చిక్కలేదు. తుదకొకనాఁడు రానేవచ్చెను. ఆదినము కార్తికశుక్ల ద్వితీయ. తన గణములతోఁ గూడ నతఁడువచ్చి తన సోదరి వడ్డించిన రుచిరాన్నములను భుజించి ప్రీతుఁడై నీకేమి వరము కావలెనో కోరుకొనుమని తన భగిని నడిగెను.

భగిని యిట్లనెను-॥మీరు ప్రతివర్ష మీదినమున నా యింటికి వచ్చి భుజింపవలెను. మఱియు నీదినమున నెవ్వరు సోదరీ హస్తమునుండి వడ్డింపఁబడిన యన్నమును భుజింతురో వారు నరకమును బొందకుందురు గాక!

శ్లో॥ యేచైవభగినీ హస్తాత్కరిష్యంతిచ భోజనం।
తేషాంసౌఖ్యప్రదోహిత్వమే తదేవవృణోమ్యహం॥

యముఁడట్లు యగుఁగాక యని వరమిచ్చుచు మఱియు సెలవిచ్చెను.

"యమునా నదిలో నెవ్వడీ దినము స్నానముచేసి పితృ దేవతలకుఁ దర్పణములు విడిచి తన సోదరిని బూజించి యామె యింటిలో భుజించుచున్నాడో వాఁడు నరక ద్వారమును నెన్నడును జూడఁడు. ఇట్లు వరమొసంగుట చేత

శ్లో॥ తస్మాదపిన రాస్సర్వే కార్తికవ్రతకారకాః
భుఞ్జన్తుభగినీహస్తాత్సత్యంసత్యంనసంశయః॥
యమద్వితీయాంయః ప్రాప్యభగినీగృహభోజనం।
నకుర్యాద్వివషయాంపుణ్యం నశ్యతీతిరవేస్స్మృతం॥

నరులందఱీ దినమున భగినీ గృహమందు భుజించిన పర లోక సౌఖ్యములందుదురు. మఱియు నేసోదరి తన సోదరుని నీనాడు భుజింపఁజేసి భక్తితో నర్చించునో యామె వైధవ్య మును బొందదు. ఇది యీయమ ద్వితీయాకథ.

ఇదే దివసమున భ్రాతృద్వితీయను గూడ జేయుదురు. యమద్వితీయకును, భ్రాతృద్వితీయకును భేదమంతగా లేదు. పేరులందే భేదముకనఁబడుచున్నది. భ్రాతృద్వితీయ యందు సోదరి తన సోదరులను బూజించి యాదరింపవలెను. మఱి యు సోదరుడును సోదరిని బూజించి వస్త్రాదికములను తన విత్తానుసారముగా నొసఁగవలెను.



# అముక్తాభరణము



ఈ వ్రతమును ప్రతిభాద్ర పద శుక్ల సప్తమీ దివసమునం జేయుదురు. ఇది శంకరుని గురించి చేయ బడునట్టిదు జ. దీనివలన సంతానములేని వారికి సంతానము కలుగునట.

శ్లో॥ వంధ్యాత్వ నాశనార్థాయ
పుత్రపౌత్రాభి వృద్ధయే॥

అని వంధ్యాత్వమును బోగొట్టి సంతానము కలిగించు నని చెప్పంబడియున్నది.

దీనిని గురించి స్కాందపురాణమందిట్లు కథకలదు.

పూర్వము దేవకీ పుత్రులను గంసుడు సంహరించి నందున దేవకి శోకార్తకాగా లోమశుడను ముని యామెకీ వ్రతమునుపదేశించుచు నీకథను జెప్పెను.

ఆయోధ్యలో నహుషుడను రాజుండెను. అతనిభార్య చంద్రముఖి. అచ్చటనే విష్ణుగుప్తుడను బ్రాహ్మణుని భార్య భద్రముఖియను నదుండెను. వీరిద్దఱొకనాడు సరయూనదీ స్నానార్థమైవెడలిరి. అందుబ్రాహ్మణ్యాంగనలు వేఫరు అవ్యక్త రూపియగు శివునిబూజించి దోరకమాల కట్టుకొనుట చూచి

విషయము కనుఁగొని తామును దోరకములఁగట్టుకొనిరి. కాని వ్రతముచేయుట మఱచిరి. కొంతకాలమునకు చచ్చి రాజుభార్య కోతిగను, బ్రాహ్మణి కుక్కగను జన్మించిరి. కాలాంతరమున నిరువురు మరలచచ్చి పూర్వమువలె నొకరు క్షత్రియులయింటను, నింకొకరు బ్రాహ్మణులయింటను బుట్టిరి. పూర్వపు చంద్రముఖికి నిప్పుడు ఈశ్వరియను పేరు కలిగెను. పూర్వపు భద్రముఖనిప్పుడు భూషణ యనిపిలిచిరి. వీరిలో భూషణకు సంతానము సమృద్ధి. కాని ఈశ్వరికి పుట్టక పుట్టక ముసలి ముప్పునకొకమూగి బాలుఁడు పుట్టివాఁడును తొమ్మిదవయేట గిట్టెను. ఆకళేబరమును జూచి దుఃఖోపశమనము చేయుటకు భూషణ తన పిల్లలగుంపుతోఁ బోయెను. ఈశ్వరికి సంతతిని జూచి ఈర్ష్యకలిగెను. వారిని జంపించెను. కాని చంపినను వారు మరల బ్రదుకుచుండిరి. ఇదే మాశ్చర్యమని ఈశ్వరి భూషణను బిలిచి విచారించెను. ఆమె యిదియంతయు అముక్తాభరణదోరక మహిమయని వర్ణించెను. ఈ వ్రతమును ౧౨ పేండ్లు చేయుక్రమమును బోధించెను. అట్లామెచేసి సుఖించెను.

ఈ కథను కృష్ణుఁడు ధర్మరాజుతోఁ జెప్పెనఁట.



# సంకష్టహరణచతుర్థి



ఇది గణపతిపూజా సంబంధమగు వ్రతము. పూర్వము పార్వతి తనభర్తను ప్రసన్నునిగా జేసికొనఁ దలఁచి యేమిచేసినను లాభములేక గణపతిని నుపాయ మడిగెనఁట. అప్పుడాతఁడిట్లనెను. "శ్రావణబహుళ పక్షమందు చతుర్థినాఁడు రాత్రి చంద్రోదయ పర్యంతముపవసించి గణపతిని బూజించినసర్వకష్టములనుభవించినలోకులుసౌఖ్యముపొందుదురు. నీవును నీవ్రతమును జేయుము. ఈశ్వరుఁడు త్రిపురాసుర వధాకాలమునఁనిది చేసెను. రావణుకును రాముఁడును, ధర్మరాజును, దమయంతియు, నహల్యయు దీనిని జేసిలాభముపొందిరి."

ఇది సంకష్టహరణ వ్రతము.



# వటసావిత్రీవ్రతము



ఇది జ్యేష్ఠపూర్ణిమనాఁడు చేయఁబడును. "క్వచి ద్దేశజనై రాచరితం వ్రతమిద" మని వ్రత కారుఁడు వ్రాయుటచే నీవ్రతము కొన్ని దేశములం దున్నదనియు కొన్నిఁటలేదనియు విశదమగును. ఈవ్రతమును గురించినకథ సుప్రసిద్ధమైనది. కావున మరల వ్రా యవలసిన యావసరములేదు. ఇది సావిత్రీకథ. సావిత్రిసత్యవం తునివివాహమాడి యతఁడుచావగా యముని వెంటఁబడి యాత నిమెప్పించి తనభర్తను మరల బ్రతికించికొని నట్టివీరపత్ని. ఈకథ నెఱుఁగని స్త్రీకాని పురుషుఁడుకాని హిందువులందు లేరు. ఈవ్రతమాచేవినుద్దేశించి పుణ్యకాంతలు తమకువైధవ్యప్రా ప్తికాకుండుటకై చేయుచుందురు.



# ఏరువాక పున్నమ



ఈ పండుగ బ్రాహ్మణేతరులలో అందు ముఖ్యముగా వ్యవసాయకులలో— (జాలప్రా ముఖ్యము వహించినట్టిది. ఈపండుగనుగు రించి యేవ్రతగ్రంథమందును జర్చలేదు. "ఏరువాక" అనుపదము దేశ్యపదముగాఁ దోచుచున్నది. సంస్కృత పదము కానందున నిదియాంధ్ర దేశమందే ప్రచారమందున్న పండుగయని తేటపడును. ఈపండుగకుఁ బర్యాయామ్నాయమైన పదము సంస్కృతమందేమైన యున్నదో యేమోయని వ్రతగ్రంథములందుఁ జూచితిని. ఎందునులేదు. ఈపండుగను జ్యేష్ఠ పౌర్ణిమనాడుచేయుదురు. వ్రతగ్రంథములందు జ్యేష్ఠపౌర్ణిమనాడు వటసావిత్రీవ్రతము చేయవలసినదని యున్నది. దానికినిదీనికిని సంబంధమేమియుగానరాదు. కావున నావిషయమును ద్రోసివేయవలసివచ్చెను. ఇక ఈపండుగ కేవలము తెలుఁగువారిలోనందును సేద్యకాండ్రిలో నున్నదని– ఏరువాక అనుపదమునుండి యూహింపబడుచున్నది. కానియిది యిట్లు కాదు. ఈపండుగ పూర్వకాలమందు హిందువులందఱిచే గావింపంబడుచుండెను. ఏరువాక యను పదమునకు ఆంధ్రదీపికా నిఘంటుకారుఁడిట్లర్థము వ్రాసియున్నాఁడు.

ఏరు=సర్వావయవములుకల నాగటికి మొదనుపూసినది. సర్వావయవములుగల నాగలి. ఏరువాక—దున్నుటకారంభము.

శబ్దరత్నాకరనిఘంటు కారులును నిట్లుసెలవిచ్చి యున్నారు.

ఏరు=ఎద్దులనుగట్టి దున్నుటకు సిద్ధపరచిన నాగలి.
ఏ॥ వాక=దుక్కియొక్క ప్రారంభము.

ఈరెండర్థములను విచారించి చూచిననిదివ్యవసాయకులకు సంబంధించినదని విశదమయ్యెడి. ఈపండుగవర్షర్తువు యొక్కయారంభదశలో జేయఁబడును. అప్పుడువర్షములుగురిభూమిపదునైనమొదల (పునర్వసుకార్తిలో) పునాసవిత్తనము బవేయుదురు. (పునర్వసు నుండియే పునాసపద మేర్పడినది.) ఈ పండుగనాడెద్దులకు పైకడిగి కొమ్ములకు రంగులువూసి గజ్జెలు,గంటలు,అద్దము,కుచ్చులు మెడనుగట్టియలంకరింతురు. ప్రొద్దుననే యింటిలో పొంగలి(పులగము)చేసి యెద్దులకుఁబెట్టుదురు. ఎద్దులను గట్టివేయు గాఁడికి ధూపదీపనైవేద్యము లిత్తురు సాయంకాలమందు తప్పెట, మేళము, మున్నగు మంగళ వాద్యములతోనూరి పసులనన్నిఁటిని నూరిబయటకుఁ దోలుకొని పోవుదురు. ఊరవాకిటి కొక పుంటినారతోఁ జేసిన తోరణము కట్టుదురు. ఈ తోరణమును గ్రామజనులు చేతు కోలలతోఁగొట్టి పీచుపీచుచేసి యెవ్వారికి దొరికిన పీచువారు తీసికొనిపోయి యింటఁబెట్టు కొందురు. ఇది పసులకు మేలు కలిగించునదని వారి విశ్వాసము.

ఈపండుగ నాంధ్రదేశ మందంతటను వ్యవసాయకులకుఁ బ్రాముఖ్యమైనది.

ఈపండుగ ప్రాచీనమైనదిగా గన్పట్టు చున్నది. సుమారు ౩౦౦ సంవత్సరముల క్రిందట కడప జిల్లాలో కదిరిని పాలించినఖాదిరీపతి వ్రాసిన శుకసప్తతిలో పసుల పొంగలి వర్ణింపఁబడినది. ఈ ఏరువాక పున్నమ నేను పైవవర్ణించి నట్లుగా బసులకు ముఖ్యమైనది. మఱియు నీపండుగనే పసుల పొంగలియని కవి వర్ణించినాడు.

క॥ ఈరీతినుండ మచ్చిక।
దేరన్వలసినవియెల్లఁ జెప్పించుటకై।
వారసతుల్బాజాగులతో।
శోరామిరోయనర్పఁ బసులపొంగలివచ్చెన్॥

సీ॥ ఇంకనాల్గావంబు లిడనై తిగాయంచు
కుమ్మరినెమ్మది గుందికొనగ।
గుడుముదూకలకెల్ల గొననైతిగా
యంచుబేరితేరని యారివేరమెంద।
గొజియమందల నించుకొననైతిగాయంచు
గొల్లవాఁడూరకే కుల్లుకొనగ।
బెనుపసుపెవిత్తు కొననైతిగాయంచు
గాపునిద్దురలేక కళవళింప।

గీ॥ మొనసివెలచూపి చూపకమునుపెవారి।
సరకులమ్ముడువోవె నేజాతివారి।
కైనిపాటింపవలసి ఫెరెక్కినట్టి।
యాదినంబున సంబరుపోయెనాత్త॥

సీ॥ ఆవుడుపొంగటికైన బియ్యంబుఁదెమ్మ!
శీఘ్రమునసంచు నొకహూక చేతికిచ్చి।
యత్త ప్రామ్మన సమ్మనోహరాంగి।
సాంద్రమైనట్టిచెంగటి సంతకరిగె.

ఈ పై వర్ణనలఁబట్టి యిది ఏరువాక పున్నమవర్ణన యని తెలియఁగలదు. జ్యేష్ఠ మాసమందే పసుపు నాటుదురు. మఱియు వర్ష కాలము వచ్చువఱకే కుమ్మరి యావము పెట్టి కుండలు తయారుచేసి యుంచును. ఈ పండుగలో ఫాలగముతోఁ బాటిగ జొన్నలు ప్రధానముగా పంటతావులలో (Staple Crop) జొన్నకుడుములు కూడఁజేయుదురు. కావున కదిరీపతి పేరవు (కడపజిల్లా) శేరి యాకుడుముల గుఱించియే వరితపించినాడు. "ఏజాతి వారికైన బాటింపవలసి పేరెక్కినట్టి యాదిన" మనుటచేత నీపండుగ పామర జనులకేకాక సర్వులకుఁ జాలముఖ్యమైనట్టిదని సూచన.

విమర్శ

ఏమి విచిత్రమో వ్యవసాయ ప్రాధాన్యమగు నీభారత వర్షమందు మనుస్మృతి కాలమునుండియే బ్రాహ్మణులువ్యవసాయమును నిరసించి యున్నారు. ఇది శూద్రుల పనియని తలఁచినారు. వారు పండించిన పంటల నుపయోగించుటయే తమ పనియనియుఁ దలఁచినారు. కావుననే నేటికాలమందును బ్రాహ్మణులు స్వయముగా సేద్యము చేయుటలేదు. ఇట్లు ఏరి దృశ్యమును మాఱిన నాటినుండియే కాఁబోలు ఏరువాక

పున్నమ కూడ వ్రతగ్రంథముల కెక్కక పోయెను. కాని తక్కువ జాతులనఁబడు తక్కిన హిందువు లందఱు మాత్రము బహుప్రాచీన సాంప్రదాయ సిద్ధమైన నీపండుగను జేయుటను మానకపోయిరి. పామరుల పండుగ యగుటచే వ్రత గ్రంథ కారులును దీని జోలికిఁ బోయినవారు కారు.

యథార్థ మాలోచించిన నీ ఏరువాక పున్నమనే సంస్కృతమందు "ఉద్వృషభయజ్ఞమ"ని పూర్వకాలమందుఁ జేయుచుండిరి జైమినీయ న్యాయమా లా గ్రంథమందుహోలాకాధి కరణములో నిట్లు మన పండుగ సూచనగానున్నది.

సూ॥ ఉద్వృషభయజ్ఞాదయ ఉదీచ్యైః।
జ్యేష్ఠమాసస్య పౌర్ణిమాస్యాం బలీవర్దాఁ
అభ్యర్చ్యప్రధావ యంతిసో ౽ మ్ ఉద్వృషభయజ్ఞః॥

భావము:ఔత్తరాహులు ఉద్వృషభ యజ్ఞము చేయుదురు. ఇది జ్యేష్ఠమాస పౌర్ణిమనాడు చేయఁబడును. ఆనాడు ఎద్దులను బూజించి వాని నురికింతురు. ఇదియే ఉద్వృషభ యజ్ఞమనఁబడును.

ఇట్లు జైమినికాలము నాటికే యీ పండుగ ప్రసిద్ధమై యుండెను.

ఈ యజ్ఞమునే అచ్చ తెనుగులో ఏరువాక పున్నమయని యనిరి. జైమిని చూపించినతిథియు సరిపోవుచున్నది. కృషికులకు ఎద్దులే జీవిత సర్వస్వము. కావున వానిపూర కృతజ్ఞతా సూచకము. ప్రశంసనీయము.

# మంటియెద్దుల అమాస



ఇదియుఁ బైపరువాక పున్నమవలె సేద్యగాండ్రలోఁ జాలముఖ్యమైనది. జ్యేష్ఠమాసాంతమందు అమావాస్య నాఁడిది చేయఁబడును. ఆదివసమున మంటిచే నెద్దులను జేసి గాడిలోనుంచి వానికి గుగ్గిళ్ల నైవేద్యమిచ్చి పూజింతురు. ఈ మంటియెద్దులను బిమ్మట తీసి యొక గూటిలో మరల యొక సంవత్సరమువఱ కుంచుదురు. రెండవ పండుగ యప్పుడీ పాత మంటియెద్దుల పాఱవైచి క్రొత్త విగ్రహముల చేయుదురు. పశువులే సేద్యగాండ్రకుఁ జాల ప్రధానమైన సంపద. వీని మూలముననే వారి జీవనము జరుగును. కావున వారు కృతజ్ఞులై వానిని బూజించుటలో విపరీతమేమియునులేదు.

ఈపండుగ నాంధ్రదేశ మందంతటను నున్నదో లేదో కాని కర్నూలు జిల్లాయందును నిజాంరాష్ట్రమందుఁ గొన్ని జిల్లాలయందును గావింపఁబడు చున్నది.



# ప్రతి మాసమందలి పండుగల పట్టి

## చైత్రము

| పండుగ | తిథి | విశేషము: |
|---|---|---|
| ఉగాది | శు॥ ౧ | ఆంధ్రుల సంవత్సరాది. |
| గౌరీతృతీయ | శు॥ ౩ | మహారాష్ట్ర స్త్రీలకుము ఖ్యము. |
| అశోకషష్ఠి | శు॥ ౬ | స్త్రీలకు ముఖ్యము. |
| శీతలాసప్తమి | శు॥ ౭ | బెంగాలునందుమాత్రమే |
| శ్రీరామనవమి | శు॥ ౯ | అందరికిని. |
| హనుమజ్జయంతి | శు॥ ౧౫ | మధ్వులకు ముఖ్యము. |

## వైశాఖము

| | | |
|---|---|---|
| అక్షయ తృతీయ | శు॥ ౩ | |
| పరశురామ జయంతి | శు॥ ౩ | బ్రాహ్మణులకు మాత్రమే. |
| నృసింహజయంతి | శు॥ ౧౪ | |
| కూర్మజయంతి | శు॥ ౧౫ | |
| బుద్ధజయంతి | శు॥ ౧౫ | |

## జ్యేష్ఠము

| | | |
|---|---|---|
| దశహార | శు॥ ౧ | స్త్రీలకు ప్రధానము. |
| వటసావిత్రి | శు॥ ౧౫ | స్త్రీలకు మాత్రమే. |
| ఏరువాక పున్నమ | శు॥ ౧౫ | వ్యవసాయకులకుమాత్ర. |
| మంటిరెద్దుల అమావాస | బ॥ ౩౦ | ,, మే |

## ఆషాఢము

| | | |
|---|---|---|
| చాతుర్మాస్యము | శు॥ ౧౧ | శు॥ ౧౧ నుండి నాలుగు మాసములవరకు ఇదియే ప్రథమైకాదశి లేక శయనైకాదశి. |
| ఏకాదశి | ,, | |

## శ్రావణము

| | | |
|---|---|---|
| నాగపంచమి | శు॥ ౫ | |
| శ్రావణపూర్ణిమ | శు॥ ౧౫ | ద్విజులకు ప్రధానము దీనినే రక్షికా పూర్ణిమ తదపభ్రంశమైన రాకీ పున్నమయనియు నందురు. |
| సంకష్టహరణ చతుర్థి | బ॥ ౪ | |
| జన్మాష్టమి | బ॥ ౮ | |

## భాద్రపదము

| | | |
|---|---|---|
| హరితాళిక | శు॥ ౩ | స్త్రీలకు ప్రధానము. |
| గణేశచతుర్థి | శు॥ ౪ | |
| ఋషిపంచమి | శు॥ ౫ | |
| చంపాషష్ఠి | శు॥ ౬ | |
| అముక్తాభరణము | శు॥ ౭ | |
| దూర్వాష్టమి | శు॥ ౮ | |
| వామన జయంతి | శు॥ ౧౨ | |
| అనంతచతుర్దశి | శు॥ ౧౪ | |
| మహాలయ పక్షము | బహుళపక్షము | ఈ పక్షమందు పితృతర్పణములు జరుగును. |
| కపిలాషష్ఠి | ,, | |

## ఆశ్వీజము

| | | |
|---|---|---|
| నవరాత్రులు | శు॥ ౧ నుండి ౯ వఱకు | వీనినే దేవీ. నవరాత్రులనియు, మహా నవమియనియు నందురు. |
| విజయ దశమి | శు॥ ౧౦ | |
| దీపావళి | బ॥ ౧౪ | |
| కేదారేశ్వరవ్రతము | బ॥ ౩౦ | |

## కార్తీకము

| | | |
|---|---|---|
| యమద్వితీయ / భ్రాతృద్వితీయ | శు॥ ౨ | |
| స్కందషష్ఠి | శు॥ ౬ | |
| భీష్మైకాదశి | శు॥ ౧౧ | |
| తులసీ వ్రతము | శు॥ ౧౨ | స్త్రీలకు ప్రధానము. |
| భక్తేశ్వర వ్రతము | శు॥ ౧౫ | |

## మార్గశిరము

| | | |
|---|---|---|
| దత్తాత్రేయ జయంతి | శు॥ ౧౦ | |

## మాఘము

| | | |
|---|---|---|
| వసంత పంచమి | శు॥ ౫ | |
| రథసప్తమి | శు॥ ౭ | |
| భీష్మాష్టమి | శు॥ ౮ | |
| మహాశివరాత్రి | బ॥ ౧౪ | శైవులకు మాత్రమే. |

## ఫాల్గుణము

| | | |
|---|---|---|
| హోలీ | శు॥ ౧౫ | వసంతోత్సవ భేదము. |

# అకారాది విషయ సూచిక



